శ్రీ

దోమకొండ సంస్థానాధిప

రాజ రాజన్య రాజకంఠీరవాస్థాన కవికుల శేఖర

రాపాక లక్ష్మీపతికవిప్రణీత



# భద్రాయురభ్యుదయము



ఇది

శ్రీ రాజా రామచంద్రరావు బహద్దరుగారిచేఁ

ప్రకటింపఁబడియె.

COCANADA:

Printed by Proprietor, P. Brahmananda Rao

at the Sujanaranjani Press,

1908.




*Raja Ramchunder Rao,*
*Domkonda.*



# శీర్షకము



సీ. కామినేన్యన్వయ • కలశ పాథోరాశి
పార్వణచంద్రబింబం • బనంగ
శ్రీమదుమాపతి • క్షితిపాలశేఖర
బహుజన్మకృతతపః • ఫల మనంగ
లలితగుణాలంబ • లచ్చమాంబా గర్భ
కమనీయతమమౌక్తి • కం బనంగ
బాలచంద్రకిరీట • పదయుగరాజీవ
మకరందమత్తబం • భర మనంగ

మహిత వేంకటలక్ష్మమాం • బా మనోజ్ఞ
సంతతవిహారి రాజహం • సం బనంగ
రామచంద్రాహ్వయుండు శ్రీ • దోమకొండ
ధరణిధవుఁ డెసఁగుఁ గవిమం • దారమతఁడు.

మ. తనకుం బ్రపితామహుండు బహువి • స్తారప్రథాశాలి రా
జనభూపాలుఁడు పూర్వ మం దతనిసం • స్థానంపువిద్వత్కవీం
ద్రునిచే నీభరతాయురభ్యుదయ మెం • తోఁ బ్రీతి జేయించి యుం
చిన నాకావ్యము తాళపత్రగతమై • జీర్ణించె నానాటికిన్.

ఉ. ఈౘకఱ౼ట దక్షిణవి ◆ ధంబునఁ బండిన పొట్లకాయయై
చీఁకిన గ్రంథముల్ విబుధ ◆ సింహులచే మఱి వ్రాయఁజేసి ము
ద్రాకలితం బొనర్చి తమ ◆ తాతల కీర్తికి వన్నెఁదెచ్చె సు
శ్రీకుఁడు రామచంద్రనృప ◆ శేఖరుఁ డందఱుఁ దన్ను మెచ్చఁగన్.

చ. అవనిఁ బ్రసిద్ధిఁ గాంచిన మ ◆ హాత్ములకున్ మృతిఁ బాపి తత్కృతుల్
ప్రవిమలరీతిఁ జేయుటక ◆ పాగపరిశ్రమ మొందనట్టి స
త్కృతుల ఋణంబుఁ దీర్చుటనఁ ◆ దత్కృతసత్కృతిపుంజ మందఱున్
దవిలి పఠింపఁగాఁ దగు వి ◆ ధంబున వెల్లడసేయుటే కదా.

మ. తన విద్యాత్యనురక్తి తేటపడ శ్ర ◆ ద్ధాబద్ధుఁడై తాళప
త్రవిశీర్ణం బయినట్టిసత్కృతిని వి ◆ ద్వద్బృందసాహాయ్యసం
జనితోత్సాహసమగ్రబుద్ధిఁ బునరు ◆ జ్జాతంబుఁ గావింపఁజే
సిన యత్నంబు ఫలింపదే కవిజనా ◆ శీశ్శక్తిమూలంబునన్.

29-12-07
దోమకొండ.

ఆదిపూడి ప్రభాకరకవి.
పిఠాపుర సంస్థానము.



రాకారంబులు గల్గు లోకముల నె • య్యంబొప్పఁ గల్పించి తా
నేకాకారత నొందు నాస్ఫురణనే • నేతత్కృతిం దల్చెదన్. 5

చ. విలసితమైన యమ్మహిర • బిందువు ముద్దుమొగంబు గాఁగ నా
జ్వలనసుధాంశుబిందువులు • చక్కని సిబ్బపుగబ్బిగుబ్బలై
యలరఁ బరార్ధమెన్న రశ • నాస్పదమై విలసిల్లుచుండ వ
ర్తిలు తదభేదయైన పర • దేవిఁ దలంచెద నిట్టిసత్కృతిన్. 6

మ. అమితాలంకరణాభిశోభితయు మా • యాపాయ దుర్మంత్రచం
క్రమణ ప్రక్రమ మార్గ దుర్గ జయవి • ఘ్నప్రాజ్య యంత్రాద్యుప
క్రమ నిర్వక్రపరాక్రమ స్థితి విశు • క్రప్రాణ హృచ్ఛాపశౌ
ర్యమునన్ మించిసమంచితాత్మ యగువా • రాహిన్మదిం దల్చెదన్. 7

మ. కరమొప్ప న్మను తాళభేదనియతుల్ • గాలక్రియామానముల్
త్వరితస్ఫూర్జితమూర్ఛనాంతరములు • త్పాదించి వీణావినో
దరతిన్ సొంపు జనింపు పెంపుగల మా • తంగాంగనన్ బాడ సు
స్థిరసింహాసనవాసయై తనరుల • క్ష్మిన్ నెమ్మదిం దల్చెదన్. 8

శా. కాదంబాళి చకోరికా పిక శుక • క్రౌంచాది పత్త్రి స్ఫుర
త్కాదంబప్రసవ ప్రభూత మధు సం • ఘాతాప్లుతాకారయై
కాదంబ ర్యదనప్రమోదన నట • త్కాంతా నినాదార్భటీ
కాదంబస్థితి గల్గు దేవినిఁ బుర • స్కరింతు నేతత్కృతిన్. 9

శా. ఆదిం దివ్యవిమర్శరూపిణియునై • యా శ్రీప్రకాశాత్మతా
మోదం బేర్పడ నీచరాచరజగ • న్మూలంబు తానయ్యుఁ ద
త్ప్రాదుర్భూత పరాద వైఖరులచే • భాసిల్లుచో ముం దహం
తేదంతైక్యము నా పరాకళను నే • నేతత్కృతిం దల్చెదన్. 10

మ. సకలస్థావరజంగమాత్మకజగ • జ్జాలంబు నిర్మించి త
త్ప్రకటీభూతములైన కార్యములను • త్పాదించి బ్రహ్మాండక
ల్పకుఁడై నిక్కపునాదునన్ వెలయు నా • భారత్యధీశుండు ద
వ్యకవిత్వాంచితయైన మత్కృతిని ని • త్యానంద మొందించుతన్. 11

మ. సమసూక్ష్మాత్మకదశాసమేత చిదచి • జ్జ్ఞానస్వరూపంబు జెం
ద మహాస్థూలదశాసమేత చిదచి • త్కార్యస్వరూపంబునం

బ్రమదంబేర్పడ నాకకఁడై జగములన్ ♦ రక్షించు లక్ష్మీశ్వరుం
డమితస్తోత్రకృ దస్మదీయ కృతి నా ♦ హ్లాదంబు నొందించుతన్. 12

మ. వనజాక్షుండు పురందరోపలము నై ♦ వర్తింపఁ దా నాజపా
కనదచ్ఛప్రసవంబు నై తనరి త ♦ త్తాకయంబులో వెల్పలం
దనకాంతిం బ్రసరింపఁ జేయుచును ము ♦ దత్స్వవినాభాతయై
మునుగనుపట్టిన లక్ష్మి మత్కృతిని స ♦ మ్మోదంబు నొందించుతన్. 13

మ. యతులోకకప్పుడు భక్తిచే నిజసహ ♦ స్రారంబులన్ శ్రీశ్రియః
పతిఁ బూజించు టదెంత నే సతత మ ♦ ప్పద్మాక్షు నంతర్బహి
ష్ఠితునిం జేసి తదాజ్ఞచే ననురయో ♦ షిత్కాంత కైవల్యసం
యతవృత్తిం జరియింతు నంచును సహ ♦ స్రారంబుఁ దత్తుంగకృతిన్. 14

సీ. సగర్వ యోక్త్రాద నో ♦ త్సుకత వచ్చునా యందు
నినుఁ డనూరుప్రేమ ♦ ననుసరింపఁ
గార్ముకజ్యాజిష్ణు ♦ క్షను జను దెంచునో
యని శంకరుఁడు శంకఁ ♦ గొని వచింపఁ
దల్పాగసనబుద్ధిఁ ♦ దలపోయునో యని
హరి యాదరంబున ♦ ననునయింప
యజ్ఞోపవీతసం ♦ హరణార్థ మేతెంచు
నో యని విఘ్నేశుఁ ♦ డూహఁ జేయ
నీజగరున్మరుదుద్ధూత ♦ నిఖిలభూమి
ధరుఁడు పణభృతయువతిప ♦ త్త్రిప్రహరణుఁ
డైన శ్రీవైనతేయుండు ♦ నస్మదీయ
కలుషము లడంచుఁ గావుతఁ ♦ గరుణతోడ. 15

మ. మును గృష్ణార్జునపక్షవిస్ఫురణతన్ ♦ మోదంబుఁ గల్పించి సొం
పునఁ గృష్ణార్జునపక్షవిస్ఫురణ నీ ♦ భూతప్రపంచంబు నే
ర్పునఁ గన్పట్టఁగ జేయుచో నిజపదాం ♦ భోజాతము ల్గొల్చువా
రిని రక్షించు శివుండు మత్కృతిని సు ♦ శ్రీ నొందఁగాఁ జేయుతన్. 16

శా. శ్రీకాంతారుచిరత్వ మెల్లపుడు వీ ♦ క్షింప న్మదిం దల్చి య
స్తోకంబౌన నిమేష మొందు నని వి ♦ స్ఫూర్జత్కటాక్షాలయ

ప్రాకట్యస్థితి నొందఁజేసి సకల • ప్రాణ్యుత్సవం బెంచు నా
శ్రీకాంతుండగు వేంకటేశ్వరుఁడు ర • క్షించు న్మహంచత్కృతిన్. 17

శా. శ్రీవాణీశముఖామరాధిపు లిదం • సృష్ట్యాదిలో నాత్మలం
దేవానిన్ భజియించి హృద్యఫలసా • హిత్యంబు మున్ జెంది ర
ద్దేవుం దజ్జయవిఘ్నయంత్రహరునిన్ • దీనావనున్ సిద్ధల
క్ష్మీవిఘ్నేశు నిరంతరాయమునకై • చింతింతు నేతత్కృతిన్. 18

శా. శ్రీరామాయణ భారతాఖ్య రచనా • జేగీయమానప్రథా
ధారంధర్యసమేత వాస్తవకథా • ధన్యాత్మ వల్మీకభూ
పారాశర్యులఁ గొల్చి ఛందముల సం • పాదించి వృత్తప్రభే
దాహూషస్థితు లెంచు పింగళభుజం • గాధీశ్వరుం గొల్చెదన్. 19

గీ. కావ్య నాటక సంగ్రహ • కాళిదాస
దండి భవభూతి శంకర • డిండిమాంక
రామకవి చోర మాఘ భా • రవి మయూర
బాణ బిల్హణ ముఖుల మున్ • ప్రస్తుతించి. 20

ఉ. ప్రాకృత సంస్కృతాంధ్ర పర • భాగములుల్లసిలంగ నైకృత
వ్యాకరణంబుఁ జేసి బుధ • వత్సలతన్ సకలార్థవత్పురా
ణాకలితేతిహాసముల • నన్నివచించిన నన్నయార్య సు
శ్లోకునిఁ దిక్కయజ్వను వ • చోనియతిన్ వినుతింతు మత్కృతిన్. 21

గీ. తెలివిలేక ప్రదోషైక • దృష్టి రూఢి
విఘసనవిబాధితావృత్తి • నెలయుచుండ
సంతతారుంతుదోక్తులు • సల్పుచుండు
కాకవులు కాకవులుగాక • కలితమతులె. 22

క. కృతులుగల కృతులొనర్చని
కృతులఁ దలంచియుఁ దలంచ • కెంతేని నిరా
కృతులంచుఁ గృతులొనర్చిన
కృతులఁ దలంచంగ నేల • పృథ్వీస్థలిపై. 23

వ. అనియిష్టదేవతా గురు సుకవి కుకవి నమస్కరణ పురస్కరణ తిరస్కరణంబు లొనరించి యొక్కపాకమేశ్వర సపర్యాధర్యాధుర్యుండగు మహామహీశ్వరు దర్శించు తలంపున నుండునెడ. 24

సీ. నవరత్నమౌళి సం • భవ మహఃపుంజంబు
ముందు జ్యోతిశ్చక్ర • మును హసింపఁ
గరుణారసస్యంది • సరసనేత్రంబులు
సితకరార్కులఁ గేణి • సేయుచుండఁ
చారుముక్తాఫ లో • దారహారద్యుతుల్
గురుభార్గవులకు సం • కోచ మొసఁగ
సకలమణీమయ • చ్ఛన్నవీరప్రభల్
రత్నసానుచ్ఛవి • రహినడంప
సామి తన్మూర్తిభృ జ్జగ • జ్జనని ప్రేమ
దెలియఁగఁ బరాపరప్రకృ • తిత్వ మొందు
భవ్యసమయ స్వరూపప్ర • భావ మహిమ
నలరి యొకదేవదేవుండు • పొలిచె మదని. 25

వ. ఇట్లుస్ఫురించిన విశేషఫలంబు నగునని తలంచి. 26

మ. పరవిద్యానుసమాన మీననయనా • ప్రాకాశ నీకాశ సుం
దర పాదద్వితయోల్లస న్నఖముఖాం • తర్బింబిత ప్రత్యగాం
తర దృక్తారక నామయోగి గురుపా • దద్వంద్వము న్నెమ్మదిన్
స్థిరతం జెందఁగఁ జేసి ప్రత్యగయనా • ప్తిం బొందఁగా నాకృపన్. 27

క. శ్రీరాజేశ్వర వరకరు, ణారూఢి కటాక్షవీక్ష • ణాగత లక్ష్మీ
పూరిత ధనధాన్యాది, శ్రీరామారెడ్డిపేట • చెలఁగున్ భువిలోన్. 28

సీ. హరి హరిద్గిరిచర • ద్గురు మరుద్వర సరి
త్పరివహ తర్పితకాద్రి • పరిసరములు
శ్లథ దళత్పల గళ • న్మధు లలన్మద లగ
ద్దళ చలత్పికము కో • ద్యానములును
నవభవ త్పవ సము • ద్భవ సముత్సవ యుతో
పవనాంతరిత యజ్ఞ • భవనములును
ఘన కంజవన సంజ • వన సంజవన గుంజ
దళిరంజిత నికుంజ • శాంబుజినులు

# హ్రాయురభ్యుదయము.

దోరయో మెరసె నిరంతర ♦ సరదసము కు
సుమ సుమరస రజో ఘుమం ♦ ఘుమిత గంధ
వాసితాంతర్గృహారామ ♦ వామ రామ
రడ్డిపేట మహానర్ఘ్య ♦ రత్న పేట. 29

సీ. దీపితాశ్రావయే ♦ తి ప్రయోగ శ్రుతి- జాగద త్స్వరభృత ♦ సంచయంబు
సుఖితసామాజికా ♦ స్తుశ్రౌషడితి సదా- వావదచ్ఛారికా ♦ వారములును
శ్రోతృశ్రవణసౌఖ్య ♦ దాతృ యజేత్యుక్తి- రారటద్రుచిరపా ♦ రావతములు
హితయేయజామహ ♦ ఇతి భవ్యభాషిత- లాలపద్బర్హిక ♦ లాపములును
సరసవౌషడితి ప్రభా ♦ షచ్ఛుకములుఁ
బరఁగిచెలువొందె రామభూ ♦ పాలనగరి
మానసీ యోల్లసత్స్వామి ♦ నేనివంశ
జనన రాజన్న దేశాయి ♦ శాసనమున. 30

సీ. సింజాన సుమనఃప్ర ♦ యుంజాన మకరంద- భుంజాన మధుకరీ ♦ గంజితంబు
కంజాతకింజల్క ♦ పుంజాతతపరాగ- సంజాత నద పతి ♦ ష్వంజితంబు
ఖంజరీటవిహార ♦ మంజరీ పరివార- పింజరీకృత భూజ ♦ మంజులంబు
గుంజాధిగమ్య సా ♦ మంజస్య సమ్యజ్ఞ- గుంజాతిగమ్య భూ ♦ మాంజిమంబు
నగుచుఁ దొగరగు జిగిఁ దగి ♦ నిగుడు మొగడ
లగణితము లగుపొగడల ♦ తెగల సొగసు
గల వలపు గుమగుమయని ♦ చెలువుఁజూపఁ
బ్రమదవన మొప్పుచుండు న ♦ ప్పట్టణమున. 31

సీ. సమదాతిశయ వయః ♦ ప్రమదా తతకరాగ్ర
నమదాతత పలాశ ♦ కుముదములును
స్యందమాన మరంద ♦ బృందపాన మిళింద
నందదానమహార ♦ విందములును
నానావినీత ప్ర ♦ సూనావృతాంతరీ
పానీత హీర సో ♦ పానములును
లోలానువేలా ను ♦ కూలానువేల క
ల్లోలానుసర కోక ♦ జాలములును

దనర సాంతరతలపాళి ♦ తప్రమోక్తి
కగ్రహణ నైగనిగ్యోద ♦ కప్రకార
పూరితోదర దీర్ఘికా ♦ వార మలరె
రామభూపాలుపేటలో ♦ రమ్యముగను. 32

క. అపరాగములై తనరిన, నపరాగంబులను దోహ ♦ దార్థక్రియచే
నపరాగగములఁ జేయుదు, రుపవనమునఁ దత్పురీవ ♦ రోయుక్తసతుల్.

సీ. పాటీరవాటీర ♦ కోటీరనికటాగ- కందంబులైన మా ♦ కందములును
యుక్తాతిముక్తాతి ♦ రిక్తప్రసవకాంతి- పాటలాకృతి నొందు ♦ పాటలములు
నీపానురూప స్వ ♦ రూపద్యుతులు గల్గు కేసరంబులఁ జెందు ♦ కేసరములు
సాలావృతైలాస ♦ మాలోలకిన్నరీ- మోదనులైన ప్ర ♦ మోదనులును
మల్లికలలోనఁ దగు తీవ ♦ మల్లికలును
జీవకములై వెలయు బంధు ♦ జీవకములు
కాంచనంబు లనఁగ నొప్పు ♦ కాంచనములు
గలిగి విలసిల్లుఁ దత్పురో ♦ తక్రాంతవనము. 34

సీ. తతపరిచ్యుతఝగీ ♦ హితకరీ స్తుతతరీ
గతచరీ తతపరీ ♦ వృతఘరములు
నతివేలరుతి శీల ♦ గతిలోల రతిపాల
హిత ఖేలదతినీల ♦ ధృతిమదలులు
సార దుర్వార దో ♦ స్సార వన్వార నా
సీర సంచారయు ♦ క్సారికలును
ప్రకటకోరక ఫలా ♦ దిక మధూదక భూజ
శుక సముత్సుక పిక ♦ ప్రకరములును
దరణికిరణవిహరణ ని ♦ గరణ తరుణ
వరుణ వరుణాంతరిత సరో ♦ వర నివసద
వక్ర చక్రాంగచక్ర ప్ర ♦ వర్తనములు
దనరఁ దన్నగరోద్యాన ♦ వనము లలరె. 35

సీ. ఏలావనీజాత ♦ మాలాఘనీభూత- బాలానిలాధూత ♦ జాలకంబు
డోలీకృతారాళ ♦ పాలీ లతాజాల- కేళీరతోద్వేల ♦ బాలికంబు

నాసాలతాస్పంద • సూనాయతమరంద- పానాగతమిళింద • తానకంబు
సారసోదార కా • సార సోదార సా- ఫార సంసార యా • శ్వాసనంబు
లుంగతరు సంగ రింగ త్తుర • లుంగములును
బ్రియకసాల లసద్వన • ప్రియకములును
గోరకనికుంజ గుంజ త్ప • కోరకములు
గలిగి తత్ప్రమదవనంబు • బొలిచియుండె. 36

సీ. ధూపముల్ కర్పూర • దీపముల్ మధురసా
పూపముల్ దర్పణ • స్థాపనములు
ఖాద్యముల్ దివ్యనై • వేద్యముల్ విమలాంబు
పాద్యముల్ నిస్వన • వాద్యములును
పూగముల్ వీటికా • భోగముల్ దక్షిణా
భాగముల్ గంధసం • యోగములును
ఫలములు మాలూర • దళములు సారసో
త్పలములు శుద్ధతం • డులము లలర
శంఖ కాహళ ఘంటికా • ఝల్లరులును
మ్రోయ ముత్యాలముగ్గు లిం • పుగ ఘటింప
దివ్యమంటపముల మహా • దేవు భక్తిఁ
బూజసేయుదు రెప్పుడ • ప్పురజనములు. 37

క. ఆనకములు విమతజనభ, యానకములు మ్రోయుచుండు • నధ్వవిచారా
ప్రదాన సదా దానకములు, దానకములు శుభములకును • దత్పురిలోనన్.

క. వరములు సంస్కృతిదరతో
దరతోదరము లయి మొరయుఁ • దత్పురి నెపుడున్
బరజనతతి హృదయాంతర
దరదానాదరము లగుచుఁ • దరతరముదగన్. 39

సీ. మదనాశుగ వికాస • కృదనారత విలాస- మదనాతతనివాస • మదనములును
పాటీర శీతల • వాటీరసాతల- కోటీరవాహుల • ఘోటములును
నాళీక నిర్యన్మ • ధూళీక వర్య్త ప్ర- నాళీ కదర్యమ్మ • రాళికలును
పాళీలతాంతతతి • [illegible] • [illegible]కలును.



గలిగి సంతతసౌరభ్య • కలిత పల్ల
విత సుమిత ఫలితోద్యాన • వితతు లెపుడు
ప్రాగవాక్ప్రత్య గుడగాధి • పత్యయుతుల
వీళ్ల కెనయగు నమ్మేటి • వీఁట నలరు. 40

మ. బలవ ద్రత్నఘృణీ సమావహ బహిః • ప్రాకార ముద్యద్రసా
తల జారుంతుద ఖన్యమాన పరిఖాం • తర్బింబితం బౌచు సొం
పలరెం దీనిజలంబువం బడి మను • ష్యాదృశ్యమై యుండె నా
బలిసద్మం బట దీనిఁ దేర్తునని సం • భావింపఁగా నో యనన్. 41

మ. అమలాగాధపయఃప్రపూరమున సొం • పై యొప్పు నవ్వీఁటి ఖే
యము భూమీతతభక్తరక్షకొఱ్కై • యప్పట్టణశ్రేష్ఠసం
గమరాజేశ్వరుఁ డుండినం దదభిషే • కస్వస్తిహేత్వర్థమై
యమరాధీశ్వరుఁ డభ్రగాపగను ద • త్ప్రాంతంబునన్ నిల్పెనాన్. 42

మ. సరళోదార మణీ వినిర్మిత చతు • స్తంభంబు లొప్పంగఁ ద
త్పురమధ్యంబున మధ్యశాల దనరుం • బుణ్యైకరక్షాధురం
ధరుఁడౌ నప్పురరాజు శీల మది చెం • త న్మూర్తియుక్తంబుగాఁ
బురుషార్థంబులఁ గూడి నిల్చెనన సం • పూర్ణేందిరావాసమై. 43

మ. అలరుం దత్పురరాజమందుఁ బ్రతిగే • హంబందు వీక్షింప ని
శ్చలనేత్రోత్సవదాయకం బగుచుఁ ద • త్స్థానీయలక్ష్మీశుభా
చలదారంభమునన్ జనుల్ నిలుపు మో • చాస్తంభసంశోభితో
త్పలమాల్యంబు లమేయగంధయుత • పద్మవ్రాతగుచ్ఛంబులున్. 44

మ. వియదుల్లంఘన జాంఘికాజిరత లా • విర్భూత వానస్పతుల్
శయసంప్రాప్యఫలావళీసుమగుళు • చ్ఛంబుల్ దగం బూని ని
శ్చయమన్నాగరధర్మతత్పరతచే • స్వర్గాగతం బైన య
వ్యయకల్పద్రుమమన్న గాకృతులచే • నందుండె నా నప్పురిన్. 45

చ. లలిత రసాలసాలకిస • లంబుల హెచ్చగు పచ్చతోరణం
బులు గల చైత్యవృక్షములు • పొల్చును నిర్విషవర్తనంబులన్
బలసిన గారుడాశ్మముల • నంటుల నొందిన మేలుకట్టులన్
దలువ సృజింప నో యన జ • నంబులు సంతసమంద నప్పురిన్. 46

చ. కలువల ఱేని రాలవయి ♦ కప్పులపుత్తడి యొరటికంబపుం
బలితపుమేడ లప్పురిని ♦ భాసిలుఁ దత్పురలక్ష్మి కింపుగా
బలరిపు దక్షిణాధిపతి ♦ పాశి కుబేర పురాంగనామణుల్
కలితసితాతపత్రములఁ ♦ గౌతుక మొప్పఁగఁ బట్టిరో యనన్. 47

శా. అంతర్వాసవనీలతారకలు బా ♦ హ్యస్థారుణగ్రావనే
త్రాంతంబుల్ రుచిరార్జునారరసువ ♦ క్షోఘంబు లింపొందఁగా
నంతర్ద్వారవిలోకనంబుల సువ ♦ ర్వావాసభూలక్ష్మిశు
ద్ధాంతస్త్రీల గనుంగొన న్నిలుచు చం ♦ దం బేర్పడుం బ్రోలునన్. 48

మ. పొలుచుం జిత్రవిచిత్రితప్రతిమ లా ♦ స్ఫూర్జత్ప్రతీహారని
ర్మలపాండుద్యుతిదీప్తకుడ్యముల వా ♦ రస్త్రీసగాంధారకా
కలికాగ్రామ విపంచికా శ్రవణ సౌ ♦ కర్యోదయ ద్విస్ఫురిన్
గలయ న్నిల్చిన వేల్పుతేటచెలులో ♦ నాఁ దత్పురిన్ నిచ్చలున్. 49

మ. నెలరాలన్ విలసిల్లుస్తంభములపై ♦ నెకొన్న రాత్రిందివో
జ్జ్వల దాజ్యాంచ దఖండదీపకలికల్ ♦ స్వద్యోత మంతర్బహి
స్థ్సలుల న్నిండఁగ మించె నచ్చట మహా ♦ శప్రార్థనాప్తిన్ రసా
తల నిర్యత్ఫణిరాట్ఫణా ఘటిత ర ♦ త్నశ్రేణులో నాఁ బురిన్. 50

సీ. గమనవేగ సముత్థ ♦ ఘుర్ఘురస్వన భూరి
చక్ర సంధానిత ♦ స్యందనములు
సప్తధామదభర ♦ స్రావి హసిత చతు
ర్దంత దుర్దాంత దం ♦ తావళములు
రింఖావిశృంఖలా ♦ రింఖణాసంఖ్యాక
కంఖాణ పుంఖాను ♦ పుంఖములును
నసమాన చరణాయు ♦ ధాంకశస్త్రాస్త్ర వి
ద్యారూఢ ధారేయ ♦ వీరభటులు
నడువఁ గడువేడ్క లడరంగ ♦ నెడనెడలను
తడఁబడక వడివడిఁ జను ♦ పుడమిజనుల
నుడులచే ఘుమఘుమితమై ♦ యుడుగు నిత్య
ధన్యమైనట్టి తద్రాజ ♦ ధాని భువిని. 51

చ. తెలఁదుక లప్పురోపవని ♦ వెన్నెలకుప్పల నాట్యక్రీడలన్
గలువలఱేనిరాల యిసు ♦ కన్ గ్రహియించి వధూపదిష్టభూ
తలమున నుంచి తొల్తటివ ♦ దంబునఁ జేరి తిరంగి చూడఁ గ
ల్వలచెలిచేతులం గరఁగ ♦ లజ్జవహింతురు రేల నిచ్చలున్. 52

సీ. పలుదెఱంగుల మోవు ♦ లలరవదే చెలి
తావులు లేమిచే ♦ తను దొరుకవు
గోరంటులకుఁ గోర్కె ♦ లూరె ముద్దులగుమ్మ
వేగుజామునఁ గాని ♦ విరియ వవియు
సజ్జాతు లడుగవే ♦ సారె దంబుజముఖి
యామని యెఱుఁగి నీ ♦ వడుగరాదు
ప్రొద్దువిరికి విల్వఁ ♦ బొసఁగించు వెలఁదుక
తొలికాంచనంబుల ♦ విలువదాని
కనుచు నర్మవచోజాత ♦ హావభావ
గర్భితముగాఁగ ముచ్చటల్ ♦ గఱపి సరస
భరఁగు సరసులఁ గరఁగించి ♦ విరులవెలల
వెలయుచుందురు పుష్పలా ♦ వికలు పురిని. 53

సీ. వనిత నీ కైదండఁ ♦ గొనవచ్చితి నటన్న
కైదండ నొకఁడు ♦ వాడుకొనియె
నింపులో చనుగుత్తు ♦ లెట్టివో చూపవే
చనుగుత్తులు మరుంగు ♦ నను వసించు
నీరొత్తుఁ గొనుటకై ♦ నేవచ్చితి నటన్న
నారొత్తుఁ గొనె నొకఁ ♦ డనువుకాఁడు
వడఁతికో కురు వేరు ♦ పరప నాఁ గోపమా
కురువేరుపరప నీ ♦ తరముగాదు
పరిమళముఁ జెందు మరువ మె ♦ వ్వరికి నైన
నమ్మఁగలవాయనంగ ని ♦ న్నమ్మఁగలను
కలయికల నర్మగర్భోక్తు ♦ లలర సంజ
విరుల నమ్ముదు రవ్వీఁట ♦ వెలలకొలఁది. 54

సీ. మణ్యంతగోపేత ♦ వణ్యస్థలాగణ్య
పుణ్యాగంధంబులఁ ♦ బొరలిపొరలి
నానావిధోపదం ♦ శానీత పాత్రభృ
త్పానగోష్ఠీశాల ♦ లానియాని
పుంభావనారంభ ♦ శుంభద్వధూఘూర్ణ
లాలితాంభఃకేలిఁ ♦ దేలితేలి
పరిపక్వశాలికా ♦ పాలికా బాలికా
గానానువృత్తులఁ ♦ గదలికదలి
నిరత ఘుమఘుమితామోద ♦ భరకువలయ
జలజవలయిత పరిసర ♦ సరిదుదరజ
లఘుజలకణ వహనగతి ♦ లక్షణములఁ
దిరుగుఁ దెమ్మెర లప్పురీ ♦ వరమునందు. 55

మ. సరసాలాప గతాగతాంబుఘటయు ♦ క్చంద్రాననామానసాం
తర సుప్తాంగజ బోధకంబు లగుచుం ♦ త్రశ్రేణి భాకూర్పరుపా
పరుషోద్గీతము లైన గేయములు స్వ ♦ ప్నక్వాలిగోపీనిరా
దరపత్ర్యానయనక్రమంబునఁ దగుం ♦ దద్బాహ్యదేశంబులన్. 56

మ. చతురాస్యుల్ రసనాంచలప్రకటభా ♦ షామూర్తు లభ్యంచిత
శ్రుతు లత్యూర్జితసత్యలోకనుతిద ♦ క్షుల్ సర్వకాలోల్లస
ద్వ్రతు లాపద్మనివాసులై తగిన వి ♦ ప్రశ్రేణు లప్పట్టణ
స్థితులై బ్రహ్మను ధిక్కరింతురు మహా ♦ దేవుం బ్రశంసింపుచున్. 57

సీ. కువలయస్థితికి సం ♦ కుచితభావ మొనర్చి
పంకజామోదప్ర ♦ పంచ మొంది
ద్విజరాజతేజంబు ♦ నిజదీప్తి నదలించి
సద్విహారము దూర ♦ సరణి బెనచి
పగలు రజోవతు ♦ లగుపద్మినులఁ గూడి
యొకవేళ నుతమౌని ♦ యోగ మంది
సకలలోకముల క ♦ సహ్యతాపముఁ జూపి
రాజకాంతోల్లస ♦ ద్రక్తి మాన్చి

మఱియు నిముఁ డెంతవాఁడని ♦ కెరలి కలహ
తలపరబలబలాహక ♦ విలయపవన
జవనశరనికరావక్రి ♦ చక్రముఖము
లమర నప్పురి నివసింతు ♦ రవనిపతులు. 58

ఉ. ఆపణవీథికాప్రథిత ♦ హాటకకూటచిరత్నరత్నముల్
వాపుచు రాశిఁబోసికొన ♦ వచ్చు బెహారుల కిచ్చితీవులై
దోపినవానినెల్ల కడఁ ♦ ద్రోచిన తద్భరమాని రత్నగ
ర్భాపరితాభిధన్ బుడమి ♦ రంజితతద్వణిగాళి నెన్నుచున్. 59

గీ. మిన్నారయయుధాన్యరాసుల ♦ మించ లేక
జలజబాంధవుఁ డీవలా ♦ వలఁ జనంగఁ
దనరె భువినుత్తరాయణ ♦ దక్షిణాయ
నములు తద్భువి సచ్ఛాద్ర ♦ సమితివలన. 60

చ. కలువల జేనిరాల యుప ♦ కారికలన్ నవలాలు కేళికా
కలనము నొంద ముందురిరి ♦ కన్నడు ముత్యములందుచోజగం
బులఁ గురియింప నాటఁబలె ♦ ముత్తియముల్ గిరియించు నంబుదం
బులనెడు వార్త లోకమునఁ ♦ బుట్టె ముదంబుల నొప్పునప్పురిన్. 61

గీ. కుంకుమాగరు ఘనసార ♦ సంకుమద మృ
గమద గృహములు నుదయాస్త ♦ సమయములను
దొరఁగు కస వానుచో మించి ♦ తోయదములు
బహుళవర్ణత్వ మొందు న ♦ ప్పట్టణమున. 62

వ. మఱియు నప్పురంబున సౌమ్య రమ్య ప్రతివిధి విధిమ త్పఠిత మేధా వ్య
ధ్యాపి తోదీర్ణ వర్ణ వర్ణనీయ వర్ణ క్రమాంతస్స్వాధ్యాయ ధ్యాన మేదుర
దురధిగమ నిగమశిరః ప్రముఖ మర్మ పార గాసంఖ్య సంఖ్యావన్ముఖ్య
ముఖరవ ముఖరితంబు లగువిప్రభవనంబులు నిరంతరా భ్యస్త శస్త్ర సమ
స్త శస్త్ర శాస్త్ర విద్యా నైశారద్యోద్యద్గర్వాఖర్వ శార్వర వైరిదరదప్ర
దరసంధానాద్యవధాన భాసమానాసమాన సంధానుల్లంఘన తత్పర ససమ్మ
న్నా ధ్యామర్ష క్షమాతల నర్ష ద్విపక్ష నిర్దయ మర్దన క్షమాక్షణ బల బలవ
ద్బృంద తమాక్షుద్ర నిర్నిద్ర తేజోవిజిత దినరాజాలోకంబు లగు రాజలో

కంబులు ననవరతాగారాతి నైరవతిప్రభృతి దిక్పతి విచిత్ర ప్రచురతర చిర
త్న రత్న ధనధాన్యాదిప్రచయ క్రయవిక్రయ నిపుణ వరకృతవంచనా
సంధాన గంధానభిజ్ఞ జ్ఞాతనయాయన పోషితార్యజనంబు లగునర్యజనం
బులును సముచిత వర్ణాశ్రమ మర్యాదాభిజ్ఞ ప్రజ్ఞానప్రాజ్ఞ ప్రభుసంతత
దురంత శాసన ధర్మ నియమ నితాంతశాంతాంతఃకరణ మానధనులగు
శూద్రఘనులును సౌవకారగ వారముఖ్య ప్రఖ్యాతాభినయాభావ సూద
న చణ రణన్మంజుమంజీరచరణతల క్రేంకారనాద మేదుర కంకణ కర
విన్యాసాభినయ ప్రదీప్త సప్తస్వర ప్రపంచ విపంచికా వికస్వర వినోద
విశద మానస మానసభవనవాహనాకాంక్ష విటవ పుంభావ సంభావనా
రంభ సుభగంభావుక లగురూపాజీవికలును దురారోహానోకహ నివహ
మనోరమ మహోత్సవ ద్యోతితోద్యాన నవనవోన్మీల న్మాలతీమాధవీ విచి
కల వకుళ ముకుళ కులానుకూల నిష్యందమాన మరంద బిందుసందోహ
నందదిందిందిరానవరతరుత సంతాన తానహేతు భూజాభ్యాస ప్రదేశా
విరళసంజాత తచేళిమ నారికేళ తృణరాజాది సాలరాజరాజి శాఖా సమా
లింగి తైలాడోలా లాలితోత్సుక శుకపికనికర గానమాధురీ రసాతివేల
వేలాస్వాదన సద్యోమాద్య త్సంగభంగాసహ శృంగారరస లాలస సారస
రథాంగ క్రీడత్సారంగ ముఖ సుఖారావ పూరిత దిగంతరాళ వర్ధమానో
త్సాహ సందర్శనార్థ సార్థత్రికోటితీర్థ స్నానఫలేప్సిత మహిత నిమజ్జనోన్మ
జ్జన నమజ్జనానవరతానందప్రదాన లోల లోలానువేల వేలాభిముఖోల్లల
త్కల్లోలజాల కోలాహల నినాద మేదుర నదీతటాక దీర్ఘికాప్రదేశంబులు
హీరపంజర సమంజస విహార శారికాకీర కలరవాది వివిధ విష్కిరామో
దకర విష్వగ్వ్యాకీర్ణోదీర్ణ సువర్ణ దుర్వర్ణముఖ భవ్యద్రవ్య స్తవ్యనవ్యవైభవ
నిపుణ విపణి తాత్రీత స్తతస్థాపితాంశుమత్ఫలానుగళద్రసపూరానుసర శశి
రకరకాంత కాంత కుటీకుతలానుకూలనీల శాలిప్రణాళీ కాంతిసంక్రాంత
చ్ఛాయా త్రివేణీసందర్శన కుతూహల బృందారకసుందరీ నేత్రాంతోత్పల
తోరణంబు లగుతోరణంబులును సంతతనాయక పరితఃపరిరక్షిత దుర్గమ
దుర్గ ప్రాకార గోపురాట్టాలక పృథురథగజవాజిశస్త్రశాలాది రాజద్రాజ
వీథులు గలిగి చెలువొందు నందు. 63

క. ఆపురమున రాజన్నమ
హీపాలుఁడు నిజవరాక్ర ♦ మేతధ్వజినీ
ధూపాయిత పాపాయిత
భూపాయుతుఁ డగుచు సిరులఁ ♦ బొలుపొందెఁ దగన్. 64

సీ. ఒకచోట గురుమత ♦ ప్రోక్తప్రపంచంబు
నొకవంకఁ దర్కశా ♦ స్త్రోదితంబు
లొకచక్కి సూత్రభా ♦ ష్యార్థానులాపంబు
లొకమునికి రతిరహ ♦ స్యోక్తియుక్తు
లొకపట్టునను నాట ♦ కోరుచాతుర్యంబు
లొకచెంత వ్యాకర ♦ ణకథనంబు
లొకక్రేవ నుపనిష ♦ త్ప్రకటసల్లాపంబు
లొకయునికి సంగీత ♦ సుకరఫణితు
లొకదిక్కున సామర ♦ స్యార్థసౌఖ్య
కరణ సమ్యగనుత్తర ♦ గ్రంథగోష్ఠు
లలరు కొలువునఁ జెన్నొంది ♦ యఖిలశాస్త్ర
సరసుఁడై పొల్చె రాజన్న ♦ జనవిభుండు. 65

వ. అతం డొక్కనాఁడు హిత పురోహిత సామంతామాత్య సేనాధిప దండనా యకోప ప్రధాన రాయబార సంధివిగ్రహవిచారచార దౌవారిక కరణిక పౌరాణిక జ్యోతిషిక కవీశ్వర తార్కిక శాబ్దిక నయశాస్త్ర మంత్రశాస్త్ర భరతశాస్త్ర శకునశాస్త్ర సాముద్రికశాస్త్ర శిల్పశాస్త్రజ్ఞులును దానాధి కారి భాండాగారాధికారి గోష్ఠాధికారి వస్త్రాధికారి శస్త్రాధికారి రథగజతు రంగాధికారులును గస్తూరీముఖ పరిమళ కరండాధికారులును ఫణిహార లాం ఛన విదేశగవిధూషకులును అంగరక్షావధానకరులును దాసదాసీజనాందో ళికా ధ్వజాలవట్టికాఛత్రచామర వ్యజన తాంబూల దీపికా పాదుకా మాలి కాది ధరులును వాద్య వాదక గాయక నర్తకీ నర్తక మార్దంగిక పాణవిక వైణవిక వైణిక వైతాళిక చాక్రిక ఘాంటిక శాంఖిక శాక్తీక నైస్త్రింశిక యాష్టీక కాంతిక ప్రాసిక వైజయంతిక వైవధికాదులు బలువొంద సింహనం హాననసింహాసనాసీనుండై పేరోలగంబునం గొలిచియున్నఁ దదీయాజ్ఞం గొని

దర్శించి మహానందావిర్భావంబున శ్రీమద్రాజరాజేశ్వరచరణారవింద తైల
ధారావదవిచ్ఛిన్న ప్రతిరూపావన్న స్మృతిరూప సంతాన భక్తివిహార హార
సురాహారనీహారహార వృషహరిహయ హయ ఘనసారసారసాసార బిసనీర
ధరధరరాజరాజతగిరి గిరీశనరీసృవవర సౌవరవారణ సౌరరసారుహ శరశ
రద్రాకానిశాకర కరకాతారాతారాపథసరిద్వర దరతైరవ నిర్జరగవీ శా
రదాశారదాచ్ఛ నీరద నారదపారద ద్విరద రదనగోక్షీర క్షీరపారావార
వారణ విపక్షవక్ష తత్ప్రభు వదన వదనభిన్న శుద్ధ చందన భిదురదురవా
వ నైశద్య విద్యోతమాన మానాతీత వితత కీర్తి మూర్తిస్ఫూర్తి విశదీకృత
దశదిశాముఖ ముఖరజ్వలన జ్వాలాలీలా విలసత్సంవర్తసమయ సంప్రవృ
త్తి వికర్తనద్యోత వివర్తమాన ప్రతప్త కార్తస్వర స్వరగ నైగనిగ్య నివ
ర్తనానర్తనప్రవృత్తోద్వృత్త భవద్భవిష్యు ప్రతాప ప్రాభావ కృతాభిభవా
విభుత్వ దశాదశాదశరణ శరణం త్వాం ప్రపత్యర్థిభవత్ప్రత్యర్థిసార్థ సార్థకిత
గోత్ర గోత్ర శాత్రవ పుత్రామిత్ర త్రినేత్ర మిత్ర కరామృతత్వకర స్వస్తి
రస్తనయిత్ను చింతాప్రస్తర వాస్తోష్పతి నైచిక ముఖ వదాన్య నిచయ
దానప్రశస్తతాస్తైన్య విశ్రుత వితరణ సరణిప్రసిద్ధ సిద్ధ గంధర్వకి
న్నరాది విహార హార్యహార్య వర్యాదార్యధుర్య ధైర్య భరణ రణత్కల్లో
లగుంభ శుంభదంభోదిదంభస్తంభ నారంభ సంభ్రమ దంభోజసంభూత
భూతపతి జంభారాతి ముఖ బర్హిర్ముఖ పతి సంభావిత గాంభీర్య విజృంభ
ణ భణన కోవిద కవిసముదయ సముదయహృదయ నిరంతరోదయ ద్ద
యామయభావ భావభవరూప ప్రకార రవిప్రకార ప్రచండతరదోర్దం
డ మండలాగ్రమండనాయమా నోదగ్ర మహోదగ్ర ద్విషదగ్రియ గ్రసన
వ్యగ్ర మండలాగ్రాగ్ర్య ఖండనోద్దండ పరమండల ఖండన పాండిత్య
పాండిత్యవిస్తారిత కుండలిప్రభువిచిత్ర శిఖండిజాది పటుతరవాచోయుక్తి
పటు ప్రవర వరణపరిఘాదిసాధన దుర్విభేదన ప్రకటిత నృపసదన పుట
భేదన స్ఫుటతమ నిజమహీమండలాఖండలాఖండలక్ష్మీ ప్రథిమ సంవర్ధితా
ర్థిజన కాండ కాండప్రకాండ సంధిత్యానిర్భర్తృత గాంగేయకోశ నివేశ
నివేశితాపరిమేయ గాంగేయ పురుకుత్సాద్యసంభావితాకుత్సిత సంయత్య

## ప్రథమోల్లాసము.

మయనయ వినయ నియమాదికృత విస్మయ విస్మయావిధేయ విమృశ్యవి హిత వివిధ స్వీయ విధేయ దూరోత్సారిత నైధేయ నాసత్యాద్యభిరూప ణీయ రూపధేయ శ్రితపుణ్యవచ్ఛివభాగవతవరేణ్య భాగధేయ త్వదీయ సద్గుణగణ తంతు సంతతి సంతత సహకృత్వ సంస్ఫోటోద్భట సాస్ఫోట భవద్భట సందోహాటోప కువింద సంఘటితామంద పటుతరాచ్ఛకీర్తి పట వాయసాయ రాచుల్లగోత్ర కామినేని రాజన్నభూపాలార్ధాంగనా భవానీ గర్భ శుక్తిముక్తాఫల రంగమాంబాలోచన చకోరానందకర రాకాసుధా కర విరాజమాన రాజన్నదేశాయి సార్వభౌమ జయవిజయీభవ యని యివ్విధంబున వినుతించిన హర్షించి. 66

మ. నను శబ్దార్థపరిష్క్రియాకలిత వా • గ్నైపుణ్య గణ్య ప్రథా
జనితానంద కవిత్వ తత్త్వరచనా • సౌజన్య జన్యాత్మ మో
దనవద్దేశిక పాదుకా నియత చి • త్తప్రస్ఫురన్మార్గ ఖే
లను నైఘంటిక యుక్తియుక్త మతిలీ • లం జూచిపల్కెన్ దయన్. 67

సీ. అద్వితీయాపరో • క్షానుభూతిప్రసి
ద్ధాచార్యవిజయ మాం • ధ్రాంచితముగ
ఘనజగజ్జన్మాద • కారణ శ్రీమదు
పాఖ్యానము దెనుంగు • నై తలిర్చ
లలితపదార్థా ద్య • లంకారసహిత నీ
శావివాహము సము • ల్లాస మలరఁ
గృతులు మెచ్చంగ శ్రీ • కృష్ణవిలాసంబు
జనమనోహరముగా • మును రచించి
మించియున్నట్టి నిన్ను వ • ర్ణించఁ దరమె
ప్రబలరాపాకవంశసం • భవ నవీన
జవన కవన ప్రభవన భా • షావిశేష
లక్ష్మణ ప్రతిభాధుర్య • లక్ష్మణార్య. 68

గీ. నీవు శబ్దార్థచిత్రస • న్నిహితమైన
కవనమొనరించు ప్రోడవు • గాన నాకుఁ

దైవికావ్యక్త సూక్తసంధాన మహిమ
గలిగినప్రబంధము రచింపు కౌతుకమున. 69

వ. అదిరయొట్టిదనిన. 70

క. అసమాన ముభయభాషా, రసమానము వృత్తిరీతి రసశయ్యావ
ల్లిసమానము చిత్రౌచిత్య, స్వసమానము గా రచింపఁ జర్చింపఁ దగుఁ. 71

వ. మఱియు గుణదోషవిభాగజ్ఞుండగు వివేకియు ననుప్రాస సహాబద్ధ పదబంధుండగు వాచికుండును బ్రసాద మధురాయత్త రచనుం డగుకౌచికుండును నర్థసంగ్రహ చాతుర్య ధుర్యుండగు నార్థికుండును యమకాన్విత కవిత్వ దక్షుండగు శిల్పికుండును సాలంకార రస తత్పరుండగు మార్దవికుండును దన్నియమంబు లిట్టివి రీతులుత్రివిధంబులు వైదర్భి గౌడి పాంచాలి యనం దనరు బంధపారుష్యరహితంబు శబ్దకాఠిన్యవర్జితంబు నాతిదీర్ఘసమాసంబు నగు వైదర్భియు సమాసభూయస్త్వం బైనయోజస్థితియు నుద్భటబంధతా విశేషంబుగల కాంతియుం దనర గౌడీరీతియనందగు వైదర్భిగౌడీరీతిమిశ్రితంబై పాంచాలీరీతియనం దగు శబ్దార్థంబులు మూర్తి వ్యంగ్యవైభవంబు జీవితంబు నలంకారంబులు హారంబులు శ్లేషాదులు గుణంబులు రీతులు స్వభావంబులు కైశిక్యాదివృత్తులు వృత్తులు పదానుగుణ్యవిశ్రాంతిగల శయ్యలు శయ్యలు రసాస్వాదభేదంబులగు పాకంబులు పాకంబులు కావ్యసామగ్రికి నుండవలయు వాచకలక్షకవ్యంజకత్వంబున ద్రివిధంబు శబ్దజాతంబు వాచ్యలక్ష్యవ్యంగ్యత్వంబున నర్థజాతంబు త్రివిధంబు తాత్పర్యార్థము వ్యంగ్యార్థగతంబై యుండు నభిధాలక్షణావ్యంజనాఖ్యల శబ్దవృత్తులు త్రివిధంబులు సంబంధానుపపత్తిమూలం బగుటంజేసి గౌణవృత్తి లక్షణాభేదంబై యుండుఁ గావున నొకప్రబంధంబు రచించి శ్రీరాజరాజేశ్వరార్పితంబు గా విచారింపఁ దగునని జాంబూనదాంబర తాంబూలాదికంబుల బహుబహూకరించిన సంతుష్టాంతరంగుండనై తద్వాక్యంబులు ప్రమాణీకరించి ప్రబంధంబునకుఁ దదీయాభీష్టఫలప్రదుండు రాజేశ్వరుండు కృతినాయకుం డగునని సిద్ధాంతీకరించి యమ్మహానగరంబున వసించు రాజేశ్వరు దర్శింపఁ దలంచి 72

# ప్రథమోల్లాసము.

సీ. మరకతనానారత్న • భరశృంగసంగత
దివ్యసాలాంతర • స్థిరతఁ జెంది
మహాసహస్రస్థంభ • మంటపం బలరారు
నది మణిఖచితమై • పొదలుచుండు
వరుసఁ జతుర్దిశా • వధి సహస్రస్తంభ
ములు పఙ్క్తిపఙ్క్తి కి • మ్ముగ వెలుంగ
రమణీయమణిసహ • స్రస్తంభములు మించి
తిర్యక్ప్రవర్తనో • ద్దీప్తి నెనయఁ
దాదృశస్తంభపఙ్క్తులు • తరుచు గల్గి
తదుపరిచ్ఛన్నపటలంబు • తద్విధావి
రత్నమయమై తలిర్చు వి • భ్రాజమాన
మై వెలింగిన యమ్మంట • పాంతరమున. 73

క. నవమణిగణఖచితంబగు, భవనాభ్యంతరమునందుఁ • బార్వతితో ను
త్సవమున శ్రీరాజేశ్వరుఁ, డవనిజనులఁ బ్రోచుచుండు • నతిముద మలరన్.

వ. మఱియు నమ్మహాదేవుండు వికస్వరపుండరీకనిభకోమలామలశరీరుండు త
రుణారుణకిసలయవిలసితచరణతలుండు చారుతరహీరవిశదశకలసదృశం
బులగు నఖరంబులు సారసార సమసారసంకాశంబులగు నంగుళీదళంబులు
స్వచ్ఛకచ్ఛపమృదులంబులగు పదపృష్ఠప్రదేశంబులును బ్రత్యగ్రసముదగ్ర
జాగ్రత్ప్రింజానమంజుమంజీరరంజితంబులగు చరణంబులు రుచిరశశిమణి
గణనీయకాహళయుగళసంకాశంబులగు జంఘికలు మహోద్దండశుండాల
శుండాదండసన్నిభంబగు నూరుద్వంద్వంబు కలధౌతపూతదుకూలాంబరచిర
త్నరత్నరశనాయుక్తంబులగు పులినసదృశనితంబంబులు స్ఫాటికకవాట
పాటవంబు గల వక్షస్స్థలంబు సకలాభీష్టప్రదానైకమణిగణఖచితపటుకటక
కేయూరాంగుళీయకాదిభూషణభూషితంబులగు చతుర్భుజంబులు శారదైంద
వబింబసంకాశసముల్లాసభాసురంబగు వదనంబు కోటిసూర్యప్రకాశానంత
రత్నకీలితకిరీటంబుగల మస్తకంబు గలిగి సర్వజ్ఞత్వాద్యనంతకల్యాణగుణ
పరిపూర్ణుండు పూర్ణిమాశశాంకకోటివిరాజమానవిగ్రహుండును నిత్యనిరవద్య
నిరతిశయతేజస్సంయుతస్వసమాన రుద్రగణప్రముఖగణపరివృతమణిమయ

సింహాసనాసీనుండు కుండలికుండలాలంకృతదేదీవ్యమానుండును నిత్యశుద్ధ బుద్ధముక్తకేవలాఖండసచ్చిదానందస్వరూపుండును రామణీయకతనువిభాభాసితానంతకోటి బ్రహ్మాండపరాణుగవాక్షీభూతానేకరోమవివరదేహుండును గామినేనిరాజన్నదేశాయికులదైవతంబగు రాజరాజేశ్వరుంగాంచి బహుప్రణామంబు లాచరించి. 75

అనులోమవిలోమశ్లోకము.

రదసారసగోసారసమానానఘకాశికా
కాశికాఘననామాసరసాగోసరసాదర. 76

గీ. శరవృషవనాబ్జపుష్కర • హారిరసాభ
శుచిశరీర ప్రవర్ధిత • సుమశరాంగ
శరవృషవనాబ్జపుష్కర • హారిరసాభ
శుచిశరీరప్రవర్ధిత • సుమశరాంగ. 77

వ. ఇవ్విధంబున నమ్మహేశ్వరు వినుతించి దక్షిణాశానిశాలమందిరంబున శ్రీసీతాసమేతుండైన శ్రీరాముల సేవింపం దలంచి. 78

సీ. సుమతి రేకాకీ న • రమతే యని వచించు
రాజితరాజకీ • రవ్రజంబు
ధీయుక్తిచే నద్వి • తీయమైచ్చత్తని
వచియించు శారికా • వారములును
సుచిరోక్తి నధపురు • షో హన్నె నారాయ
ణో కామయత యను • కేకికులను
స్థిరవచస్థ్సితి నద్వి • తీయోస్తికచ్చిత్త
నుచుఁ బలుకు పారావ • తచయములును
మహితభాషల యస్వాహా • త్మాశరీర
మనుచు సూచించు పికసమూ • హములు గల్గి
నాలయు శుకపుష్పమంటపా • వృతమహీరు
హంబుల వసించి భక్తిమో • దంబు మీర. 79

వ. మఱియును. 80

## ప్రథమోల్లాసము.

సీ. తెలయు నారాయణై ♦ వేదగంసర్వం బ
నుచుఁ బలుక్కిన్నరీ ♦ నిచయములును
హితముమీరంగ త ♦ మీశ్వరాణాంపర
మంమహేశ్వర మను ♦ మధుపగణము
తెలివిమీరంగ తం ♦ దేవతానాంపర
మంచదైవత మను ♦ నంచకులము
నలువొంద నారాయ ♦ ణంమహాజ్ఞేయం బ
నిపఠించు ఖంజరీ ♦ టపతగనులు
నవ్యయఃపురుషస్సాక్షి ♦ యనుకుళుంగ
తతులు జెన్నొందు తత్సవి ♦ ధద్రుమముల
నిష్కళంకనిరంజన ♦ నిర్వికల్ప
నిర్గుణబ్రహ్మమచట రా ♦ ణించు కతన. 81

గీ. అదియ నిశ్రేయసామృత ♦ మదియునిత్య
వాస్తవస్థాన మదియు ని ♦ ర్వాణపథము
దూరవర్జితసుఖదుఃఖ ♦ కారణ మనఁ
దనరఁ దత్పద మెన్నంగఁ ♦ దరమునగునె. 82

వ. అచ్చోట. 83

గీ. దేదివ ద్వేదికా విప్ర ♦ ధిత సువార
పఠ్యమాన శ్రుతిస్మృతి ♦ ప్రకటితేతి
హాస ఘుమఘుమితారావ ♦ భాసమాన
ధర్మహర్మ్యంబులో రామ ♦ భద్రుఁడలరు. 84

వ. అద్దేవుండు స్వాభిమత స్వసంకల్పానుకూల్య పరమపదస్థానీయ భోక్తృ భోగ్య భోగోపకరణ భోగస్థాన భూతుండును నిఖిల హేయ ప్రత్యనీక కళ్యాణైకతాన స్వేతర సమస్తవస్తు విలక్షణానంత జ్ఞానానందైకస్వరూప స్వాభావికానవధికాతిశయ జ్ఞానబలైశ్వర్య వీర్యశక్తి తేజోవిరాజమాన దివ్యమంగళవిగ్రహా చింత్యాద్భుత నిత్యనిరవద్య నిరతిశయ సౌందర్యౌజ్వల్య సౌగంధ్య సౌశీల్య వాత్సల్య గాంభీర్యౌదార్య యౌవనాద్యానవద్యానంతకళ్యాణగుణ పరిపూర్ణుండును నిఖిలజగదుదయవిభవలయ

లీల వరబ్రహ్మ పురుషోత్తమ నారాయణాది శబ్దవాచ్యుండును బ్రహ్మాదిదేవర్షి మనుష్యాద్యారాధనాది గోచరుండు తత్తద్భేదస్వరూపావస్థితుండును.

శ్లో. ఉపాస్యోపాసకత్వేన । గురుశిష్యక్రమేణ చ । స్వామిభృత్యాదిరూపేణ । క్రీడతే స్వేచ్ఛయేశ్వరః. అన్న న్యాయంబున సమ్మోహాత్ముండు రవికర వికసిత ప్రభామండల మండిత పుండరీక దళస్ఫాయదాయతేక్షణుండును సుభ్రూ లలాట సునాసాపుట సుస్మితాధర సుచిరమణిముకుర సుకపోల యుగళుండును కంబుగ్రీవుండును తనుతర మధ్యభాగుండు విశాలవక్షస్స్థలుండును సువిభక్తసర్వాంగ నిర్దేశ్యవిశ్వరూపసింహసంహననుండును స్నిగ్ధవర్ణుండును శోణసారసుకుమార చరణయుగళుండును బ్రతప్త కార్తస్వర ప్రభాధగధగిత పీత కౌశేయాంబర ధరుండును. సకలభువనోదయ సకలహేతుభూత పితామహవిహరణ నాభికమల కుహరుండు జ్వలద్విశాలోరస్స్థల నూతనరత్న వేదికా సమారోహణ కౌతుకిత మతి నంద దిందిరాసుందరీ సుందర పురందరోపల కలిత సోపాన విరాజిత రోమరాజీసహితుండును విరాజమాన వైజయంతీ కౌస్తుభమణి ఘృణి ఘృణితాగణిత మణిసముంచిత కాంచనకవాట తుల్యంబగు వక్షస్స్థలంబును జతుర్విధ పురుషార్థ ప్రబంధంబులగు చతుర్భుజంబులును వర్ణనీయసువర్ణ దివ్యరత్న సముద్భిన్నకర్ణయుగ లంబమాన సుకర మకరకుండల మండితంబులగు గండస్థలంబులును మణిమయభ్రాజమానకిరీటంబుగల మస్తకంబు గలిగి యనాలోచితవిశేషాశేషలోకశరణ్యుండును శంఖ చక్ర శార్ఙ్గ నందక శ్రీవత్స పద్మ వనమాలాలంకృతుండు ననవధికాతిశయ సౌందర్య హృత విశ్వమనోదృష్టి వృత్తి లావణ్యామృత పూర పూరితాశేష చరాచరభూత జాతాద్యద్భుతాచింత్య నిత్య యౌవనుండును బుష్పరస విసర సరదగణ్య పుణ్య గంధ వాసితానంత దిగంతరాళ త్రైలోక్యాక్రమణ ప్రవృత్త గంభీర భావుండు సంతత కరుణాకటాక్ష వీక్షితాపరిమితాశ్రిత సమూహుండును సజాతీయవిజాతీయ స్వగతభేద స్వరూపుండు తత్తద్వ్యలక్షణుండగు శ్రీమన్నారాయణుండైన శ్రీసీతారాముల సేవించి తదీయదివ్య శ్రీపాదతీర్థతులసీ దివ్యమంగళవిగ్రహ శ్రీపాదాంకిత శఠగోప దివ్యనామసంకీర్తన కళ్యాణగుణామృత పాన సందర్శన శిరోవ

ఆకర్ణన ధన్యా నైకాయన భాగధేయుండనై శ్రీమద్రాజన్నదేశాయి
లక్ష్మీవిలాసనివాసమహాలక్ష్మిని సేవింపం దలంచి తన్మహారాజాజ్ఞంగొని. 85

చూర్ణిక. శ్రీమత్కలశజలనిధి విలసదంతర నిరంతర సురవిటపివిటపి వల
యిత బలభిదుపల విపుల విపులాతల ద్వీప నీపోపవన భవన కాంత చిం
తామణి ఘృణి ధగద్ధగిత మృగరాజ విరాజమానాసన సమాసీనాం హృద్యా
నవద్య గద్య పద్య నైశారద్యో ద్యద్విద్యాధరీలోచన చకోరానందకర
సాంద్ర చంద్రాతపవద్దరహాసాభిరామాం నితాంత లతాంతబాణ బాణ
శాణాయమానాననమాన మణిగణప్రభామండలపిచండిల కుండల కషణ
నిశిత సితసాయక వీక్షాకదంబాం గౌరవరవర్ణినీ వర్ణనీయ సువర్ణవర్ణ నిటల
తట ఘటితాకలంక కుంకుమ సంకలిత సుఖసంపాదన నఖముఖోల్లసంతీం
తరుణ తరణికిరణ జాంబూనదాంబుజ హారితాళ వినీల నీరదాంతర నట
త్తటిత్ఫుల్ల హల్లక జపా కర్ణికార కోరక ప్రకార తనుప్రభా భాసమానాం
కామాలికాబద్ధ సకలస్నిగ్ధ కేశపాశ విభ్రాజమానాం సమానాధిక సూత్ర
న కేతకీ జాతి చంప కాశోక పున్నాగ మల్లీ కురువక బంధూక స్తబక కుచ
కుంభ గుంభిత గంధసార ఘనసార మృగమద సంకుమద మసృణఘుసృణ
ము ఖామోదవిరాజమానాం నవరత్నకీలితాంచిత కాంచనకిరీట తారాహా
ర కేయూర ఛన్న ధీర ఝుణంఝుణాయమాన కంకణాంగుళీయక ఘంటి
కోడ్డాణ కాంచీదామ శింజాన మంజీరాద్యలంకార విద్యోతమానాం ని
రంతర సుమకదంబకదంబవన సంచరన్మధువ్రత ప్రదాపితోర్ధ్వకీల కుండల
మండిత ప్రభాకర పాత్రశోభిత సుధాకర కిరణ పరామృతోపహార ప్రి
యాం శ్రీకామేశ్వరాంక పర్యంక నివాసినీం సువాసినీపూజావిధానావధాన
రాదుల్లగోత్రపాత్ర శామినేనిరాజన్న దేశాయిలక్ష్మీవిలాసమాణిక్యసింహాసన
స్థిర మహాలక్ష్మీం సదాకలయామి. 86

వ. అనివినుతించి బ్రహ్మోత్తర ఖండంబునం గలభద్రాయురభ్యుదయంబుఁ
దెనుఁగించి శ్రీరాజేశ్వరున కర్పితంబుఁ జేయవలయు నని యాజ్ఞ యొసంగు
శామినేనిరాజన్ననృపాలు వంశావతారం బభివర్ణించెద. 87

సీ. సతత ఘుళంఘుళ • స్వనదచ్ఛజీవన- కమనీయ నదనదీ • కద్రవజంబు
వికచాంబుజోత్పల • ప్రకర ప్రవసత్సరం- దాసార కాసార • భాసురంబు

కలకంఠ శుక నీల ♦ కంఠ పారావత- నినద ముఖరితోప ♦ వనచయంబు
హాటక కటక ర♦త్నావాస బహుశృంగ- సంగతకృతకాద్రి♦ సముదయంబు
తారకాపద కషణాబ్జ ♦ ధవ కుముద్వ
తీరమణ కాంత కాంతసం ♦ స్థిత విశాల
సారశిఖరోరుఖేయప్ర ♦ శస్తవస్తు
పుణ్యనివహంబు బికరానో ♦ ల్బురవరంబు. 88

మ. చిదచిన్మూర్తి పరాపరప్రకృతిమ ♦ త్త్రీస్రి సిద్ధ రామేశ్వరా
స్పద పద్మాకర దివ్యవా రహరహ ♦ స్నాన్నాగతానేకమా
ని దివాకఃప్రభు భక్తి సంస్తుతి మిషో ♦ న్మీల ద్ద్విజస్వస్తివా
క్సదయప్రాభవమై తలిర్చె నదిముక్ ♦ సర్వంసహామండలిన్. 89

క. వర్ణిత మణిగణ కనకో, దీర్ణరుచి రుచిర విపణ్యా ♦ ధీ నానుప మా
భ్యర్ణప్రదేశగ చతు, ర్వర్ణంబులవారు దనర ♦ వహి కెక్కి తగన్. 90

మ. జలభిన్నీల విశాలకుట్టిమ పరీ ♦ వాహప్రభాహర్నిశో
జ్జ్వల దభ్రంకషశృంగసంగతములై ♦ సౌధంబు లొప్పె న్మహా
చలసంకాశ గజేంద్రబృందములతో ♦ సయ్యాటలాడన్ రసా
తల నిర్యన్మదధార వారణఘటల్ ♦ దారొన్న చందంబునన్. 91

సీ. స్ఫాటికస్ఫుటకోటి ♦ హాటకకుట్టిమా- ట్టాలకంబుల జాల ♦ మతిశయిల్ల
సాంద్రచంద్రోపల ♦ స్థాపనాంచచ్చంద్ర- శాలావరంపరల్ ♦ సందడింప
వరసుధాలేపన ♦ స్ఫురదంబుదాయన స్ఫుగ్గోపురములు రం ♦ జిల్లుచుండఁ
బ్రతిమార్గనిర్మిత ♦ ప్రచురకాంత్యాధార- రాజితగేహముల్ ♦ తేజమెనయ
లలితజీవనదంతవి ♦ లాసవాస, వజ్రకీలితగేహముల్ ♦ వన్నెఁజూప
ఘుందరాద్రినిఁ గైలాస♦ మహితగిరిని, గేలిఁ గొనఁబోలు నవ్వీఁటి♦ మేలిమలర.

సీ. శ్రీవిష్ణుదేవుని ♦ శ్రీముఖాబ్జమునందు- నతులాగ్రజన్మసం ♦ తతిజనించె
భాసురంబైనత ♦ ద్బాహుదేశంబున సదయపార్థివవంశ ♦ ముదయమయ్యె
దేవదేవుని సక్థి ♦ దివ్యస్థలంబున- నైశ్యాన్వయం బుద్భ ♦ వంబు నొందె
లక్ష్మీశపదకమ ♦ లద్వంద్వమునఁ గీర్తి- సహితశూద్రకులంబు ♦ సంభవించె
నందు సచ్ఛూద్రనికర మిం ♦ పొందుచుండ
నాఁడునాఁటికి శ్రీపాక ♦ నాటిజనన

# ప్రథమోల్లాసము.

మద్భుతైశ్వర్యధుర్యమై • యవనిఁ బరఁగ.
రాజరాజేశ్వరకృపాభి • రామ మగుచు. 93

క. ఆపాకనాటివంశో, ద్దీపకుఁడై కామినేఁడు • దృఢతరబలసం
తాపితపరభూపాలకుఁ, డై పాలిచె సమస్తలోక • మభినుతి సేయన్. 94

గీ. అతఁడు తద్విక్రమోలుపు • రాధిరాజ
పూజ్యసామ్రాజ్యలక్ష్మిచేఁ • బొలిచియుండెఁ
గుతుపశాహాదియవనరా • ట్క్రతుకదత్త
ఘనతరాందోళికాదివి • ఖ్యాతిఁ గాంచి. 95

సీ. ప్రాగ్భవోత్కట మద • ప్రవణ గంభీర వే
దు లుపాయనంబులై • వెలయుచుండఁ
బటుతరోదగ్భూత • బాహ్లీక కాంభోజ
తురగంబు లుపదలై • పరగుచుండఁ

---

కామినేఁడు అన్నచోట॥ ఎడుస్స్యాత్పరిమాణకే॥ అన్నసూత్రప్రాప్తివలన ఏనిఅనినిలచును. ఇందుకు ప్రయోగము॥ ఏనియను నాంధ్రశబ్దము । తోనదికిన పూర్వపదము తుదివ్రాయికి । నచ్చైనను వ్యంజనవర్ణం । బైనరచింపుదురునిత్య యతులనుచుఁగవుల్॥ ఇందుకులక్ష్యము॥ క. పెట్టఁడునారకమార్గం । బెట్టిమహాక్రూరకర్ముఁ • డేనియుఁదుదిని । ట్టట్టనక నెమ్మనంబున । నెట్టన హరిఁ దలఁపఁగలిగె • నేనిమహాత్మా॥ అనియున్నదిగనుక ఏనిశబ్దము హల్లునకును అచ్చునకును యతిగాఁ బ్రయోగించినాము. (అని యీతాటియాకుల పుస్తకములో నున్నది. కాని యిది సంపర్భించినట్టు గాన్పించదు. ఏమనిన ఇచట॥ ఏని॥ అనునది యతిస్థానముగానందున నిట్లువ్రాయవలసినపని లేదు. మఱియు పరిమాణార్థమున॥ ఎడు॥ అని హ్రస్వాదిప్రత్యయముగాని దీర్ఘాదిగాదు. అదియును ప్రమాణవాచకములకుఁ బరముగావచ్చునుగాని యితరములకుఁగాదు. అది॥ ఏని॥ అను రూపమునుబొందుట కాధారము గాన్పించదు. అదియటుండ॥ ఏనియను నాంధ్రశబ్దము॥ అను లక్షణగ్రంథమందలి పద్యములోనున్న॥ ఏని॥ శబ్దము చేదాద్యర్థకముకాని పరిమాణార్థకముగాదు. కానిదీని నుభయవళిగా నితరకవులెవ్వరైన ప్రయోగించినట్టు ఈకవి చూచియుండెనెమో.)

ఇట్లు కొంఠి భద్రాద్రిరామశాస్త్రి.

ప్రత్యగ్భవోదీర్ణ • వర్ణసౌవర్ణము
ద్రిక లుపహారసం • స్థితి వెలుంగ
దక్షిణదిగ్భవో • దాత్తముక్తాఫల
వ్యూహముల్ కానుకలై • యొప్పుచుండ
నరసకర్ణాటరాజ్యప్ర • శస్తుఁడగుచు
భాగ్యనగరాధిరాజ్య సం • భావ్య లక్ష్మి
నొందఁ దలపోసి శ్రీనికు • నోలుపురవ
రమున వసియించె శ్రీకామి • రడ్డినృపతి. 96

సీ. దివ్యతటినీ వేరజా • తీరంబున వసించు
పాళెగాండ్రను బడల్ • పడ నడంచి
ఘనసువర్ణముఖరియొ • డ్డున వసించుచునుండు
పరిపంథులను బట్టి • భంగపెట్టి
సమ్యక్పినాకభృ • జ్జాకూలమున నుండు
ప్రత్యర్థులను ముందు • బాధపరచి
రూఢకృష్ణానదీ • రోధంబునఁ దిరుంగు
ప్రతివాదులను గట్ల • పాలుజేసి
తనరి నైజప్రతాప దీ • ప్తప్రభావి
ఘటిత దుష్టసపత్నాంధ • కారపటల
రాయదేశ్యాభుజంగాభి • రామబిరుద
సహితుఁడై కామినేఁడు • ప్రశస్తుఁ డయ్యె. 97

క. ఆకామినేఁడు నిజనా, మైకాంకము గాఁగ గులము • నలరించిన నా
శ్రీకామినేనివంశం, బాకల్పస్థాయి గాఁగ • నవని బరఁగెన్. 98

వ. తదీయపుత్త్రపౌత్త్రసంతాన పరంపరానుక్రమంబున 99

గీ. అవనిఁ దత్కామినేన్యన్వ • యంబు సకల
గోత్రపరమైన రాచుల్లె • గోత్రమునను
దనరుచుండంగఁ దత్కుల • మునను కాచి
రడ్డిభూపతి జన్మించెఁ • బ్రతిభుఁ డగుచు. 100

క. ఆకాచిరెడ్డికిని సు, శ్లోకుఁడు రెడ్డియను నాత్మ ♦ జుం డుదయించెన్
భూకాంతాసంఘటితమ, హాకౌతుకహస్తకములఁ ♦ డై జనమెన్నన్. 101

సీ. ఆరెడ్డినృపతి భా ♦ ర్యారత్నమైన దే- శాంబికయందు వి ♦ ఖ్యాతులైన
సదయకాచారెడ్డి ♦ సరసమల్లారెడ్డి- భూతిబలోపేత ♦ బొమ్మిరెడ్డి
నాఁదగు సుతుల నా ♦ నందంబునం గాంచె-నందుఁ గాచారెడ్డి♦యనునృపుండు
కులకాంతయై మూర్తి♦కలితయామాచాంబ-యందునెల్లారెడ్డి♦యనెడుపుత్త్రుఁ
గనియె నాయెల్లరెడ్డీంద్రుఁ ♦ డనుపమాన
రూపలావణ్యవిక్రమా ♦ రూఢిఁ జెంది
భవ్యగుణసాధ్వి మల్లమాం ♦ బను వరించి
యిష్టవర్తనమున రాజ్య ♦ మేలుచుండె. 102

క. అతిముదమున నెల్లమహీ, పతి మల్లాంబికనుగూడి ♦ బలవత్కన్న
క్షితినాథుఁ గాచవిభుఁ ది, ర్పతిరెడ్డియు ననుతనూజ ♦ వర్యులఁ గనియెన్.

వ. అందు. 104

క. కాచారెడ్డినృపతి స, త్యాచారనిదాన దాన ♦ హరిదశ్వసుతుం
డై చతురహృదయలోకా, సేచనకతనూకళావి ♦ శేషుం డగుచున్. 105

గీ. సకలసాధ్వీమతల్లియై ♦ సంభ్రమించి
యొప్పుడొప్పులకుప్పయై ♦ మెప్పువచ్చి
తిప్పమాంబను బెండ్లాడి ♦ ధీరులైన
సుతులఁ గాంచెను నల్వురి ♦ నతులమతుల. 106

క. ధీరుఁడు జంగమరెడ్డి యు, దారుండగు కామిరెడ్డి ♦ ధన్యుండగు నె
ల్లారెడ్డి శౌర్యఖనిమ, ల్లారెడ్డి యనంగఁ దగి రి ♦ లన్ జనులెన్నన్. 107

క. శ్రీకరజంగమనరపతి, కాకాచారెడ్డి కనుజుఁ ♦ డై సంతతను
శ్లోకుం డెల్లారెడ్డిమ, హీకాంతుఁడు వృద్ధినొందె ♦ హితవర్తనుఁడై. 108

సీ. అవరవర్ణులెకాని ♦ యవరవర్ణులు గారు
సరి వాగ్రిమాప్రాప్తి ♦ సంభృతులను
అలత మోసుదులెకా ♦ నలత మోసుదులు గా
రెన శుచితాకాంతి ♦ ఘనన్సుచులను

గోత్రాధిపులె కాని • గోత్రాధిపులు గారు
తరము ధర్మఖ్యాతి • ధైర్యములను
హరినామకులె కాని • హరినామకులు గారు
బలసత్యపాలన • ప్రాభవముల
నరహరి హరాగ్ని చంద్రభా • స్కర వృషగురు
శైలమారుతసమవర్తి • శక్రముఖుల
సాటిఁ గోరుచు నెల్లన్న • జనవరుండు
ధరణిఁ బాలించె ధార్మిక • త్వంబు దనర. 109

సీ. మొదల దాతృత్వంబు • దుది యాచకత్వంబు
నిచ్చలో నుండువాఁ • డెంత నేల్పు
హర్షించి యొకవేళ • నప్పులిచ్చుటె కాని
యొప్పు డీకున్నవాఁ • డేవదాన్యుఁ
డహమున యామద్వ • యం బిచ్చి యవ్వల
నీవి లేదన్న వాఁ • డెంత దాత
యడిగినంతనె యర్థ • మిడక నెన్నెముకను
న్నొప్పించువాఁ డేబ • హుప్రదుండు
ఇచ్చి మరలంగఁ గొనక తా • నిచ్చవచ్చి
నట్టులొసఁగుచు రేబగ • లనక పంచి
పెట్టుచును ముఖ్యవస్తువు • పేర్మినొసఁగు
నెల్లరెడ్డి మహీపతి • నెన్నఁదరమె. 110

సీ. సప్తసంతానప్ర • శస్త కామారెడ్డి దేశాయిదివ్యాజ్ఞ • దేజరిల్ల
నమ్మహామహుఁడు ని • త్యమ్మాచరించిన- ధర్మంబు నభివృద్ధిఁ దనరఁ జేసి
రాజకార్యాకార్య • రచనలాలోచించి- యుక్తియుక్తములుగా • నొప్పఁ జేసి
బహుళపద్మాకర • ప్రస్ఫీత దీర్ఘికా- కుల్యాదికిఁ దదాను • కూల్యమొంది
యమ్మహీపతి కిష్టుఁడై • యనుదినంబు
నన్నలందును దమ్ముల • యందుఁ బ్రేమ
గలిగి విలసిల్లె నెల్లభూ • కాంతుఁ డవని
భార మాత్మీయభుజమునఁ • బ్రబలుచుండ. 111

క. శ్రీరమణీరమణీయ మ, ణీరుచిరాదర్శమనఁగ • నిపుణశ్రీ రా
ల్లారెడ్డిపేట దనరె ను, హీరామాస్యాబ్జతిలక • హితమై సతమై. 112

వ. అదియెట్టి దనిన 113

సీ. ధ్వజపటాగ్రజ నీభ • స్వద్ధుత ద్యోధునీ- సాంద్ర శీకరపూత • సౌధతతులు
సౌవరద్వీప సాధ్వ • సప్రద సింహత- లాటాంశుకోదీర్ణ • హర్మ్యములును
హరిపురస్త్రీ సమా • హ్వానార్థ కంపిత- చేలాలవట్టికా • ట్టాలకములు
సురపూరహమ్మతి • నిరసనోత్పత దుచ్ఛ్రి- తోపరిభాగ భా • గ్గోపురములు
స్వాత్తనాట్యక్రమ విలోక • నాగత త్రి
దివయువతి దేహజ • స్వేద నివహ హరణ
వీజిత పటత్పటాగ్ర ప్ర • వేశగృహము
లలరుచుండంగఁ దత్పురం • బవని నెలసె. 114

ఉ. గాటపుకోటకొమ్మలు చొ • కాటపుహాటకకూటకోటులుం
బాటిలు గోపురంబులు న • పారములై తగు స్వస్తికంబులుం
దీటగు చంద్రశాలలును • దీర్ఘవిభుత్వము దెప్ప నొప్పు న
వ్వీటికి సాటి యేనృపుల • వీఁడులు వేల్పుల వీడు లెంచినన్. 115

గీ. సరసకురువింద సుందర • మరకతాది
కములు గల జాళువాకోట • గాననయ్యె
గగనలక్ష్మీకర ధగద్ధ • గాయమాన
కంకణచ్ఛట రవళించు • పొంకమలగ. 116

చ. సురుచిరమాత్నరత్నముల • సోరనగండ్ల ధరించి కాంచన
స్ఫురదురుసౌధయూధములు • పూజితరాజితశాలిశాల ల
వ్పురి మెఱసెన్ సురావహన • పోషణతాభినివేశ మేరుమం
దరములు సత్త్వసంపదలఁ • దత్తదుపాఘలఁ జేరెనో యనన్. 117

శా. గంగా భంగ తరంగ సంగత విహం • గవ్యూహ భీక్ష్ణహేలా
త్తుంగ ప్రాంగణ గోపురోపరి సదా • స్తోక ప్రభాభీల మా
తంగాది వ్యవహార సారబల సం • ధాన ధ్వజోపేతమై
శృంగారాస్పదమయ్యె నెల్లనృపతి • శ్రీమత్పురం బప్పుడున్. 118

మ. సరసీజాప్తుఁ డొకానొకప్పుడు తద్దై ♦ శ్వర్యాదిదృక్షార్థత
త్పురుఁడై నిల్చిన సాలజాలశిఖర ♦ స్థప్రోజ్జ్వల స్వానత్న్నర
త్నరుచివ్యూహ మవక్రచక్రగతి నొం ♦ ద న్నాటనుం డివ్యసుం
ధరలోనం బరివేషభూషితపద ♦ స్థానుం డనం గన్పడెన్. 119

చ. అహరహ మప్పురీవరన ♦ మంచిత కాంచన కూట కోటి సం
గ్రహణ విలాస వాసము ల ♦ ఖండవిభావిభవంబు దోప నా
గ్రహముల ధిక్కరించిన చి ♦ రంతనకాంతమణీగణాంతరా
వహగదిఁ జూచువారి కిది ♦ వస్పృహఁ జేయుచు నుండు నెల్లెడన్. 120

క. సద్మహితస్వర్ణమణీ, సద్మండగు నెల్లనృపతి ♦ స్వసమాఖ్య దగన్
పద్మాకర పద్మాకర, పద్మాకరముల నొనర్చెఁ ♦ బ్రజలు నుతింపన్.

సీ. ఒకవిప్రచుళుకంబు ♦ నకులోనుగాకున్న-లవణసముద్రంబు ♦ సవతియగును
కేవలఖండవి♦కృతిఁ జెందకుండె నా-యైక్షవాంబుధి సమం ♦ బగుఁ దలంపఁ
బానంబుచేఁ దంద్రఁ ♦ బట్టించకుండెనా మదిరాసరిత్పతి ♦ మాదిరియగును
ముక్రవాసనలేక ♦ చొక్రమైయుండెనా- యాజ్యాంబునిధి జత ♦ యగు
దరచఁబడకున్నదధివార్ధి ♦ తరము నగును [వచింపఁ
బరిణమించని క్షీరాబ్ధి ♦ పాటియగును
దేలలేకున్న శుద్ధాబ్ధి ♦ పోలికగును
ఘనతనెల్లవిభుని తటా ♦ కంబుతోడ. 122

సీ. మౌనిసంచిత్రక ♦ మండలూజ్వలజలో-త్పన్నయా నల ద్వీప♦వతిని విడచి
తాపసభుక్తసం ♦ త్యక్తరైయై విలసిల్లి- చరియించినట్టి ని ♦ ర్ఝరిణి వదలి
హరిభేద్యమానరైయై ♦ యవనీతలంబున- మెలఁగుచున్నట్టి శై ♦ వలినిగడచి
మునిశప్తరైయై గుప్త♦మూలంబునఁ దిరంగి-రొదిగియున్నట్టియ♦న్నదినిదాటి
కలితరాచుల్లగోత్రిత ♦ కామినేని, వంశుఁడెల్లన్ననృపమౌళి ♦ వరతటాక
గర్భమున శివనాథము ♦ ఖ్యస్వమూర్తు, లగుచు హరిహరులై యుండు ♦ ర[illegible]

క. శ్రీమద్యల్లారెడ్డిమ, హీమండలనాథశౌరి ♦ కిందిరవరసా [మదికంబు.
ద్వీమణి కీర్తితవర్తన, రామ మోద మొనర్చెఁ బోచ ♦ మాంబ ధరిత్రిన్. 124

సీ. లక్ష్మీశసదృశుఁ డెల్లారెడ్డి కేశాయి-[illegible] మోదమునఁ బోచ♦మాంబయందు
[illegible] ♦ [illegible] రెడ్డి[illegible] ♦ రెడ్డియు[illegible]

పుత్త్రుల ముప్వురి • భూరికీర్తులఁ గాంచె- నామూరిలోఁ గీర్తి • కాముకుఁడైన
శ్రీమంతుఁడైనట్టి • చినకామిరెడ్డీంద్రుఁ- డవని భారంబూని • యగ్రజన్ము
దేవతాగురుభక్తిసం • దీప్తుఁ డగుచు
మానితాద్దూరిసీమ సా • మ్రాజ్యపూజ్య
పదవిఁ జెన్నొంది గ్రామముల్ • పట్టణములు
విరివిఁగావించెఁ దనమహా • విభవ మలర. 125

సీ. తనకీర్తి చంద్రికా • తతిపౌరసుందరీ- ముఖచంద్రమండలం • బులఁ బెనంగఁ
దనగుణరత్నముల్ • ఘనదిగ్వధూటికా- స్తనహారవర్తులై • సంభ్రమింపఁ
దనదివ్యతేజంబు • దినకరబింబసం- దీప్తికరంబయి • తేజరిల్లఁ
దనమహావిఖ్యాతి • వనజభవాండభాం- డాంతరపూర్ణత • నతిశయిల్లఁ
దనరె నని కవు లనుదిన • మును నుతింపఁ
గుశలచారిత్రు రాచర్ల • గోత్రపాత్రుఁ
గామినేన్యన్వయునిఁ జిన • కామిరెడ్డి
దేశముఖు నెన్నఁదరమె పృ • థ్వీతలమున. 126

సీ. రమణీయచినకామి • రెడ్డీంద్రునకు నార-సులు ముగ్గురుదయించి • రలఘుబలులు
మహితపోతారెడ్డి • మఱియుఁ గంతారెడ్డి-సనయుఁ డెల్లారెడ్డి • యనఁ దలిర్చి
యందులోనగ్రజుం • డైనపోతారెడ్డి- నిగ్రహానుగ్రహ • నియతిశాలి
శ్రీభాగనగరరా • జ్యాధిపస్థిరతర- ప్రభువర్యవర్ణిత • ప్రాభవుండు
నలభగీరథనృపసగ • రులను దెగడి
పుడమి పడఁతికి సౌఖ్యంబు • పొసఁగఁ జేసి
రాజరాజమహారాజ • రాజబిరుద
సహిత పోతమహీపాల • చంద్రుఁ డలరె. 127

సీ. శాత్రవాకీర్ణమై • సలిలపూర్ణంబైన-జలదుర్గమున స్వశా • సనము నిలిపి
దురవగాహం బగుం • దుదపథం బగుచున్న-వనదుర్గమున నిజా • జ్ఞను విధించి
పరభయంకరబల • ప్రత్యవస్థాత్రయు- క్తస్థలదుర్గమున జయ • స్తంభ ముంచి
దుర్ధర్షగర్ధన • స్పర్ధాళువిద్విష- చ్ఛైలదుర్గములు వ • శ్యములు జేసి
యద్భుతైశ్వర్యధుర్యుండు • ననుపమాన
శౌర్యధైర్యుండు వీర్యగాం • భీర్యశాలి

పోతిరెడ్డిం డున్నెడ్రాతితాం ♦ భోధిచంద్రుఁ
డవనిఁ బాలించెఁ బూర్వరా ♦ జానుమతిని. 128

శా. ఏరాజైనను రెడ్డినామమున నీ ♦ పృథ్విం బ్రవర్తించునా
యేరెడ్డైనను రాజశబ్దమున బం ♦ హిష్ఠస్థితిం జెందునా
ధారావాహిక బుద్ధిచేఁ దనరు పో ♦ తారెడ్డి దేశాయి ము
న్నీరెల్ల రాజన రెడ్డినా భువి సము ♦ న్మీలద్యశోలక్ష్మియై. 129

క. ఆసేతుతుషారాచల, వాసరమణిశైల శాలి ♦ పశ్చిమధరమ
ధ్యాసీన ధర్మవజ్జయ, శాసనుఁడై పోతిరెడ్డి ♦ జనవిభుఁడలరెన్. 130

సీ. అద్భుతస్వాపతే♦యమువ్యయంబొనరించి-బహుతటాకంబులే♦ప్రభుఁడునిల్పె
నిమ్నోన్నతక్షోణి ♦ నిమ్నగాతుల్యకా- కుల్యల నేధార్మి ♦ కుండు ద్రవ్వె
నిర్జనస్థలులపై ♦ నిఖిలప్రజోల్లస- ద్గ్రామముల్ పేట లే ♦ ఘనుఁడుగట్టె
దుర్గమార్గంబులఁ ♦ దోరంబులైనట్టి- యారామముల నేమ ♦ హాత్ముఁడుంచె
నప్పితామహు ధర్మంబు ♦ ననుసరించి, యంతకన్నను మిక్కుటం ♦బైతలిర్ప
వానిపాలమునఁజేసి ♦ వసుధరయేలె, నెల్లభూపాలు పోతధా ♦ త్రీశ్వరుండు.

క. శ్రీపత్యంశభవుండగు, నాపోతారెడ్డి మాచ ♦ మాంబికయందుం
దీపితపుత్త్రులఁ గనిరెమ, హీపాలనశీలనప్ర ♦ హేతులు గాఁగన్. 132

మ. లలితాలంకరణాంచితావయవుఁడై ♦ ల్లారెడ్డి జోగావనీ
తిలకుల్ వారలు దానధర్మముల ధా ♦ త్రీనిర్జరశ్రేణులన్
వెలయంజేయుచు రాజకార్యఘటనా ♦ విర్భూతకౌతూహలం
బలరన్ వర్ధిలి రాహవప్రకటితా ♦ హంభావపుంభావులై. 133

వ. అందు. 134

శా. అంకారంభవిజృంభమాణ విజయో ♦ ద్యద్వైరికాభ్రాంక్రియా
లంకర్మీణ మహారవప్రవణ వే ♦ శానిశ్శ్వలాకాటవీ
కింకుంర్వాణ వచోవిచారపరు లై ♦ గ్గింపం దలిర్చెన్ రణా
లంకారాసిభుజార్గళుం డగుచు నై ♦ ల్లారెడ్డి భూమండలిన్. 135

సీ. ఒరులతోఁ బరిహాస ♦ మొనరించె నేనియు-నుచితోక్తులేకాని ♦యొండులేదు
శయనించియుండియు ♦ స్వప్నంబునందైన-నన్యకాంతాగోష్ఠి♦నరయలేదు

సాహసోదగ్రుఁడై ♦ శాత్రవు నందైన-దుర్గుణారోపంబుఁ ♦ దొడర లేదు
మనసునసుదిల నే ♦ మరిపాటునైనను- దగ నసత్యపుఁ దెల్పుఁ ♦ దలఁచ లేదు
గాననీరెడ్డి నృపతి యా ♦ కల్ప మవధి
గను బ్రవర్తించ వలె నని ♦ జనులు పొగడఁ
బ్రబలి వర్ధిల్లె నెల్లభూ ♦ పాలమౌళి
తనసమాఖ్యాదిగంతర ♦ స్థలుల నిండ. 136

క. ఆయెల్లనృపతికతిభా, గ్యాయతి జగ్గప్ప భార్య ♦ యైతనరెం బ
ద్మాయతనముఖకమలశో, భాయతయై పుడమి జనులు ♦ ప్రస్తుతిఁ జేయన్.

గీ. అమ్మహీపతి కనుజుఁడై ♦ యవని వెలసె
జోగిరెడ్డీంద్రుఁ డత్యంత ♦ సుగుణగణ్యుఁ
డప్రతీపప్రతాపప్ర ♦ భాభిరాముఁ
డాశ్రితకదంబవార్షికా ♦ బ్దాభుఁ డగుచు. 138

మ. గరిమన్ భూపరిపాలకుండయిన జో ♦ గారెడ్డి తేజోతిభా
స్కరుఁ డొప్పున్ మును జక్రవాళగిరిపా ♦ శ్చాత్యప్రదేశస్థ దు
స్తర జీనోల్లుర దంధకారచయభి ♦ ద్దావద్విషత్కామినీ
వరధమ్మిల్ల తమోనివారక కర ♦ వ్రాతంబు సంధిల్లఁగన్. 139

చ. నిరతము భూజనంబులకు ♦ నెమ్మది రంజిలఁ జేయుచున్ ధరా
సురలను బ్రోచుచోఁ దనరు ♦ జోగనృపాలుఁ డొనర్చు దానవి
స్ఫురణను జూచి కల్పతరు ♦ పుంజము దుర్యశమున్ వహించె నాఁ
గరమరయంగ షట్పదపి ♦ క ప్రకరాదిక కైతవంబునన్. 140

శా. కారుణ్యాకరమూర్తియై వెలయు జో ♦ గారెడ్డి సత్కీర్తిహం
సీరత్నంబు సమస్తవిశ్వమున ని ♦ క్షేపించు నండంబు ల
త్యారూఢాంబుజసంభవాండతతి మ ♦ ధ్య స్థంబులై యుండఁ ద
త్పారంపర్యము నొంది పికకృటిలుచో ♦ బంహిష్ఠవృత్తిం దగెన్. 141

సీ. అంగవంగకళింగ ♦ బంగాళవనితలు- లలిమించువీచోపు ♦ లనువహింప
లాటకర్ణాటవ ♦ రాటిభోటాంగనల్- విమలంబులగు ముకు ♦ రములు బూన
మాళవములయాళ ♦ చోళనేపాళబిం- బాధరల్ వేటురు ♦ మాళ్ళవీ వఁ
గోంకణటెంకణ ♦ కుకురుకాశకరూశ- రమణులు వీటీభ ♦ రములు దాల్ప

సర్వసర్వంసహాచక్ర • చక్రవర్తి, లక్షణోపేతుఁడై మఱి • లక్ష్మి దనరఁ
గామినేనికులాంభోధి•సోముఁడైన, జోగభూపాలుఁడలరె య•శోధనుఁడయి.

క. ఆజోగారెడ్డిమహా, రాజుకు దేవేరియగుచు • రంజిలె సుగుణ
భ్రాజిత చొక్కవ్వ జయ, శ్రీజగతీసదృశయగుచుఁ • జిరకీర్తి దగన్.

గీ. సుదతి పుట్టినయింటికిఁ • జొచ్చినింటి, కలరువన్నె యఁ దెచ్చిన • తలిరుబోడి
చారుతరకిసలయపాణి•కీరవాణి, యైన చొక్కవ్వ నెన్నంగ•నలవియగునె.

క. శమదమముల నెన్నఁగ నా, యమసము రేమగువ యీశా•ర్పితమతియై
రమ వనుదినంబు పూజల, నమరంజేయుచును జొక్క • మాంబ దలిర్చెన్.

గీ. అట్టిజోగనృపతి చొక్క • మాంబయందు
భూరిబలవంతులైనట్టి • పోతిరెడ్డి
సుందరాకారుఁడైయుండు • జోగిరెడ్డి
యనఁగఁ దగు పుత్త్రులను గాంచె • ననయులుగను. 146

క. ఆగుణవజ్జోగమహా, భాగుం డతినీతిపరుఁడు • ప్రకటతరసమా
ఖ్యాగరిమ నానరి రాజ్య, శ్రీగురుబుద్ధి ప్రసిద్ధిఁ • జెందుచు నుండెన్. 147

గీ. అమ్మహీపతి భార్యయై • యలరెలింగ
మాంబయనసద్గుణగణావ • లంబ యగుచు
జోగిరెడ్డిమహీశుఁడన్ • సూనశరుని
కలరతీదేవియవఁదగి • యలరెభువిని. 148

క. ఆజోగిరెడ్డి కగ్రజుఁ, డై జనులెన్నంగ నెగడె • నాత్మీయ యశ
స్తేజశ్చంద్రదివాకరుఁ, డై జగతీభార మూని • హర్షితమతియై. 149

శా. లీలన్ నవ్వులకైన బొంకఁడు బుధా • ళిం బూజనాందించు సు
శ్రీలం దా ధనదున్ నగున్ శివునికై • చిత్తంబు గీలించి మున్
వాలాయంబు బసిండిపువ్వులను సే • వాయుక్తి నర్పించు ధీ
శాలుండై తగు పోతిరెడ్డినృపతి • శ్రీనాథుఁ డత్యున్నతిన్. 150

సీ. సతతవిద్వత్ప్రవీ • ణ్వరపారిజాతంబు- సారధైర్యమ్మున • మేరునగము
ప్రతిదినాభ్యుదయాప్త • బంధురక్షణశాలి- పుంజీభవద్యశో • రంజితుండు
గణుతికెక్కుచు ధర్మ•గుణగణోజ్జ్వలుఁ డెంత- వనికైననాడిత•వ్వనిఘనుండు
మర్త్యేశ్వరసమర్పి • తోపధాసంభృతి, యర్థిసందోహాక • ల్పాగమంబు

దానకర్ణుండు రణసమిం ♦ ధానపార్థుఁ, డాశ్రితావనశీలుఁడం ♦ చఖిలకవులు
సన్నుతించంగఁ దగె సద్వి ♦ చారపరుఁడు, పోతిరెడ్డిమహీపాల ♦ పుంగవుండు.

మ. నవఖండంబుల మోచువారలు మహా ♦ నాగంబులున్ ఘోణియున్
జవనత్కూర్మము సర్పమద్రు లనిశా ♦ సం బెన్ని పోతావనీ
ధవదోర్వజ్రమయంపుపీఠమున మో ♦ దంబందె నా ధారుణీ
యువతీరత్నము గానిచో నదియు భో ♦ గోద్యుక్తయై యుండునే. 152

క. ఆపోతారెడ్డిమహా, భూపాలుని భార్యయగుచుఁ ♦ బొగడొందె నయ
శ్రీపతిపూజాపరహృద, యాపాదితభక్తి సర్వ ♦ మాంబ దలిర్చన్. 153

గీ. అర్థిజనములఁ గనుఁగొన్న ♦ నాదరించి
పూజలొనరించి యన్నమిం ♦ పుగ విధించి
యన్నపూర్ణభవాని యో ♦ యనఁగ మించి
సర్వమాంబిక దనరారె ♦ జగతిలోన. 154

సీ. సమ్మద మ్మొనరంగఁ ♦ దమ్మిగద్దియనుండు-కొమ్మఁ జిత్తమ్మునఁ ♦ గుదురుకొల్పి
పటుబుద్ధిమగనిపు ♦ క్కిటనుండుపొలఁతుక-డెందంబులో ముందుఁ ♦ బొందుపరచి
సురరాజురాణి చం ♦ దురుకీరవాణి ము-న్నంతరంగంబున ♦ నలరఁదలచి
మగనినెమ్మేనిలో ♦ సగముదానై యున్న-పడఁతిని మదిలోనఁ ♦ బాదుకొల్పి
వారివారిని గురుకర ♦ వీరకర్ణి
కార చంపక నవమల్లి ♦ కా జపాబ్జ
కుందకాంచనములఁ బూజ ♦ లొందఁ జేసి
యింపుదళుకొత్తుచుండ రా ♦ ణించి మించె. 155

శా. ధీయుక్తిన్ ధరణీసురాగ్రణుల భ ♦ క్తిం బూజ్యులం జేయుచున్
శ్రేయోవంతునిఁ బోతభూమిపతి న ♦ ర్థిం బ్రేమ వాటింపుచున్
స్ఫాయద్రూపవిలాసవైఖరులచే ♦ సర్వమ్మ రంజిల్లె శ్రీ
న్యాయం బేర్పడ సజ్జనంబునకు నా ♦ నందంబు సంధిల్లఁగన్. 156

క. శ్రీరాజేశ్వర సత్కరు, ణారూఢ కటాక్ష వీక్ష ♦ ణాగత రాజ్య
శ్రీరక్షణ దక్షిణ పో, తారెడ్డిమహీపతికి ము ♦ దంబలరారన్. 157

గీ. మానవతియైన యాసర్వ ♦ మాంబ గర్భ
మునను జన్మించి ప్రతిదినా ♦ భ్యుదయ మొంది

సర్వసర్వంసహాచక్ర • శక్రుఁ డనఁగ•
వెలసె రాజన్న చౌదరి • విశ్వ మెన్న. 158

సీ. తనసమాఖ్యాపధి • తతి నిత్యదానాంబు- ధారలచే వృద్ధిఁ దనరుచుండఁ
దనసుగుణసుమంబు • లనుపమధర్మధీ- కల్పలతాగ్రణిఁ • గలసి వెలయఁ
దనవిశ్రుతశ్రుతో • దన్వతీశ్వరునికి- శమదమాదులు తరం • గములు గాఁగఁ
దనకరుణామృతం • బునకు నేత్రాంతముల్- కలశయుగంబులై • కానుపించ
ధరణివర్థిల్లె నని సుధీ • తతులు బొగడఁ
గుశలచారిత్ర రాచుళ్ళ • గోత్రపాత్రుఁ
డమితజయసాంద్ర కామినే • న్యన్వయేంద్రు
డైన రాజన్న దేశాయి • యవనిఁదనరె. 159

సీ. విధులై మహాయజ్ఞ • విధులై శివార్చనా- విధులై తగిన వేద • వేత్త లలర
పదవులై సద్వనీ • పద్ధవులై ఘనదవా- పదవులై ప్రతిపక్షు • లొదుగుచుండ
కృతులై పరానిరా • కృతులై సదుక్తిభా-కృతులై విచక్షణుల్ • నుతులొనర్ప
మానులై రాజస • న్మానులై విజితారి- మానులై సైనికుల్ • పూని కొలువ
ప్రకటపాషండ బౌద్ధ చా • ర్వాక జైన
విరసమతములు తనశాస్త్ర • సరసవచన
రచనల హసింపుచును రాజ • రాజ సదృశుఁ
డైతగను గామినేని రా • జన్న నృపతి. 160

సీ. శ్రీమహాదేవాంఘ్రి • సేవానురక్తుఁడై- సతతపంచాక్షరీ • జపముఁ జేయు
శివభక్తగణముతోఁ • జెలిమి వాటింపుచు- శివకథాశ్రవణంబు • చేఁదలిర్చు
నద్యవివాహోప•నయనార్థ మర్థించు భూదేవతలఁ దృప్తిఁ • బొందఁ జేయు
గ్రతునిమిత్తాగత • శతసంఖ్య విప్రోత్త-ములు గోరు విత్త మి•మ్ముల నొసంగు
ఘనతటాకోపవనదీర్ఘి • కలను గూప
ములను నిర్మించి కారుణ్య • కలితుఁ డగుచు
నిలను బాలించె శ్రీకామి • నేనికులజుఁ
డైన రాజన్న చౌదరి • యనుదినంబు. 161

మ. త్రియతశ్రీకర కామినేనికులుఁడౌ • రాజన్న భూమీశ్వరుం
డయుతోదీర్ణ సువర్ణముద్రికల ది • వ్యాచ్ఛాదనాద్యంబులన్

వ్యయభాగం బొనరింపుచుండఁ గను ని • త్యం బర్చతప్రార్చత
ప్రియమేధా యనువైదికోక్తి దవరుఁ • రేయుఁబవల్ దత్సభఁ. 162

సీ. జవముచే భీకరా • హవముచే రాజ్యాను భవముచే రామప్ర • భావమెన్న
భక్తిచేఁ దేజఃప్ర • యుక్తిచేఁ గాంతిప్ర- సక్తిచే ఖగరాజ • సరణు లెన్నఁ
బ్రాప్తిచే సకలవి • ద్యాప్తిచేఁ బావన-వ్యాప్తిచే శుచివృత్తి • ననుసరించుఁ
గీర్తిచే సౌందర్య • మూర్తిచే జ్ఞానవి- స్ఫూర్తిచేఁ గృష్ణసం • శుద్ధు లరయ
శరభ భృగు రామ రాఘవ • గరుడ సూర్య
చంద్ర శివ కవి వహ్ని వి • జయ గదాగ్ర
జన్మ సత్యవతీసుత • సరణు లెన్న
సరసరాజన్న దేశాయి • చంద్రుఁ డలరె. 163

సీ. కింపచాన సదామి • తంపచానులు నిత్య- దివ్యాన్నభోక్తలై • తేజరిల్లఁ
గచ్ఛరోద్వేల్లత్ప • టచ్చరుల్ సంతతో- దంచద్ధంశుకధారు • లై తలిర్చఁ
బ్రజ్ఞానమార్గా న • భిజ్ఞాన భూసురుల్- వేదశాస్త్రజ్ఞులై • వెలయుచుండ
హల్యానుగత కర్మ • కల్యావరజులు స- ద్గ్రామాధికారులై • రంజిలంగఁ
జేసి వారల కిష్టార్థ • సిద్ధు లొసఁగి
పుడమిరంజిల్లె భూభుజుల్ • బొగడుచుండ
రమ్యతరమూర్తి చంద్రికా • సౌమ్యకీర్తి
నిపుణరాజన్న చౌదరి • నృపవరుండు. 164

సీ. తెలిదమ్మిగద్దియఁ • జెలువొందు పైదలి
దలిరమ్మదొరతండ్రి • గెలుపుగొమ్మ
గొమ్మచేనిలకింపుఁ • గూర్చునాతని మేను
మేనుదాల్పుల నేలు • వాని వ్రాలు
వ్రాలుగట్టులఁగొట్టు • వాఁడెక్కిన మెకమ్ము
కమ్మదీయక పాలు • గమ్మ సొమ్ము
సొమ్ముగాఁ జెలువరా • నొమ్మఁజేసినవాఁడు
వాడుఁజూపక తావిఁ • గూడినలరు
నల్లనల్లని వలువచే • నలరుసామి
సామిచేతోడ జగడాలు • నలుపునవతి

సవతిగాన కామినేనిస ♦ త్కులపవిత్రి
వరసరాజన్ననృపతి య ♦ శమ్ముతోడ. 165

సీ. తనమూర్తివిభునకు ♦ జననేత్రపఙ్క్తులు
కువలయస్థలములై ♦ కొమరుమిగులఁ
దనవిత్తమునకు యా ♦ చకహస్తంబులు
నిక్షేపసంస్థితి ♦ నియతిఁజెందఁ
దనదు తేజోదీప ♦ మునకు స్వాన్వయములు
భవనజాలంబులై ♦ ప్రభవహింప
దనవైరుదులకు ది ♦ క్తటములు శాసన
స్తంభంబులై నితాం ♦ తము చెలంగ
నలరె నని సజ్జనంబులు ♦ నభినుతింపఁ
గామినేనికులాబ్ధిరా ♦ కాశశాంక
సన్నుతమనఃప్రసన్నరా ♦ జన్ననృపతి
ధరణిఁ బాలించె ధనధాన్య ♦ సరణి మీర. 166

గీ. అమ్మహీపతిభార్యయై ♦ యలరుచుండె
రామమాంబ సుశీలాభి ♦ రామమాంబ
నిత్యసత్యవ్రతాచార ♦ నియతవృత్తి
సకలసాధ్వీమతల్లులు ♦ సన్నుతింప. 167

సీ. రాజకార్యవిశేష ♦ రచనల నిజభర్త- కానుగుణ్యప్రధా ♦ నాఢ్య యగుచు
భర్తృశుశ్రూషాభి ♦ వరతఁ గర్తవ్యార్థ- ములయందు దాసీత్వ ♦ కలనఁ జెందు
వల్లభాభీష్టాన్న ♦ వాంఛ విచారించి- వర్ణితమాతృభా ♦ వంబు నొందుఁ
బతిదేహసౌఖ్యసం ♦ పాదనక్రియ నెంచి- రంభావిలాససం ♦ రంభ మెనయు
ధవుఁడు ధర్మప్రవర్తన ♦ త్వంబుఁ దలఁప
నానుకూల్యంబుగ మెలంగు ♦ నవనివంటి
బరవసముఁబూను షాడ్గుణ్య ♦ భవ్యమూర్తి
రామమాంబ దలిర్చె శ్రీ ♦ రామయనఁగ. 168

సీ. తనరదాసేరిలఁ ♦ దనరుధాన్యంబుల- యర్థంబువ్యయపెట్టి ♦ యర్థితతికిఁ
దనదివ్యసహకార ♦ తరువులఁదాఁగొన్న- వృక్షముల్ విప్రుల ♦ కెలమినిచ్చె

దనసమార్జితవిత్త • మునవివాహోపన- యనముల కర్పించు•వినయమెసగ
దనసమ్యగిష్టసం • జనితశర్కరవిప్ర- కృతసమారాధనా • ర్పితముఁజేయు
నఖిలజనములకును దల్లి • యగుచు దేవ
భూమిసురవృత్తు లెల్లసం • పూర్ణముగనొ
సంగి తత్కరుణాశీర్వ • చనములంది
రామమాంబాసమాఖ్యాభి • రామ దనరె. 169

గీ. అమ్మహారాజ్ఞి పిమ్మట • నలరెఁ జిన్న
రామమాం బనస్వప్రియా • రామ యగుచు
దానధర్మప్రసంగత • త్పరత దనరు
ప్రియునికనుగుణహృదయయై • పృథ్విలోన. 170

గీ. చెలఁగి వారల పదపడి • శ్రీభవాని, తనరె సాధ్వీలలామయై • ధరణిలోన
ధనకనకవస్తు వాహన • ధాన్యదాన, దాసికాగోగణాదిసం • తతులిర్వ.

గీ. అవనిషట్యుత్తరశతత్ర • యంబులైన
సద్వ్రతములాచరింపుచు • సంతతంబు
రాజరాజేశ్వరాంఘ్రినీ • రేజయుగము
నెమ్మనంబునఁ దలఁచుచు • నిగుడుచుండె. 172

సీ. ఘృతసూపదధియుక్త • కించిదుష్ణంబైన- యన్నంబె కానిశు•ష్కాన్నమిడదు
ఖాదిరైలాదులు • గల్గువిడ్యమె కాని- వట్టితాంబూల మి • వ్వంగ లేదు
రమణీయనూత్నాంబ • రంబులనే కాని- జరదంశుకంబులొ • సంగ లేదు
సకలవస్తువిశేష • సదనంబులే కాని- శూన్యగేహంబులఁ • జూప లేదు
వసుధలోఁ గల్గువార లె • వ్వారలైన
నర్థులైవచ్చి యాచించు • నంతలోన
దనయులనుబ్రోచు తల్లి వి • ధంబు దోప
నెలమిరక్షించిన భవాని • నెన్నఁదరమె. 173

సీ. స్వాధ్యాయపరులను • సమ్మదం బలరించి
దానప్రసంగంబు • దలఁపుచుండు
శాస్త్రిసంఘంబును • సంభ్రమం బొనరించి
యత్యంతమధురోక్తు • లనువచించు

సకలపురాణజ్ఞు • లకు ముదంబొనరించి
దేవతాంతరములఁ • దెలియనడుగు
నితిహాసవేదుల • నీప్సితం బెనయించి
సద్వ్రతస్థితిగోష్ఠి • సలుపుచుండు
నిత్యసజ్జనసహవాస • నియమమునను
దేవగురువిప్రవిశ్వాస • భావమునను
విశ్వసంపత్సమృద్ధియు • వెలయుచుండు
నాభవానమ్మ నెన్నంగ • నలవియగునె. 174

సీ. శ్రీరాజరాజేశ్వ • రీసపర్య యొనర్చుఁ- బుణ్యసీమంతినుల్ • బొగడుచుండ
రాజేశ్వరామేయ • పూజావిధి వహించు- విప్రోత్తములు మెచ్చి • వినుతిసేయ
సకలసంపద్వృద్ధి • జపముఖ్యము వహించు- స్నాతకవ్యూహంబు • సన్నుతింప
నిరతాన్నదానము • నిష్ఠచే వర్తించు- నాబాలగోపాల • మభినుతింప
హితపురోహిత బంధు సు • హృదయ మంత్రి
మిత్ర భట దాసముఖులను • బుత్రులనుచు
దలఁచి రక్షింపుచున్నట్టి • ధర్మమూర్తి
యగు భవానమ్మ నెన్నంగ • నలవియగునె. 175

సీ. అధ్యాత్మవిన్మహో • పాధ్యాయులనునిల్పి- వేదవేదాంగముల్ • వెలయఁజేసె
శ్రుతిశిరఃపరిచయా • న్వితశాస్త్రితతినుంచి- స్థిరచతుస్తంత్రముల్ • దేటపరచె
నాత్మనామాంకంబు • లైనపేటలలోన- వృత్తిమాన్యంబులు • వెలయఁజేసెఁ
దనపేరనన్నస • త్త్రంబులు విధియించి- బహుదేశవిద్యార్థి • పఙ్క్తిఁబ్రోచె
నగ్రజాతులు మొదలైన • యఖిలజాతు
లందు దయయుంచి యన్నవ • స్త్రాదు లరయ
శ్రీభవానమ్మ విలసిల్లె • శ్రీభవాని
యనఁగ రాజన్ననృపుభార్య • యగుచుధరణి. 176

సీ. ధన్యమాంగళ్యమా • త్రప్రసిద్ధి వహించి- జనమనోరమవృత్తి • సంతసించి
సకలకలాభిజ్ఞ • చాతుర్యమున మించి- విదితప్రజావృద్ధి • విభవమెంచి
ప్రకటీకృతప్రభా • పద్ధతి సవరించి- తనరుచుండుదృఢవ్ర • తంబుఁగాంచి
రూపలావణ్యప్ర • రూఢిని విహరించి- హావభావవిలాస • మనుసరించి

సతిమహాలక్ష్మి భారతి శక్రజనని, ప్రభుజనకజాత దమయంతి రతిఁదలంచి
కామినేనిభవానమ్మ గారితోడ, సాటిసేయంగవచ్చును సరసమతుల.

సీ. ధైర్యంబుస్థైర్యమా దార్యంబుగాంభీర్య- మలరుచునుండు నీ యవనిపతికి
శమదమార్జవతతి జ్ఞాతవశ్యశ్రద్ధాస- మాధాన మిమ్మహా మహునిఁ జెందు
రాజకార్యవిశేష రచనపాత్రాపాత్ర నిర్ణయం బెప్పుడీ నృపతి నెనయు
దయయుసత్యము నీతి ధర్మంబుశీలంబు- నొందుచునుండు నీ యుర్విపతికి
ననుచు సకలకవీశ్వరు లభినుతింప
నిపుణుఁ డగుచును నాభవా నీసమేతుఁ
డగుచురాజన్న దేశాయి స్వాన్వయాధ్యుఁ
డైన సత్పుత్రునిఁ గనంగ నాత్మఁదలఁచి. 178

సీ. వేదవేదాంగప్ర వీణమై విలసిల్లు- విప్రసందోహంబు వెంబడింప
క్షాత్రకర్మాదప్ర శస్తమైతగినట్టి- క్షత్రియవ్యూహంబు సందడింప
క్రయవిక్రయాధ్యని ర్ణయముచేఁ గనుపట్టి యూరవ్యసంఘంబు చేరినడువ
స్వాధికవర్ణసే వాన్వితంబై యుండు- శూద్రసమూహంబు శోభిలంగఁ
వేద్యపంచమహావాద్య విభవమలర
సౌమ్యరమ్యసువాసినుల్ సరసరాఁగ
రాజరాజేశ్వరాత్మవి భ్రాజమాన
మైన వేములవాడ నె య్యమునఁ జేరి. 179

సీ. ధర్మకుండోదక స్నానదానంబుల- జెంది రాజేశ్వర మందిరంబు
దర్శించి పరతద్వి మర్శరూపిణియైన- భ్రమరాంబికకు ప్రమొక్కి పసపుకుంకు
మంబులఁ జెన్నొంది సంబరంబున రాజ- రాజేశ్వరుని ప్రేమ రంజిలంగ
రూఢిమీఱంగ శత రుద్రీయముఖ్యసం- స్తవము లొనర్చి త త్సవిధసీమ
నన్న పర్వతంబు లాద్యనదంబులు,- విరివిగా విధించి విప్రముఖులఁ
దృప్తిఁబొందఁజేసి దివ్యషోడశమహా, దానములఁ దదర్పి తముల నుంచి

గీ. ఇవ్విధంబున నొనరించి యేకవాన
రంబు నియమంబునను జాగ రం బొనర్ప
నీశ్వరేశ్వరుఁడైన రా జేశ్వరుండు
వర మొసంగినఁ దన్మహా వరము కలిమి. 181

గీ. భవ్యరాజేశ్వరవరప్ర • భావమునను
సంతతాచరితవ్రతా • చారమునను
తపదునియమాసమానమా • ధర్మమునను
శ్రీభవానమ్మ రాజమ్మ • జెలఁగి రెలమి. 182

వ. ఇవ్విధంబున నాదంపతుల సమమోహంబునమందు నవసరంబున.

గీ. ఆభవానమ్మ కడయించి • రమ్మహేశు
కరుణ నొకపుత్త్రుఁ డొకపుత్త్రి • కనియెఁ బ్రబుద్ధు
లగుచు రాజన్న రాజమ్మ • యనఁగఁ దనరి
చంద్రుఁడునులక్ష్మి జనియించు • చంద మలర. 184

గీ. నిత్యసత్యవ్రతాచార • నియతి వెలయు
రాజమాంబ ముఖోత్సవ • రాజబింబ
యర్థనికురుంబ ఘనసుగు • ణావలంబ
భానుతప్రభ మరాంబికా • పూర్ణబింబ. 185

సీ. వైద్యశాస్త్రాభిజ్ఞ • వైద్యవర్యులచేత
బహులౌషధంబులే • ప్రభుఁ డొనర్చె
వ్యాధిపీడితజనుల్ • వచ్చివేడిన యంత
నౌషధంబుల నేమ • హాత్ముఁ డొసఁగె
బహుతటాకంబులే • ర్పడఁగ నిర్మింపుచు
వృత్తిమాన్యంబులే • విభుఁడు జేసె
తగవుగోరినవారి • ధర్మమార్గమ్మున
భావించిమించె నే • పార్థివుండు
అట్టిచెప్పలముఖ్యాన్వ • యాబ్ధి చంద్రుఁ
డైన ధర్మనృపాలుఁడు • ద్యద్యశుండు
రాజకార్యధురంధర • ప్రాభవుండు
ధరను పాలించె ధనధాన్య • సరణిఁ దనరి. 186

గీ. అతనిపుత్త్రుండు చొక్కభూ • పాగ్రగణ్యుఁ
డమ్మహైశ్వర్యధుర్యుఁ డ • హంయుతప్రభు

కారణుఁడా శ్రీశరక్షణుం • డనుదినాగ్ర
జన్మకృతవిక్రమశాశీర్వ • చనము నొంది. 187

క. శ్రీచాళుక్యనాథుఁ డనఁదగి, యాచాళుక్యనృపాలుఁ డలరె • నంచితకరుణా
లోచనుఁడు రాజకార్య, లోచనుఁడు ప్రభాప్తిలోక • లోచనుఁ డనుచున్.

గీ. చాలఁగిరాజన్నదేశాయి • చెలియలైన
రాజమాంబను బెండ్లాడి • రాజకాంతిఁ
బొలిచియున్నట్టి యొకట్ల • పుత్త్రిఁ గనిరి
నతఁడు రాజన్నచౌదరి • యనఁదలిర్చె. 189

వ. ఇవ్విధంబునఁ దత్ప్రకారంబు వచించి రాజన్ననృపాలు నభివర్ణించెద.

సీ. కలశపారావార • గర్భవీచికలందు
జనియించు సంపూర్ణ • చంద్రుఁ డనఁగ
శ్రీమహాలక్ష్మిపై • సిద్ధోదరంబున
సంభవించిన పంచ • శరుఁ డనంగ
దేవదత్తను పార్వ • తీతనూజాతుఁడై
ధర వెల్గు నలశక్తి • ధరుఁడనంగ
స్థిరతరైశ్వర్య శ • చీదేవి కుదయించి
సంతసించిన శ్రీజ • యంతుఁ డనఁగఁ
గామినేనిభవానిప్ర • కాశగర్భ
శుక్తిముక్తాఫలాయిత • స్ఫూర్తి దనరి
రాజరాజమహారాజ • రాజవిరుద
సదయరాజన్ననృపతి య • భ్యుదయ మొందె. 191

క. ఆబాల్యంబుననుండియుఁ, బ్రాబల్యసమేత వంశ • పారంపర్య
శ్రీబంధురధర నైజము, హాబాహాక్షీతి నుంచి • యలరుచు నుండెన్. 192

సీ. సత్యసత్త్వవచోయ • శస్సంస్థితుల ధర్మ- బలగోచరవిహార • కలన నొంచి
త్యాగజవానీక • యానకరిమచే- ఖలిసింహవిజయాత్మ • శకుల మీఱి
ద్వివిద్బుద్ధిసహనత్వ • తేజస్సుఖంబులఁ- జంద్రకగోత్రిశ • పరణి నెనసి
విద్యానవజ్ఞాన • హృద్యత్వలక్ష్మిఁ గా- వ్యఘనజనకహొను • వనతిఁ గాంచి

తనరె సంస్ఫూర్తికీర్తిసం ♦ తాన తరుణ
లాయి తాబ్జభవాండ భాం ♦ డాంతరస్థ
ధుర్యమాధుర్య గుణలోభి ♦ తా ర్యకామి
నేనిరాజన్న భూపాల ♦ నిపుణుఁ డలరె. 193

శా. సామాన్యాజ్ఞఁగవీశ్వరుల్ సభకు రా ♦ షడ్వర్గనిస్సీమగో
ష్ఠీమాధుర్యరసోక్తులంగరపి హా ♦ ర్షింపం బ్రవర్తించు నీ
సోమారాగ్నలవిద్యుదుత్థితకళా ♦ స్ఫూర్తిస్వరూపంబు తా
నైమాహేశ్వరపాదపంకజనప ♦ ర్యం జెందు నందంబుగన్. 194

క. పటుశబ్దార్థాలంకృతి, రటదవిరళతరగళత్త ♦ రంగాయిత వా
గ్ఘటనోల్లసదటనప్రి, స్ఫుటనప్రతిభావిశేష ♦ పూజ్యుం డగుచున్. 195

సీ. అఖిలభూజనజీవ ♦ నాధారత వహించి
యనుపమస్థితిఘనా ♦ ఘనుల మించు
దృఢతరావయవసం ♦ దీప్తసత్త్వము నొంది
కాఠిన్యమున ఘనా ♦ ఘనుల వంచు
భాసమానప్రతా ♦ పస్ఫూర్తిఁ జెన్నొంది
మునుముట్టఁగా ఘనా ♦ ఘనులఁద్రుంచు
నద్భుతైశ్వర్యమ ♦ హావైభవంబున
ననుదినంబును ఘనా ♦ ఘనుల నెంచుఁ
బ్రాజ్యతరపూజ్యసామ్రాజ్య ♦ పరతఁ జెంది
ధరణిఁ బాలించవలె నని ♦ ధన్యులెన్న
నమితజయసాంద్రకామినే ♦ న్యన్వయేందుఁ
డైనరాజన్న దేశాయి ♦ యలరుచుండె. 196

సీ. ప్రాగ్ఘురిద్విద్వత్స ♦ భాశోభనామరీ- వీజితశాటికా ♦ విలసనంబు
దక్షిణదిక్పండి ♦ తపరిషద్దేవతా- కరసమర్పిత వీటి ♦ కాభరంబు
పశ్చిమాద్యోద్యద్వి ♦ పశ్చిత్సమితిదివ్య- కాంతాఘటితపత ♦ ద్గ్రాహకంబు
నుత్తరకకుబుద్య ♦ దురుధీరసందోహ- దైవీప్రదాపిత ♦ దర్పణంబు
చెలఁగి చెలువొందె నస్థూరి ♦ సీమధామ
రత్నమయపేట శ్రీరామ ♦ రడ్డిపేట

జనవినుతకామినేనిరా ♦ జన్న నృపతి
సదనఘుమఘుమితార్భటి ♦ శారదాంబ. 197

సీ. ఏతాపసస్వామి ♦ యిరవుగా నామ్నాయ- సారస్యము వసించె ♦ సజ్జనులకు
నేతపస్వివరుండు ♦ హితవరివస్యాది- సద్గ్రంథకత మహా ♦ శయముఁ దెల్పె
నేపారికాంక్షి స ♦ మేధమానషడధ్వ- జనితాశయంబు సొం ♦ పున విధించె
నేపరివ్రాడ్ధన్యుఁ ♦ డెలమితోడద్వైతై- క్యానుసంధానంబు ♦ నందఁజేసె
నట్టిశ్రీరామభద్రేంద్ర ♦ యతివరుండు
నాత్మగురుఁడయి కరుణార ♦ సార్ద్రదృష్టు
లలరఁగ ననుత్తరారహ ♦ స్యంబుఁ గఱప
వెలసె రాజన్నదేశాయి ♦ విశ్వమునను. 198

మ. అరయన్నిత్యపరాపరప్రకృతిపూ ♦ ర్ణాహంతతానయ్యను
స్థిరధీమన్నరనాథరక్షకుఁడు నా ♦ శ్రీరామభద్రేంద్ర త
త్పరతత్త్వంబయి దేశికుండయి పరా ♦ ప్రాసాదమై యొప్ప నీ
ధరరాజన్ననృపాలచంద్రుఁ డలరెన్ ♦ ధాత్రీశ్వరుల్ మెచ్చఁగన్. 199

సీ. అసమానబలశౌర్య ♦ లసమాన సౌందర్య
రసమాన గాంభీర్య ♦ రభసములర
బుంఖానుపుంఖాజి ♦ రింఖావిశృంఖలో
త్క్రంఖాణ సంఘముల్ ♦ గడలుకొనఁగఁ
జండశుండాదండ ♦ భండనోద్దండ వే
దండతండంబులు ♦ ద్ధతి దలిర్ప
డోలికాహాటకాం ♦ దోళికాపల్యంక
పాళికా శకటసం ♦ పద వెలుంగ
నిగ్రహానుగ్రహోదగ్ర ♦ జాగ్రదుగ్ర
విగ్రహవ్యగ్రవిక్రమా ♦ వేశులైన
భటులుగొలువంగ భూభార ♦ భరతఁ బూని
నిపుణరాజన్నదేశాయి ♦ నృపతుతెన్న. 200

సీ. ఘోగధారారట్ట ♦ ఘోట్టాణములనెక్కి
హెచ్చరింపుచు సిఫా ♦ యీలు రాఁగ

నిరుపమిత తేజుఁడై కామి • నేనితలజ
నరనరాజన్య దేశాంబు • చందురుఁడలరె. 203

సీ. దంతావళస్థితో • ద్ధతవాద్యమానోగ్ర
భేరికాధణధణ • త్కారములును
యోగ్యోష్ట్రఘటితము • హుస్తాద్యమానధ
కారూఢథమథమ • త్కారములును
సంభృతాజానేయ • సంయుక్తటంకణ
దారుణరమరమ • త్కారములును
పటుజవోత్కట మహో • ద్భట సంతతాహత
పటహధాంధాంక్రియా • పాటవములు
కలయసంగరజాంగలాం • గణ కరాళ
కర్తరీముఖసుశిలీము • ఖదళితలుర
దరిగళగళదసృగ్ఝరీ • తరణిఖేల
దసిధరుఁడు రాజనృపమౌళి • యలరుచుండె. 204

సీ. హస్తముల్ రాజేశ్వ • రార్చనావిధియందు
వీనులు శివకథా • వితతియందుఁ
జూపుమహాదేవు • దీపితాంగమునందు
జిహ్వ పంచాక్షరీ • స్థిరతయందుఁ
జిత్తంబు శాంభవ • శ్రీపదాబ్జములందుఁ
స్వాంతంబు ద్వాదశా • క్షరమునందు
బుద్ధియుమానాథు • పూర్ణరూపమునందు
మనసుమాహేశ్వర • మతమునందు
నునిచి కాలత్రయాఖ్యాద్య • యోగమొంది
సంతతభ్రమరాంబికా • సామరస్య
సరసరాజేశ్వరవరప్ర • సాదలబ్ధ
జనవరాజన్య దేశాయి • చందురుఁడలరె. 205

సీ. పలికెనాసత్యోక్తిఁ • బలుకుటంతియెయు కాని- తద్వ్యతిరిక్తంబు • తలఁపులేదు
చూచెనాదయ జేయు • చూపులింతియెయు గాని- తద భావమును చూపు • నాదవకుందు

నిచ్చెనా పూర్తిగా • నిచ్చుటింతియె కాని- కొదువగా నిచ్చుట • నాదవకుండు
పట్టెనా విడకచే • పట్టుటింతియె కాని- విడచుటకెన్నఁడుఁ • గడఁగ లేదు
భళిరె యిటువంటి నృపుఁడేడి • యిఁకఁ దలంప
శాశ్వతస్థితిరాజ్యంబు • విశ్వమునను
జేయవలెననికవులెన్నఁ • జెలఁగె సార
నిపుణుఁడైనట్టి రాజన్న • నృపవరుండు. 206

గీ. అతనియర్ధాంగనాలక్ష్మి • యలరె రంగ
మాంబ యనఁగను సుగుణావ • లంబ యగుచు
సత్యశీలదయావ్రతా • చారదాన
ధర్మసాధ్వీగుణములచే • ధన్యయెన్న. 207

క. రంగను లోచనజితసా, రంగను గరుణాంచితాంత • రంగను గతిసా
రంగను జికురార్చితసా, రంగను వినుతింప సౌవ • రమణి యన దగున్.

సీ. ధవళప్రభాధళ • ధళలు నవ్వులనుంచి
హంసయానాభిఖ్య • నలరుచుండి
చాంచల్యగుణము నే • త్రాంచలంబుననుంచి
కమలానుగుణవృత్తి • నమరియుండి
నీలకాంతిచ్ఛటల్ • నెమ్మేన నానరించి
యనుపమార్యాసమా • ఖ్యను వహించి
దృగ్గోచరముగాని • దీప్తిమధ్యము నెన్న
యతనుమోహనవిద్య • గతిఁ జెలంగి
పలుకుచెలికల్మి సకిసామి • పొలఁతి రతిని
కలివిలాసవదవయవం • బుల నెదిర్చు
ధన్యరాజన్నదేశాయి • ధర్మపత్ని
యైన రంగమ్మ యెన్నఁగ • నలవియగునె. 209

సీ. స్వసమానవేషంబు • నిసుమంతయైనను- బరభామకొసఁగని • సరసిజాస్య
తనువంచననొనర్చఁ • దలఁచినవారల- బుత్త్రిలఁగా జేయు • పువ్వుబోడి
బహుతపోనిధియైన • పతిమహావిద్యాను- భవము నొందఁగఁజేయు • పద్మగంధి
భర్తృనిమిత్తమై పద్మినీబాంధవు- నుదయింపఁజేయని • యుత్పలాక్షి

కాంతరాచుళ్ళగోత్ర త ♦ తాగ్రమినేని
కులజరాజన్నదేశాయి ♦ తిలకహృదయ
స్వాభిమతధామ కులపాలి ♦ కాభిరామ
రంగమాంబను సాటిజే ♦ యంగవచ్చు. 210

సీ. ఏమహాదేవికా ♦ మేశ్వరానల్పత- త్త్వంబునందును బ్రమో ♦ దంబు నొందె
నేశ్రీమహారాజ్ఞి ♦ యింపుతోడషడధ్వ- తత్త్వవిద్విజ్ఞాన ♦ దాత్రియయ్యె
నేజగజ్జనని మ ♦ హేశ్వరార్పితసప- ర్యావిశేషంబుల ♦ నలరుచుండె
నేమహాలక్ష్మి బ్ర ♦ హ్మేశానముఖదివ్య- జీవికావార్తయై ♦ చెలఁగుచుండె
నట్టిజగదంబ లలితాంబ ♦ యధరబింబ
సైకతనితంబ భ్రమరాంబ ♦ శారదాంబ
తనదుపూజావిధానత ♦ త్పరతఁ జెంద
రంగమాంబదలిర్చె శ్రీ ♦ రంగ యగుచు. 211

సీ. అన్నార్థులైవచ్చు ♦ నన్యజాతులకైన
నన్నదానముఁజేయు ♦ ననుదినంబు
బాంధవులందు సం ♦ బంధంబు వాటించి
సేలుగావారిఁ బో ♦ షింపుచుండుఁ
దనదర్శనంబుఁ జే ♦ సిన యాచకులముందు
బుత్రభావననుండి ♦ ప్రోచుచుండుఁ
దనుఁగొల్చు సేవక ♦ దాసీజనంబుల
పనులెన్ని రక్షించు ♦ వినయమలరఁ
దనదుగ్రామంబులవసించు ♦ జనులకెల్లఁ
దల్లియై వారికుశలంబుఁ ♦ దలఁపుచుండు
నిఖిలసుగుణాఢ్య యగు కామి ♦ నేనిరంగ
మాంబ ను నుతింప శక్యమే ♦ యవనిలోన. 212

సీ. సమ్యక్శచీపాక ♦ శాసనులవిధంబు- సరసప్రభాప్రభా ♦ కరులమాడ్కి
సంభ్రమద్రోహిణీ ♦ చంద్రులకైవడి- చంద్రమతీహరి ♦ శ్చంద్రులగతి
స్థిరభీమజావీర ♦ సేనజులనఁదగి- కనదనసూయాత్రి ♦ ఘనులరీతి
పావనాంచదరుంధ ♦ తీవసిష్ఠులపోల్కి- భాసురరతిమనో ♦ భవులభాతి

కామిసేన్యన్వవాయసం ♦ ఘటితరంగ
మాంబ రాజన్న దేశాయి ♦ యాను సుభ్య
దంపతీభావమింపొందఁ ♦ దతసమృద్ధి
నిలయ విలసిల్లి రాజంద ♦ మలరుచుండె. 213

వ. మఱియు. 214

గీ. సమ్యగనపాయి పరశివ ♦ శక్తు లనఁగ
సకలసంపూర్ణచంద్రిచం ♦ ద్రిక లనంగ
భాసురాఖండదీవత ♦ త్ప్రిభ లనంగ
లలితరాజన్నరంగమ్మ ♦ వెలసి రిలను. 215

శా. రారాజద్గుణశాలి శీలవిలస ♦ ద్రాజన్న దేశాయి భా
ర్యారత్నంబగు రంగమాంగ గనియెన్ ♦ రంజిల్లి ముక్తసద్గుణా
ధారుల్ ధీరులు దారులై తనరు పు ♦ త్త్రిశ్రేష్ఠులన్ సంతత
శ్రీరమ్యాకృతి వైభవంబు గలపు ♦ త్త్రిన్ స్వర్ణపుత్త్రిం బలెన్. 216

క. ధీరోద్ధారుఁడు దారుఁడు, కారుణ్యాగణ్యపుణ్య ♦ గణనీయశుభా
కారుఁడు పెదరాజన్న ము, హీరమణుఁడు నిత్యవృద్ధి ♦ నెనయుచు నుండెన్.

మ. తనగాంభీర్యము సుందరత్వము దిగం ♦ తఖ్యాతదాతృత్వమున్
వనధిన్ మన్మథువారిజాప్తతనయున్ ♦ వందారులం జేయన
జ్జనతైకేప్సితదాయియై వెలసె నా ♦ సౌజన్యజన్యప్రథం
జినరాజన్ననృపాలమౌళి విభవ ♦ శ్రీరంజితాకారుఁడై. 218

సీ. అగణితపైతామ ♦ హాండముల్ బాహుజా
బొమ్మరిండ్లయ్యె నే ♦ పుణ్యవతికి
హరిహరబ్రహ్మాది ♦ సురతతుల్ పాంచాలి
కానంచయంబు లే ♦ కాంతకయ్యె
మేరుమందరముఖ్య ♦ భూరిపర్వతముల
చ్చనగింజలే ఘన ♦ ఘనచికురకు
మహానహావశ్రిస్తంభ ♦ మంటపంబులయ్యెల
వాలకలైన తనరె నే ♦ చంద్రముఖికి

రమ్యనవరత్నరదరైయి వి ♦ రాజమాన
రైయిన యాబాల శుభశీల ♦ యనుచుఁబొగడఁ
జిన్న రాజమ్మ విలసిల్లెఁ ♦ గన్నతల్లి
చంద్రులకు నేత్రములు చల్ల ♦ దనము గాఁగ. 219

క. సోమాంశంబునఁ దనరుచు, సోమాభంబైన ముఖము ♦ శోభిలుచుండన్
సోమావయవం బలరగ, సోమను నామాంతరమున ♦ శోభిలుచుండెన్. 220

క. గోపాలరాయఁ డాశ్రిత, గోపాలుం డనఁగఁ దనరి ♦ గోధనధాన్య
శ్రీపతియై వర్ధిల్లెను, భూపాలకసుతులలోనఁ ♦ బూజ్యుండగుచున్. 221

గీ. దేవదేవుఁడు శ్రీరాము ♦ దేవుఁ డవనిఁ
బ్రోవ వర్తించు గతి రాజ ♦ పూజ్యుఁడగుచు
వాసుదేవుఁడు విలసిల్లె ♦ వందనీయ
రాజరాజేశ్వరకృపాభి ♦ రాముఁ డగుచు. 222

చ. నిరుపమితప్రయుక్తి జన ♦ నీజనకాద్భుతసూక్తి దేవభూ
సురగురుపాదభక్తి పరి ♦ శుద్ధమనోవచనానురక్తి శ్రీ
నిరతిశయప్రసక్తి సువ ♦ నీపకరక్షణశక్తి యాదయా
పరుఁడగు కామినేని పెద ♦ పావనికేతగు ధీరు లెన్నఁగన్. 223

సీ. శ్రీసమృద్ధివహించి ♦ చెలఁగె భరద్వాజ
గోత్రంబు తద్గోత్ర ♦ పాత్ర మగుచుఁ
గమనీయమగు నేల ♦ కంట్యన్వయమున రం
జిల్లెఁ దద్వంశప్ర ♦ సిద్ధిఁ జెంది
ఋగ్యజుస్సామామ్నాయ ♦ యోగ్యసిద్ధాంతధూ
ర్ధారణధుర్యు డా ♦ దార్యశీలుఁ
డగుచుఁ గర్తుమకర్తు ♦ మన్యథాకర్తుము
ద్యచ్ఛక్తి పెద్దరా ♦ జన్న యనెడు
భూసురాధ్యుఁడు నన్నపూ ♦ ర్ణాసమేతుఁ
డగుచు శ్రీకామినేనిరా ♦ జన్న నృపతి

క్షిహితప్రదరాజవు • రోహితుండు
ధరణివర్ధిల్లెఁ దద్భాగ్య • సరణిఁ జెంది. 224

సీ. శ్రీమహాలక్ష్మీప్ర • సిద్ధి గోదావరి
వంశంబు భువినుద్భ • వంబునొందె
నందులో శరభన్న • యనెడు మంత్రీంద్రుండు
దనరె నాధన్యుని • ధర్మపత్ని
యగు వెంకమాంబకు • నాత్రిమూర్త్యంశంబు
లను సంభవించిరి • వినయమతులు
రాజన్న లింగన్న • రమణీయగాత్రుఁడౌ
చంద్రుండు వారలు • సాంద్రయశులు

ధార్మికముతోఁ దదష్టప్ర • ధానహృదయ
బహుళమంత్రాంగకృజ్జయో • పాయ గేయ
లేఖినీగ్రాహచాతురీ • లీలఁ దనరి
ధరణివర్ధిల్లి రాచంద్ర • తారకముగ. 225

శా. గౌరాకార మహాసురక్షణనకృ • త్కాదంబకాదంబ కాం
తారాగార సతీపురోనటన సం • ధానావధానావట
క్ష్మారుడ్వాసవిలాస సాత్వికమన • స్సంచార సంచారణా
ద్యారూఢస్థితి నీత కష్టతమయో • గాధార గాధారతా. 226

క. హాలాహల కోలాహల, హేలాహాళి హాళికహరణ • హితవిద్యకృపా
లోల జటాల జటాల ని, టాల తటాలసిత నాన • టచ్ఛిఖినయనా. 227

ఉత్సాహము.

దారుణప్రతాప దీప • దండభృన్నికారణా
క్షీరధీనివాసదాస • దివ్యముక్తికారణా
తారకాసురాధిపత్య • ధైర్యశౌర్యవారణా
హారిమండలాగ్రవర్య • హన్యమానవారణా. 228

మ. ఇది శ్రీరామనృపాలపేటనగరో ♦ ర్వీశాఢ్య రాచుళ్ళగో
త్రదిగంతశ్రుతకామినేనికులజ ♦ ప్రస్ఫీత లక్ష్మీశసమ
గ్రదయాసంయుత రాజశేఖరహిత ♦ ప్రవ్యక్త భద్రాయుర
భ్యుదయాఖ్యాన్విత సత్ప్రబంధము వరా ♦ ద్యుల్లాసమై చెల్వగుఁ. 229

గద్య

ఇది శ్రీమద్రామారెడ్డిపేట రాజేశ్వరకరుణాకటాక్షేక్షణప్రసాద ప్రాప్తాశేష
భాషావిశేషసామ్రాజ్యపూజ్య రాచుళ్ళగోత్రపాత్ర కామినేనివంశపయః
పారావారరాకాసుధాకర రాజన్న దేశాయిసార్వభౌమాజ్ఞాపితాం
ధ్రగీర్వాణకవిత్వచాతుర్య ధుర్య. పరాశరగోత్ర రాపాక
లింగనార్యపుత్త్ర లక్ష్మీపతిప్రణీతంబైన
భద్రాయురభ్యుదయంబున
ప్రథమోల్లాసము
శ్రీః శ్రీః శ్రీః.





శ్రీరస్తు.

# భద్రాయురభ్యుదయము.

## ద్వితీయోల్లాసము.



మణిపీఠాసీన

శ్రీమత్సింహాసనేశ్వ • రీ కారుణ్యో

ద్దామ ధనధాన్య సంప

ద్రామనృపపురాధిరాజ • రాజమహేశా.

## షష్ఠ్యంతములు.

క. ఈదృగిదమియత్తావ, చ్ఛేదక రహిత గుణమణి వి • శేషాంబుధికిన్
వేదాదివర్ణతత్త్వ, ప్రాదుర్భావోపలబ్ధి • వరధీనిధికిన్. 2

క. పరివద పరిపతత్త్రిపదా, స్పదపతిపరిమితద్ధృతి వి • హారునకు సరీ
సృపహారికి భవదారికి, గ్లపితారికి నిత్యసత్య • కల్యాకృతికిన్. 3

క. విద్రత్యుక్త్యత్ర్యగపురు, పదునికట నివసదాధి • పత్యునకు మహా
రౌద్రాంధక పూర్వద్యుష, దద్రిభిదాస్థగిత శూల • హస్తాబ్జునకున్. 4

క. ఏకానేకాకారా, టీకునకు గటీతటీప • టీ సంరాజి
శ్రీకరకృత్తికి సహాసా, వ్యాకలిత మునుపరిబోధ • కాకృతిధృతికిన్. 5

క. శరణాగత భరణామృత, చరణానతకరణ భక్త • సంవరణ త్రై
పురనాయక వరదాయక, మురహాయక బాణునకును • ముఖ్యస్తుతికిన్.

క. శబళితర శరాస కటి, ప్రబలావృత బర్హిబర్హ • భాసురమాయా
శబరవర కబరిభరు, నిబిరీ సరచితసుమోప • నీతాత్మునకున్. 7

గ పరిమళపరిమిళితవిశద శశిభృదుపలశకలకీలిత సోపానసంఘసంఘట్టనోచ్చైర్ఘుళంఘుళస్వనదభంగతరంగసంగత రథాంగాది పతంగారావ ఘుమఘుమిత సరోవరంబును బాలాతపసేవనోత్సుక జలమానుషీపరిమృదితమృదులసికతామయసంగతపానీయపానార్థసమాగత నిమజ్జనోన్మజ్జనసజ్జీభవద్వనగజమదధారాస్తబకితోదకనదంబును నవనవభవత్సవనభవన ధూమహోమధూమశ్యామీభూతదిశాకాశావకాశంబును ప్రవర్ధమానాధ్వర సముత్సవ సమాగత శతమఖముఖ నిఖిలసురవర పరిషదభిరామంబును కుసుమవిసర సమిత్కుశవిలసత్కందమూలఫలాహరణార్థ ముహుర్ముహుర్భ్యాషమాణ మౌనిసంతాన కలకలనినాదమేదురంబును విశ్రుతశ్రుతిస్మృతీతిహాసపురాణకథాకథనచతురయతివర విరాజితంబును కౌండిన్య కణ్వ మార్కండేయ కపిల శాండిల్య వత్స మౌంజాయన వ్యాస పుండరీకాగస్త్య పులహ మతంగ మాండవ్య శౌనక మైత్రేయ జహ్ను గాలవ కౌశిక గౌతమ మందపాల శాండిల్య జాబాలి మౌద్గల్యవరతంతు కశ్యప వామదేవ శమీకముఖ మహాముని సేవితంబై వెలయుచుండె. 13

క. ఆనైమిశమునఁ బరివసి, తానూనజ్ఞాన శౌన ♦ కాదిమునీంద్రుల్
నానావిధావధానవ, చోనిఖిలకథా శతాంగ ♦ సూతున్ సూతున్. 14

ఉ. చూచి మునీంద్రచంద్ర పరి ♦ శుద్ధభవన్మధురోక్తిభాక్సుధా
సేచనవృద్ధి మద్విమల ♦ చిత్తులు సాంబశివాంఘ్రిపద్మ దా
స్యోచితవృత్తులై వెలయు ♦ చుండిరిగాన నగణ్యపుణ్య సం
సూచకమైన తచ్చరిత ♦ సొంపలరన్ వివరింపవే దయన్. 15

వ. అనిప్రార్థించిన నమ్మహాత్ముండానందావిర్భావంబునఁ బులకితావయవుండు స్మయమానముఖుండై శివభక్తినిష్ఠాగరిష్ఠుల వర్తనంబులఁ జెప్పందలంచి మునులార సర్వజ్ఞ నిత్యతృప్త సదసదుభయగానాదిబోధ స్వతంత్రనిత్యాలుప్తాత్మశక్తి నిరుపమచరితానందాదికళ్యాణగుణ పరిపూర్ణుండైన యమ్మహాదేవు చరణారవిందధ్యానంబునం జేసి కృతార్థులగుదురు మఱియు నప్పరశివాభిధానపరబ్రహ్మంబు సచ్చిదానందస్వరూపుండు నిరంజనుండు నిర్వికల్పుండు "నద్వితీయుండు నద్వితీయోస్తికశ్చి" త్తని పలికిన శ్రుతిన్యాయంబున స్వవిలాస క్రీడావిశేషంబున "నిచ్ఛామాత్రం ప్రభోస్సృష్టి" యను

శ్రుతిప్రమాణంబునఁ బ్రకృతిపురుషులఁ గల్పించి తత్ప్రేరకుండై యవ్యక్త మహదహంకార పృథివ్యప్తేజోవాయ్వాకాశంబుల నుత్పాదించి తత్తద్వికారంబుల స్థూలసూక్ష్మాదిశరీరంబులం జేసి తత్తద్రూపంబులు వహించి తత్తదుపాధులైన పిండబ్రహ్మాండంబులందు స్వాంశభూతంబులైన జీవేశ్వర రూపంబులం బ్రవేశించి యందీశ్వరోపాధివహించి సర్వజ్ఞత్వ సర్వకారణత్వ సర్వాంతర్యామిత్వ సర్వస్రష్టృత్వ సర్వపాలయితృత్వ సర్వసంహర్తృత్వాది లక్షణంబులం గలిగియుండు మఱియు భూతకార్యంబైన పిండాండంబునందు స్వాంశభూతంబైన జీవరూపంబునం బ్రవేశించి బద్ధముక్తాది రూపంబుల నటింపుచుండు నివ్విధంబునఁ బిండబ్రహ్మాండంబుల జీవేశ్వర రూపంబులఁ దత్తదుపాధులం బ్రవేశించి స్రష్టృ సృజ్య పాల్య పాలక సంహర్తృ సంహార్య సర్వజ్ఞ కించిజ్జ్ఞ కార్యకారణ భోక్తృ భోగ్య నియంతృ నియామ్య వ్యాప్యవ్యాపక జ్ఞాతృజ్ఞేయ స్వామిభృత్య ధార్యధారక రక్ష్య రక్షకత్వాది విశేషంబులఁ జేతనాచేతన బద్ధముక్తాదికృత నానావిధ నటనములు లీలావిభూతిం జేయుచు నుత్పత్తిస్థితిలయ జ్ఞానాజ్ఞాన బంధమోక్షంబులెఱుంగకుండు మఱియు "యథోర్ణనాభస్సృజతే గృహ్ణాతిచ" యని యూర్ణనాభము శరీరప్రధానోపాదాన కారణంబునఁ దనయందుఁ దంతువర్గంబు సృజించి బుద్ధిప్రధాననిమిత్తకారణంబున నాతంతువర్గంబుఁ గూర్చి తత్తంతుగ్రసనంబుఁ జేసినగతి నప్పరశివుం డుపాదాననిమిత్త కారణద్వయభూతుండై జగదుత్పత్త్యాదికంబు లీలావిభూతిం జేసి పాయనివానిచందంబుననుండు మృత్తికపిండరూపంబై యనంతరంబున జలాహరణాదిక్రియలకు ఘటరూపంబున యోగ్యంబై తత్తద్వికారంబులు కార్యరూపఘటభావనం గలిగియుండి తత్కారణభూత మృద్వస్తుభావంబున వికారాద్యవస్థా రహితంబై మృత్తిక యొకకటియైనప్రకారంబున "పృథివ్యాపస్తథాతేజో వాయురాకాశ ఏవచ। సర్వేంద్రియాంతఃకరణం పురుషాఖ్యం హియజ్జగత్। సఏవ సర్వభూతాత్మా విశ్వరూపో యతోవ్యయః" అన్న న్యాయంబున నానావిధోపాధుల సర్వేశ్వరుం డలరుచుండి స్వావినాభావసామర్థ్యంబున వసించునని బోధించి శివభక్తుల మాహాత్మ్యంబుఁ జెప్పెద నాకర్ణింపుండని యిట్లనియె.

సీ. సకల ధనధాన్య రత్నవ ♦ స్త్రవస్త్ర
విప్రముఖవర్ణ వేగవ ♦ ద్వీతి సముద
సామజ స్యందన పదాతి ♦ సహితమగుచు
నవనిపాలయు నవంతి రా ♦ జ్యంబు కడిమి. 17

క. ఆదివ్యనగరమున నొక, భూదేవుఁడు బహుపదార్థ ♦ పూరిత గేహా
మోదరమునఁ దగ సకల జ, నాదరణీయుఁడయి సుంద ♦ రాఖ్యుఁ దనరెన్.

క. హుంకారయుక్తుఁడైన, త్యంకారకుసీద బహుస ♦ మాగత విత్తా
లంకార వైభవంబున, శంకారహితుఁడయి తిరుగు ♦ సత్యేతరుఁడై. 19

క. ఆరమ్యపురమునందొక, వారాంగన సారవార ♦ వనితా జనతా
సారస్యమలరి పింగళ, నారూఢాఖ్యను వహించి ♦ నైపుణిఁ దనరెన్. 20

వ. అది యొకనాఁడు సకలాభరణ భూషితయగుచు రాజమార్గంబున నరుదెంచునెడ. 21

క. చూచి తలయూచి సుందరుఁ, డాచతురత యావిలాస ♦ మాత్మ నెడుచు మున్
నీచాతినీచుఁడై త, ద్వ్యాచిక్రంసానుమతిని ♦ వర్తిలఁ దలఁచెన్. 22

క. ఆ కాంతామణి పూర్వమ, నైకాంతికమతియునయ్యు ♦ నవ్విప్రునియం
దాకలితచిత్త యయ్యెఁ బు, రాకృత విధివశత దాట ♦ రాదెవ్వరికిన్.

వ. ఇవ్విధంబున నాపింగళయను వారాంగన సుందరుండను ధరావరుని నిజకేళీ మందిరంబున నునిచి తత్సకలసంపదాకర్షణశీలయై యిభబంధ ధేనుబంధ వ్యానతకరణాది బంధవిశేషంబులవలనను అంగుష్ఠపద గుల్ఫ జాను జఘన నాభి వక్షస్స్తన కంఠ కపోల దంతాధర కర్ణ నాసికా మస్తకస్థలంబులు కళాస్పదంబులని యెఱింగించి యుత్పలపత్త్రి మయూరపదాది నఖక్షత స్థలవిశేషంబులను రత్యంతరగతులను బాహ్యమార్గంబునాందించి నక్తందివంబుల విషయాసక్తుంజేసి సంగీత నాట్యవిద్యానైపుణ్యంబుల సంతుష్టాంతరంగునింజేసి స్వాధీనుంగా నొనరించిన. 24

గీ. ఇటుల నాతండు దానింట ♦ నిష్టగోష్ఠి
నలయుచుండఁ దపోధర్మ ♦ విశ్రుతుండు
[illegible] శివయోగీంద్రుఁ ♦ డేగుదెంచె
విప్రపుణ్యంబు మూర్తీభ ♦ వించినటుల. 25

శా. ఈతీరిన్ ఋషభాఖ్యనాముఁడు శివయో • గీంద్రుండు రాఁజూచి యా
వారస్త్రీమణి బ్రాహ్మణుండు ముదభా • వంబేర్పడం జిత్రవ
ర్ణారూఢిం దగుచీనిచీన వసనా • ద్యాధార పీఠంబుపైఁ
జేరంజేయుచు భక్తిపూర్వముగఁ ద • చ్చిత్తంబు రంజిల్లఁగన్. 26

క. అమ్మహనీయుని పాదా, బ్జమ్ముల శీతమ్ములైన • జలములచే మో
దమ్మునఁ గడుగుచు నైజ శి, రమ్ములపైఁ జల్లుకొని తి • రమ్మగు మతిచేన్.

గీ. కుశలము వచించి యాయోగి • కుంజరునకు
గంధపుష్పాక్షతాది స • త్కారవిధులఁ
బూజలొనరించి హృద్యమౌ • భోజనంబుఁ
బొసఁగ నొసఁగినఁ జేవార్చి • పొలిచియున్న. 28

సీ. దీవ్యమానాంబరో • ద్దీప్తమౌ పాన్పుపై
నింపుగా మునుబవ్వ • ళింపఁ జేసి
యడుగులొత్తులు సప • ర్యావిశేషంబులు
నలరింపుచుండంగ • నమ్మహాత్ముఁ
డత్యంత ముదితుఁడై • యారేయి నివసించి
స్వస్థానమున కిచ్ఛఁ • జనిన పిదప
సమయ మవ్విధమున • జరిగిన నవ్వేశ్య
కర్మార్జితంబైన • గతి వహించి
దేహమెడలిన నంత భూ • దేవుఁడటుల
నంతమొంది దశార్ణ దే • శాధినాథ
వజ్రబాహుని భార్యయై • వసుధఁ బరఁగు
సుమతి యనుదాని గర్భంబుఁ • జొచ్చి పొలిచె. 29

గీ. ఆసుమతి గర్భమునఁ బూర్వ • మస్మదుక్త
మందఱుండను విప్రుం డ • మందవిషయ
వర్తనుండయి బహురోగ • వశతనొంది
నిధన మొందుచుఁ జాలయి • నిలిచె నపుడు. 30

చ. ఎనసిన గర్భభారమున • నేచిన యాచిగురాకుబోఁడి మే
న్గనుఁగొని తత్సపత్నులు మ • నంబున నోర్వమిదోషఁ దన్నహిం.

సన మొనరింపఁ జాలిన వి • నంబు మెసంగఁగఁ జేయ నామె య
వ్వనట రెఱుంగకన్ రుచిర • వస్తువటంచును గ్రోలునయ్యెడన్. 31

క. ఆపాదమస్తకంబున, కాపొలఁతికి దానికడుపు • నందుండిన యా
పాపనికి నిండఁబర్విన, యాపద జనియించె మేను • లలకుట నొందన్. 32

ఉ. ఆసతి దైవయోగమున • నవ్విషమానియుఁ జావకన్ మహా
యాసమునొంది కుంది మర • ణాగతికంటె దురంత దుస్సహం
బై నుడిఁబెట్టు క్లేశభర • మందుచుఁ బుత్త్రునిఁగాంచి యార్తిచే
గాసిలెఁ బూర్వజన్మకృత • కర్మమదెట్టిదియో తలంపగన్. 33

చ. స్ఫురదురు మాతృగర్భమునఁ • బుట్టిన యత్తనయుండు భూనభో
ంతర మదరంగ నేడ్చినను • దజ్జనయిత్రియుఁ దద్విధంబున
న్మొరయిడ వజ్రబాహుఁడు స • ముద్ధతి నంతయు నాలకించి వా
రిరువురి రోదనంబులకు • నెంతయు విస్మితుఁడై రయంబునన్. 34

మ. జగదత్యద్భుత సత్యమార్గ విదిత • స్వార్వైద్యులై నట్టి య
య్యగదంకారులనెల్ల రాఁబనిచి జా • యాపుత్త్రులున్నట్టి నై
జ గృహాభ్యంతర సీమఁజేర్చి తగుభై • షజ్యంబు లిప్పించి వా
రి గరిష్ఠామయమేమి పోకునికి నా • ర్తింజెంది మోహంబునన్. 35

చ. ప్రతిదిన మీగతిన్ జపత • పంబుల శాంతుల మంత్రతంత్ర సం
గతుల విభాకరార్చనలఁ • గైకొనుచోఁ దదుపాధివేదనా
ప్రతిహతికృత్ప్రయోగము ల • పారములై తనరంగఁజేసి త
త్ప్రతికృతిఁ గానఁడయ్యెఁ దొలి • బాములఁ జేసిన చెయ్వులెట్టివో. 36

వ. మఱియు. 37

సీ. ఆరాజమౌళి దై • వారాధనాది ప్ర
సిద్ధి సిద్ధక్రియా • సిద్ధులెన్ని
మంత్రించ గరళ స • మ్మూర్ఛ దుర్దముతో
రోగంబు లడఁగ కా • రూఢి నొంద
రాత్రి నిద్రయులేక • రాజపత్ని దలంకి
పుత్త్రబాధకుఁ జాల • పొగిలి నొగిలి

కృశియించి దుర్దశా ♦ వశతచే నొకకొన్ని
నెలలు గడపంగ నా ♦ నృపతి వరుఁడు
వీరిరోగంబుమాన్ప నె ♦ వ్వారితరము
సతి సుతుఁడు జీవమొందియుఁ ♦ జచ్చువార
లంచు మదిలో విచారించి ♦ యంతకంత
వంతనొందిన వారికై ♦ చింతనొంది. 38

క. ఈగృహిణీతనయులు నర, కాగతులే కానిచో మ ♦ హారోగములన్
జోగుచు నేడ్చుచు నిద్రా, త్యాగము నొందింతురా ని ♦ తాంత వ్యథచేన్.

వ. అదియునుంగాక. 40

క. మృతిఁబొందక జీవించుట, కతిశక్తులుగారు వీరు ♦ హతభోగులు గా
న తలంచెద నొక్కటి మది, నితరముఁ దలపోయ వలవ ♦ దిట్టిపనికినై.

గీ. అనుచుఁ దత్పత్ను ♦ లందు మోహావేశ
మొంది సక్తుఁడగుచుఁ ♦ గుందుచున్న
దారపుత్త్రులను ర ♦ థంబుపై నిడుకొని
యడవిఁజేర్ప సూత ♦ యనుచుఁ బలుక. 42

క. ఆసారథి వేసారక, యాసారసముఖిని సుతు మ ♦ హాదుర్గ పథా
వాసుల సత్రాసుల దు, ర్వాసులఁ గావించి మరల ♦ వచ్చెం బురికిన్. 43

వ. తదనంతరంబ. 44

సీ. ప్రస్ఫురత్క్షిస్థల ♦ ప్రస్ఫుటద్ద్రుక్రమ- ధ్వస్తజీర్ణచ్ఛద ♦ స్థానమగుచు
నిర్ద్రవవ్యద్ధ్వని ♦ రిన్ద్రగత్యధ్వనీ- నాధ్వజాతాయన ♦ హరిణమగుచు
గ్రావకస్రస్త దు ♦ ష్ప్రస్తరోద్ఘట్టనో- చ్చైస్స్వనన్నిర్ఝర ♦ స్థగితమగుచుఁ
గుటకోటర రటత్క్ర ♦ రటముఖాండజపత్త్ర- పటపటత్కార సం♦భరితమగుచు
నడరు బహుయోజనాద్వార ♦ హర్వతిప్ర
భానభిజ్ఞ మహామృగ ♦ స్త్యానభయద
భూతభేతాళరావ ప్ర ♦ భూత దురవ
గాహ గహనంబు నారాజ ♦ కాంతజొచ్చె. 45

వ. అదియు నేలాలవంగ తక్కోలపీలు గంధసార ఘనసార కాకతుండ సల్ల
కీ కాంచనాపార లకుచ కంటకిఫలభిజ్జుల పోటలఫలినీ జటిల గణికా కురంట

కకోవిదార బంధుజీవక దాడిమాశ్వకర్ణ హస్తికర్ణ చాంపేయ తాలపర్ణీ లాంగలి సదాఫల తమాల హింతాల నారికేళ ఖర్జూర కర్బురక్షీరికాశ్లేష్మాతకీ విభీతకీ హరీతకీ వాక్పుష్పికా భల్లాతకీ ఖదిర శాకోట కాలాంగరు కాలస్కంధ చించొదుంబర చలదళ శమీరుచక కుటజాది వృక్షభేదంబులు గలిగి సంతతాభంగతరంగిణీరోధఃప్రరూఢ వేతసీకుహర విహరదపరిమిత గండభేరుండ సింహ శరభ శార్దూల భల్లూక వానర సృగాల వృకాది మృగవ్యాపారంబును బహువిహగనినాద మేదురంబునగు నచ్చట. 46

మ. బహుధాధావదనేక భీకరమృగా • బ్రహ్మణ్యవర్ధిష్ణు దా
వ హుతాశావృతతార్ణభూచిటచిట • స్వానంబుచే నులుకంచున్
జహిహిత్యుత్ప్లుత మస్మదభ్యవహృతి • స్థానంజవాదంచుఁ బై
నహహేత్యుక్తుల దానవుల్ గదియ దుః • ఖార్తిన్ వడిన్ బోవుచున్. 47

చ. అతివ నితాంతచింతనుఁ ద్రు • ధాతత తృష్టలచేత భీతయై
సుతుని వహించి యించుకయు • సోలుచు వ్రాలుచు బాలకున్ ధరా
పతనము నొందఁజేయుచు న • పారపు ఖేదము నూదుచుం బురా
కృతమగు కర్మమెన్ని తమ • కింపుచు నూర్పులు సందడింపఁగన్. 48

మ. పదరుక్కృత్కఠినోగ్ర కంటక శిలా • ప్రాయంపుత్రోవన్మహా
పదఁ జెందుం బ్రబ్బదపత్రముక్తకచయై • ప్రత్యగ్ర జాగ్రద్బలో
న్మదవద్బంధుర గంధసింధురమిళ • న్మార్గంబుఁ గన్గొంచు స
మ్మదమొందుం దరిమేరలేని పదవి • న్మల్లాడుచుం బోవుచున్. 49

వ. మఱియును. 50

శా. భూతప్రేతపిశాచఢాకినులచే • భూరివ్యథం జెందుచున్
యాతాయాత బిలేశయంబులకు భీ • త్యావృత్తి పెంపొంది భూ
జాతాంతస్తటినీ నికుంజములలో • సంచారమున్ జేయుచో
ధూతాధూత కృశాంగి యావనములో • దూరంబుగా నేగఁగన్. 51

క. గోరథవాజి నరస్తం, బేరమయుత నైశ్యపదము • ప్రేమంగని దై
వారంభయత్నమున నం, భోరుహలోచనయుఁ బోవఁ • బోవన్ మ్రోలన్.

గీ. ధనకనకవస్తువాహనో • దంచితంబు
నమితపుణిగణ విపణి మా • ర్గాన్వితంబు

విప్ర నృప వైశ్య శూద్ర ప్ర • వీణమైన
యొక్క వైశ్యపురంబును • నువిద జూచి. 53

క. ఆపురమునఁ గాపురమై, చూపట్టెను బద్మకరుఁడు • సుముఖిత నానా
భూప శ్రీపతి కరుణన్, రైవతియై వైశ్యకులజ • రత్నంబగుచున్. 54

సీ. పూబోడి తత్పురం • బునకు సపుత్త్రియై
చనియెఁ గృశీభూత • తనువుఁ దాల్చి
చనినఁ దజ్జనపాలు • సదనంబున వసించు
నొక దాసి యారాజ • యువతివార్త
నెఱిఁగి యవ్వైశ్యాధ్యు • నెదుటను గొనిపోవ
నతఁడు రుజాపీడి • తాంగి యైన
నృపపత్ని నీక్షించి • నిపుణుఁడై యేకాంత
మలరఁ దద్వృత్తాంత • మంత యరసి
యహహ కష్టంబనుచు మది • నబ్బురంబు
నొంది నిట్టూర్పు నిగిడించి • యోగ్యమైన
తనదు గేహంబులోన న • త్తన్వినుంచి
గారవంబెనయించుచుఁ • గరుణతోడ. 55

మ. మణిమంత్రౌషధ యంత్రతంత్రముఖ స • న్మార్గనాద్య హృష్యద్భిష
ఙ్మణులం బిల్చి యనేకవిత్తముల సం • భావించి తత్తత్ప్రతా
గణనీయౌషధజాతిఁ దత్తనుగరో • గం బింతయుం బోఁ బ్రతి
క్షణ మేమారకొసంగఁ జేయుచుఁ దగం • గారుణ్యసంయుక్తుఁడై. 56

వ. ఇవ్విధంబున బహువిధోపచారంబులు జేయింపుచుఁ బథ్యపానీయంబుల వలనను జికిత్సకోపదిష్ట విశిష్టమార్గంబుల రక్షింపుచుండ. 57

క. ఆరాజపత్ని ప్రణయ, క్ష్మారూఢార్తి ననుశాంతి • నందక యుండెన్
సారంబగు రోగమునఁ గు, మారుఁడు మృతుఁడయ్యె దైవ • మాయావశుఁడై.

చ. ఇటువలెఁ బుత్త్రుఁ డీల్గిన స • హింపక చంపకగంధి శోక ము
త్కటముగ మూర్ఛనొందె మద • దంతి కరాహతవల్లి కైవడిన్
దిటమున నంతలోవలను • దెల్వివహింపుచు బాష్పధార మి
క్కటమగుచోఁ బయోధర స • కాశమునం దొరుగంగ నిట్లనున్. 59

ఉ. హా యను మన్మనోరథసు • ధార్ణవపూర్ణ శశాంకరుచ్య దే
హా యను సర్వధూర్వహ వి • హార మహారమణాంకపాణి వా
హా యను సత్ప్రతాప తప • నాభి హతారి మహాస్తమస్సమూ
హా యను ధర్మకీర్తినివ • హా యను నస్మదభీష్ట హా యనున్. 60

సీ. నాథధిక్కృతధీస • నాథరై తగు నన్ను-
నూరార్చగాఁ నెవ్వ • రో కుమార
చత్యనీహిత నన • పత్యరై తగు నన్ను
ననునయించఁగ నెవ్వ • రాత్మజాత
కాంతనిష్ఠాస్థితై • కాంతనై తగు నన్నుఁ
గడఁదేర్చ నెవ్వరు • గలరు పుత్త్ర
ప్రియనిరాకృతపథా • ప్రియరై తగిన నన్ను
నలరింప నెవ్వరో • యనుఁగు తనయ
యనుచు విలపించు మూర్ఛిల్లు • నావణిగ్జ
నములు పలవించి సాంత్వ వా • క్యములు బలుకఁ
బుత్త్రమోహంబుచే భూమిఁ • బొరలి పొరలి
బహుళ దుఃఖాబ్ధిలోఁ గ్రుంకి • పలువరించె. 61

క. ఈరీతి నుండు తఱి న, న్నారీమణి దుఃఖరోగ • నాశకుఁడు మహో
దారుఁడు ఋషభాఖ్య శివా, కారుఁడు శివయోగి వచ్చెఁ • గరుణాన్వితుఁడై.

గీ. ఇటుల వచ్చిన నవ్వైశ్యుఁ • డెదురుకొనుచు
నర్ఘ్యపాద్యాది విధులచే • నలరఁ జేయఁ
బూజితుండయి యాయోగి • పుంగవుండు
తద్గృహంబున దుఃఖించు • తరుణి కనియె. 63

ఉ. ఊరక యేడ్వ నేటికిఁ ద • లోదరి యీదరి లేని శోకదుః
ఖారతి నొంద నీకుఁ దగ • వా మగువా జగతీతలంబులో
నేరుపుతోడ నెవ్వరు జ • నింపరొ యెవ్వరు చావరో వ్యధా
ధారతఁ జెందనేల వని • తా జనితార్తి వహింప నేటికిన్. 64

సీ. తెలియంగ విను మిట్టి • దేహభావంబులు
వారిదాభంబులే • వనజగంధి

యొకచోట జనియించు ♦ నొకచోటి కేగు వే
　　　రొకచోట జనియింపు ♦ చుండుఁ దలఁప
నదిగాన లోకంబు ♦ నందు ఫేనాభమై
　　　యంగంబు పంచత్వ ♦ మందుచుండు
సతతంబు శోకావ ♦ సానంబు గానక
　　　శోకింప వలవదు ♦ సూరిజనులు
మును గుణంబులచే భూత ♦ ములు జనించి
లలిఁ జరించుచు నిజకర్మ ♦ ములఁదలిర్చి
కాలమునఁ గార్శ్యము వహించి ♦ కడఁగి వాస
నావశత నిద్దురించు వి ♦ న్నాణముగను.　　65

క. విను సత్త్వాదిగుణంబులు, ఘనమాయా జన్యమాన ♦ గతిని ధరించున్
దనువులు తద్గుణములచే, జనియించును దద్గుణ ప్ర ♦ సక్తములగుచున్.　　66

గీ. సత్త్వగుణమున దేవత్వ ♦ సంజ్ఞ జెందు
నలరజోగుణమున మను ♦ ష్యత్వ మొందు
రహిఁ దమోగుణమునను ది ♦ ర్యక్త్వ మెనయు
వసుధ జంతువు వాసనా ♦ వశతఁ జేసి.　　67

గీ. జంతువు వివర్తమాన సం ♦ సారమునను
ముందుఁ గర్మానుబంధనం ♦ బునఁదలిర్చి
దుష్టసుఖదుఃఖమనము నై ♦ దుర్విభావ్య
మైన గతిని వహించు నా ♦ యద్భుతముగ.　　68

సీ. కల్పాయు వైనను ♦ గలదేవతలకైనఁ
　　　గల దపాయము మహా ♦ కల్పమునను
వరకర్మ బద్ధులౌ ♦ నరదేహులకు సిద్ధ
　　　మౌ నపాయం బిందు ♦ కరుదె లేమ
తెలియక కొందఱీ ♦ దేహంబునకుఁ గాల
　　　మే హేతు వని పల్కి ♦ రిందువదన
యొలమిఁ గొందఱు కర్మ ♦ మే యంద్రు కొందఱు
　　　గుణముల నెంచిరి ♦ గణుతిఁ జేసి

కాలకర్మగుణాధార ♦ గతిని బూని
పంచభూతాత్మకం బయి ♦ పరగు తనువు
పుట్టుట యుఁ జచ్చుట యుఁ జూచి ♦ మోహశోక
ముల వహింతురు పండితుల్ ♦ జలరుహాక్షి. 69

క. అవ్యక్తమున జనింపుచు, నవ్యంక్తంబున నశింపు ♦ చవ్యక్తమునన్
సువ్యక్త మగుచు జంతువు, భవ్యజలంబునను బుగ్గ ♦ పగిదిఁ దలంపన్. 70

గీ. ఎపుడు గర్భస్థుఁ డో దేహి ♦ యపుడె నాశ
నంబు కల్పిత మయ్యె ని ♦ క్క్రంబు గాఁగ
దైవవశతను జీవించు ♦ దైవవశత
మరణ మొందును జంతు వీ ♦ ధరణిలోన. 71

సీ. ఉదరస్థు లై కొంద ♦ ఱుదయించి కొందఱు
ముదయక కొందఱు ముదసికొంద
ఱంతంబు నొందుచు ♦ నల పురాతనకర్మ
గతి యెట్టి దో యట్టి ♦ గతి వహించు
దేహంబుఁ జెంది త ♦ ద్దేహానురూపంబు
లగు సుఖదుఃఖాదు ♦ లనుభవించు
మాయానుభావప్ర ♦ మాణంబుచే స్త్రీలు
పురుషులు సురతాను ♦ భూతిఁ జెంది
కలసి యుండిన దైవయో ♦ గమున జంతు
వుదయ మొందుచు సమ్యగా ♦ యువును సుఖము
దుఃఖము ను బుణ్యపాపంబు ♦ దొడర శాస్త్ర
ధనములను బొందు చుండు ని ♦ ద్ధాత్రిలోన. 72

గీ. వనజభవుఁడు లలాటంబు ♦ లనులిఖించి
తనరు రూపంబు గా దేహి ♦ దనరుచుండుఁ
గాలకర్మంబుల విలంఘ్య ♦ గతి వహింప
భావముల నిత్యములు దుఃఖ ♦ పడఁగ నేల 73

గీ. స్వప్నమున సౌఖ్య మెక్కడ ♦ సమ్యగింద్ర
జాలమున సత్య మెక్కడ ♦ శారదాభ్ర

మునకు నిత్యత్వ మెక్కడఁ ♦ దనువులకును
నిలుక డెక్కడ లే దని ♦ నిశ్చయింపు. 74

క. గతకోట్యాయుతసంఖ్యా, మితజన్మంబుల నతిక్ర ♦ మింపఁగ నాశా
శ్వతపరతత్త్వము నెఱుఁగమి, సతి నీ కీభ్రమ జనించె ♦ సాధ్వస మెసఁగన్.

క. ఎవ్వనికిఁ దనయ వైతివి, యెవ్వనికిం జనని వైతి ♦ వెవ్వని కిలలో
నివ్వటిల భార్య వైతివి, జవ్వని శతకోటిజన్మ ♦ సంగత వగుచున్. 76

సీ. పంచభూతాత్మకో ♦ దంచితం బగు మేను
త్వఙ్మాంసరుధిర మే ♦ దఃప్రభూత
మజ్జాస్థిసహితంబు ♦ మఱియుఁ బురీషమూ
త్రశ్లేష్మభాజన ♦ త్వంబు నొంద
నాత్మదేహోద్భవం ♦ బగు మలంబును దన
పుత్త్రుం డనుచు మూఢ ♦ బుద్ధిఁ జేసి
పొగులంగ నేటికిఁ ♦ బొలఁతి యొకానొక
జనుఁడు మృత్యువు యత్న ♦ మునఁ ధరించె
నేనిఁ బూర్వంబునను ♦ ధీరు లెంత బాధ
పడిరి తపమున విద్యచేఁ ♦ బ్రజ్ఞచేత
నవ్యమంత్రౌషధరసాయ ♦ నములచేత
మృత్యు నొక ధీరుఁ డైనఁ ద ♦ రింప లేఁడు. 77

క. ప్రతిదినము జంతుజాలము, మృతి బొందుట నిజము గాన ♦ మృత్యుహరు నుమా
పతి సర్వేశ్వరు శాశ్వతు, సతి శరణము గాఁగఁ దలఁపు ♦ సద్గతి గలుగున్.

గీ. ఎంత దడవు తన్మ ♦ హేశ్వరుపాదాంబు
జంబు శరణ మనుచు ♦ స్వాంతమునను
దలఁచ దంత దడవు ♦ తాపజన్మజరాత్త
ఘోరమృత్యుభయము ♦ మీర లేఁడు. 79

క. దారుణసంసారవిహా, రారూఢం బైన సుఖము ♦ నంటిన మదిలో
ధీరుం డగుచు మహేశ్వరు, నారాధించంగ వలయు ♦ నజ్ఞుని కైనన్. 80

క. అతివ శివధ్యానరసా, మృతపానముఁ జేయుమనుజుఁ ♦ డెవ్వాఁ డైనన్. 81
సతతము భవవిషయాసవ, గతిఁ దృష్ణం బొనుప లేఁడు ♦ కంజదళాక్షీ.

గీ. సర్వసంగవివర్జిత • స్వాంతవృత్తి
ముందు వైరాగ్యయంత్రితం • బుగ నొనర్చి
యెవుడు శివపదమగ్నమై • యునఁగఁ జేయు
నపుడు పునరుద్భవముఁ జెందఁ • డబ్జవదన. 82

వ. మఱియు నమ్మహాదేవు ప్రభావంబు వివరించెద. 83

సీ. సకలజగత్సాక్షి • సర్వేశ్వరుఁడు పరా
త్పరుఁడు సాక్షాత్పర • బ్రహ్మతత్వ
రుం డేక ఏవ రు • ద్రో న ద్వితీయోఽస్తి
తస్మాత్తనం దగు • ధన్యమూర్తి
బ్రహ్మాధిపతి యని • బ్రహ్మణోధిపతిశ్చ
యని శ్రుతుల్ బలుకు నై • య్యను దలిర్చు
మఱి శంభు రాకాశ • మధ్యే యనుచు విశ్వ
తశ్చక్షు వని శ్రుతుల్ • దవిలి చాట
యః పరస్స మహేశ్వర • యనుచు నజుఁడు
నిత్యుఁడును శాశ్వతుండును • నిర్గుణుండు
ననుచు బహువిధముల శ్రుతుల్ • మును వచింప
నతడు నిత్యస్వరూపుఁడై యలరు చుండు. 84

సీ. సర్వవిద్యలకు నీ • శానుఁడై యధిపతి
సర్వభూతముల కీ • శ్వరుఁడు కర్త
రూఢి విశ్వాధికో • రుద్రయం చూర్ధ్వరే
తం విరూపాక్షమం • తస్థుఁడైన
యాత్ముఁడు నద్వితీ • యస్వరూపుఁడు శివ
మద్వైత మనుచు వే • దాంతనికర
మెప్పుడు వచియింప • నీశుండు సర్వోత్త
మోత్తముం డని శ్రుతు • లొనరఁ బలుకఁ
సర్వలోకంబులకుఁ బతి • సకలవృక్ష
ములకుఁ బతి యును మఱి పశు • వులకుఁ బతియుఁ

తెలియ నారాయణుండు విష్ణు • దేవుఁ డనఁగ
నతఁడు గాక తదన్యుఁ డీ • యవనిఁ గలఁడె. 85

సీ. ఉర్విఁ గాలాగ్నిరు • ద్రోపనిషచ్ఛ్రుత
రుద్రీయములు ముందు • రుద్రుఁ దెల్పు
శ్వేతాశ్వతరము ను • సూతసంహిత యు మ
హాదేవుఁ డే దేవుఁ • డనుచుఁ బలుకఁ
గైవల్యము ను లస • త్కఠవల్లి యును బర
శివుఁ డె బ్రహ్మం బని • చెప్పుచుండు
ఘనబృహదారణ్య • కంబు నారాయణ
ప్రశ్నంబు న భవుండు • బ్రహ్మ మనుచు
వేదపాద స్తవంబు ను • విశదవృత్తి
శింశుమార స్తవంబు ను • జెప్పుచుండు
వామదేవుని మతి యథ • ర్వశిరము
శంకరుం డ పరుం డని • చాటుచుండు. 86

క. యోగీశ్వరేశ్వరుం డని, యోగతి వాయవ్యసంహి • తాష్టావింశ
త్యాగమము లెవ్వని మహా, భాగుఁ డనుచు వినుతిఁ జేయుఁ • బరమప్రీతిన్.

క. గాయత్రి యు జాబాలము, ఖ్యాయత వేదాంతములు ని • రాకారశివ
స్వాయత్తత్వముఁ దెల్పెన్, వే యన నేటికి శివుండు • విశ్వమయుఁ డగున్.

గీ. పురుషసూక్త మెవని • బోధించు బ్రహ్మాది
దివిజు లెల్లనతని • దివ్యపాద
కమలములను గొల్చి • తమతమ నెలవులఁ
జెలఁగుచుందు రదియుఁ • జెప్పనేల. 89

సీ. అవ్యయనిర్వికల్ • ప్పాద్వితీయబ్రహ్మ
మును ధ్యాన మొనరింపఁ • దనరు ననుచుఁ
దత్స్వరూపావస్థి • తత్వంబు జెన్నొంది
సగుణుండై విలసిల్లు • శంకరుండు
దేవుండు గానఁ ద • ద్దేవునకిష్ట మై
ధనరుహారుద్రాక్ష • ధారణంబు

ధర్మవిభూతిధా ♦ రణము ను దగి యతం
డధిపతి గాన న ♦ య్యధిపుఁ డలరఁ
దాల్చు లక్షణములను ద ♦ ద్భక్తు లైన
జనులు ధరియింప వలయు నీ ♦ జగతిలోన
విప్రముఖజాతులకు భక్తి ♦ విభవ మలరఁ
దాల్పవలయు నటంచు వే ♦ దములు బలికె. 90

చ. అతని విభూతి వేదములు ♦ నర్థములుం గ్రతువుల్ వ్రతంబులున్
శతధృతి యుం బ్రభాకరుఁడు ♦ చంద్రుఁ డుపేంద్రుఁడు నింద్రముఖ్యది
క్పతులు ను సిద్ధసాధ్యులు సు ♦ పర్వులుఁ దారకలున్ గ్రహంబులున్
యతులు ను యక్షరాక్షసులు ♦ నంతయుఁ దద్విభవంబునం దగున్. 91

క. సతతచతుర్ముఖముఖదే, వతలు పసులు గాఁగఁ నతఁడు ♦ పశుపతి గాఁగన్
మతిఁదలఁప నిది పశూనాం, పతయే నమ యనుచు శ్రుతులు ♦ బలుకఁగ వినవే

క. అదిగాన నీవు భ్రాంతిని, వదలి మహేశ్వరుని భక్త ♦ వత్సలుని శివున్
ముదమున నెమ్మదిలోపలఁ, జెదరక యారాధనంబుఁ జేయుము భక్తిన్.

క. అని యవ్విధమున శివయో, గినిబోధిత యగుచు రాజ్ఞి ♦ కేల్మొగిచి తదు
క్తినిబద్ధబుద్ధిఁ దత్పద, వనజంబుల మీఁద వ్రాలి ♦ పలికె వినతిచేన్. 94

క. స్వామీ మృతపుత్త్రిత్వం, బామయము సదేష్టబాంధ ♦ వాభిభవమునన్
వేమరు గలిగింపఁగనిఁక, నామరణ మె కాని తనకు ♦ నన్య మెఱుంగన్.

గీ. కాన నీతనయునితోడ ♦ మేను దొరఁగి
నిను భజించి కృతార్థత ♦ నెగడు ననుచుఁ
దవిలి మరణోన్ముఖత్వంబుఁ ♦ దాల్చు నతివఁ
గనుచు శివయోగి నెమ్మదిఁ ♦ గరుణ దోఁప. 96

సీ. పూర్వోపకారంబు ♦ పురణించి మృతుఁ డైన
బాలుని కడఁ జేరి ♦ భవ్యమైన
భస్మంబు శివమంత్ర ♦ భావితంబుగఁ జేసి
వివృత మౌ తద్వక్త్రి ♦ వివరమునను
ప్రసరించ మృతుఁ డైన ♦ బాలుఁ డెప్పటి యట్ల
కన్నులు దెరచి త ♦ త్కరుణచేత

సర్వేంద్రియపరత • జరుగఁగ స్తన్యంబు
నకు రోదనము సల్పి • నంత వేగ
మృతుఁ డగుచుఁ బునరుత్థాన • మొనఁగె ననుచు
వైశ్యపురమున వసియించు • వార లెల్ల
విస్మితస్వాంతులై వచ్చి • వెరగు నొంది
మించు సమ్మోదమున నను వ • సించియుండె. 97

గీ. అప్పు డానందరసవిహ్వ • లాంగి యగుచుఁ
దనయుని గ్రహించి బాష్పసం • తానసేత్ర
యగుచు నాలింగనముఁ జేసి • యతిముదాత్మ
నలరి తన్ను నొరు నెఱుంగ • దయ్యె నంత. 98

వ. మఱియు నాఋషభశివయోగీంద్రుఁ డారాజపత్నీతత్పుత్రుల విషవ్రణావృతంబులైన శరీరంబులఁ దద్విభూతిని స్పృశించిన నయ్యిద్దఱు దివ్యతనువుల ధరించి బహుపుణ్యకర్మంబుల యే దేవతైశ్వర్యసుఖంబుగల దో దానికంటె శతగుణంబు గల సుఖంబు నొంద యమ్మహాత్ముని పాదపద్మంబులపై వ్రాలిన నతం డెత్తి యోరాజపత్నీ నీవు బహుసంవత్సరంబులు జీవింపుచుఁ దాపంబు నొందక జయంబుఁ జెందఁ గలవు నీకుమారుఁడు భద్రాయు వను నామంబు ధరించి నిజరాజ్యంబుఁ బాలింపుచు ఖ్యాతి నొందఁ గలఁ డిన్వైశ్యగృహంబున సకలవిద్యలు గ్రహించి యౌవనాభిరాముం డగు పర్యంతంబు నిల్వం దగు నని యాయోగీంద్రుం డరిగె నని సూతుం డిట్లనియె. 99

క. ఏ పూర్వంబునఁ జెప్పిన, యాపింగళ కృష్ణపింగ • ళాఖ్యశివార్చా
ద్దీపిత యై తొలిఁ దనుని, ర్వాపణ మొందం గఁ బుణ్య • పరత దలిర్పన్.

సీ. చంద్రాంగదుం డను • జనవల్లభుని భార్య
యైన సీమంతిని • యనెడు సాధ్వి
కుదయించి ప్రతిదినా • భ్యుదయరూపౌదార్య
సుగుణగణోపేత • సురుచిరాంగి
యై కీర్తిమాలిని • యను నామమున భూమి
వృద్ధిఁ బొందెను గుణ • వృద్ధు లెన్న

భద్రాయువును నైశ్య • పతితనుజుండును
నంబుజాప్తుని పగిది • బింబసులన
సొంపు జనియింపఁ గా నైశ్య • సూనుఁ డెలమి
సునయుఁ డనుపేరఁ దగి రాజ • సుతునితోడఁ
జెలిమి వాటించి రత్నభూ • షలు ధరించి
క్రీడ సల్పుచు నుండెను • వేడుకలను. 101

క. ఆనైశ్యాగ్రణి తగు భూ, దేవగ్రామణులచే ను • దీర్ణప్రతిభా
భావిభవరాట్సుతునకు య, థావిధి సంస్కారములను • దగ నొనరించెన్.

క. ధనధాన్యాంబరమణిగణ, ఘనుఁడై తగు నైశ్యవిభుఁడు • కడు వేడుక రా
ట్తనయుని నిజపుత్త్రాగ్రణి, మును గురుశుశ్రూషలం బ్ర • ముఖ్యులఁ జేసెన్.

వ. మఱియు సర్వజ్ఞులైన దేశికులవలన నక్షరలక్షణ గణిత గాంధర్వాలంకారేతిహాస న్యాయ మీమాంసా నీతిశాస్త్రపురాణాగమ జ్యోతిశ్శాస్త్ర స్త్రీలక్షణ పురుషలక్షణ కన్యావాద విషవాద రసవాద మాయావాద క్షత్రకర్మాశ్వ వైద్యగజవైద్యేంద్రజాల మహేంద్రజాల గజకర్ణ గోకర్ణ తృణావధాన శస్త్రావధాన మంత్రావధాన భ్రమణ మోహనోచ్చాటనోద్వేషణాకర్షణాంజనా దృశ్యకరణి భృగుమత బేతాళమత కావ్యలక్షణ వాస్తుశాస్త్ర ధనుర్విద్యా రథారోహణ శిబికారోహణ యోగశాస్త్ర భరతశాస్త్ర మోహన స్తంభన పయస్తంభన ఖడ్గస్తంభనసిద్ధ మంత్రసిద్ధ ఖేచరగమన పరకాయప్రవేశంబు లను విద్యల నెఱింగించి యసి ముసల కంపణ కణయ భల్ల భిండివాల కోదండ శర చక్ర కుంత కుఠార పరశు పరిఘ గదా ప్రాస తోమర ముద్గర లాంగల త్రిశూల చ్ఛురి కాంకుశాద్యాయుధవిశేషంబుల ప్రయోగంబు లభ్యసింపం జేసి యున్నంత. 104

సీ. తలముళ్లు మెడనూళ్లు • దండక పిండముల్
బిగువాళ్లురుల త్రాళ్లు • బిరుసుదనము
గండపెండేరముల్ • కటిసంపు గొలుసులఁ
దగిలిన శునకముల్ • జిగురుగండె
లడకెడు తడకలు • నడ్డంపు పందిపా
టులు వలలు నుసురి • యలును వంక

కత్తులు శూలముల్ ♦ ఖడ్గముల్ పట్టెస
ములు కుంతములు భల్ల ♦ ములు జెలంగ
కరకు మీసలు కండెన ♦ సరకు సేయు
గాత్రములు శోణనేత్రముల్ ♦ కప్పవలువ
కాసెలు ను గండ్రగొడ్డండ్లు ♦ గలిగి చెంచు
వాండ్రు జనుదెంచి రయ్యెడఁ ♦ దీండ్రము గను. 105

సీ. వరరక్తసితవర్ణ ♦ వంశోద్భవంబులఁ
బీతవర్ణేక్షుసం ♦ జాతములను
గురుకర్బురద్యోత ♦ కుంభికుంభజముల
నీలవర్ణాహిస్ఫ ♦ టాలయముల
జ్యోతీరుగంబుము ♦ ద్గాతసంభవముల
ఘనశితిశుక్తిప్ర ♦ కాండజముల
నమలవరాహదం ♦ ష్ట్రాంతరోద్భవముల
మానితబహువిధ ♦ మౌక్తికములఁ
గరములనుబూనిముందు ప ♦ గ్రాహ్యములు గఁ
జెంచువాండ్రు ముదం బెద ♦ మించు చుండ
రాట్సుతాలోకలాలసో ♦ ల్లాస మలర
నేగుదెంచి తదాజ్ఞ చే ♦ నెదుట నిలచి. 106

క. నతికిజోహా రొనరించిరి, పతికిన్ వితరణగుణునకు ♦ భాస్వన్మతిగీ
ష్పతికిన్ ఘనతేజోహ, ర్పతికిన్ సతతాభియాతి ♦ రాజవినతికిన్. 107

వ. ఇట్లు మ్రొక్కి నిలచి. 108

క. జే జే జే జే సామీ, యాజేజేరేని వలె నా ♦ యారంబలరం
గా జగములఁ బాలింపుము, మాజీవము లీవ సుమ్ము ♦ మానవనాథా. 109

వ. అని వచించిన. 110

గీ. వారిఁ గన్గొని మన్నించి ♦ మీరిచటికి
నేమి కోరికి వచ్చితి ♦ రిచట నుండు
వారు మీపేరు పెంపునే ♦ ర్పాటు గా వ
చించుఁ డనఁ బల్కి నం దొకఁ ♦ డెంచు కేఁడు. 111

సీ. చలువగుబ్బలిని ని • ఁచ్చట వసింపుచు నుండి
తరిగొండమీఁద ని • త్తఱి వసించి
చుట్టుగొండ మెకాలఁ • జుట్టుకొంచు మెలంగి
జాళువాతిప్పపైఁ • జాలువారి
వెండిమెట్టను గిట్టి • వెండియు విహరించి
సిరిగందపుంగట్టు • సిరి వరించి.
ప్రొద్దుపొడ్పుమల నే • ప్రొద్దు సంబరమంది
క్రుంకురాపైనీటఁ • గ్రుంకు చలమి
యింపు గల సొంపు టడవి ని • ద్దంపునడక
లడర నాడాడఁ దిరుగుచు • నవనినాథ
నిన్నుఁ బొడఁగని పెనుమెకా • లున్నచోటు
తెలియ వచియింప వచ్చితి • వలపుమీర. 112

గీ. అయ్య వైవస్వతకులంబు • నందుఁ బుట్టి
శ్యామశబలంబు లగుచు ను • ద్దామబలము
గలుగు శునకంబు లీగండు • తులకు రాక
దక్కినపుడిక్కున వసించె • నుక్కుదక్కి. 113

గీ. దేవరా క్షేత్రపాలక • దేవుఁ డెక్కు
భషక మీవేపిఁ గన్గొని • పారిపోయి
యెచట నుండెనొ కాని మా • కెఱుక లేదు
తెలియఁ జెప్పెద వీని స • త్తులను జగతి. 114

క. బూసులరాయఁడు తొలి మా, వేసాల ధరించి నాల్గు • వేపులఁ గా గం
జేసెఁ ద్వాలివలుకులను మా, వాసి గల్గు వీనితోడ • వడిఁ బోరంగన్. 115

గీ. సామికోలనిచుట్టు • చక్కని యడవిలోఁ
జెంచు వేస మూని • సిరిమగండు
దిరిగె దానిచుట్టుఁ • దెగవేపిలేమచే
మెకము లలరు చుండ • మేకొనుండు. 116

క. ఈమృగదంశక్షముల నా, నామృగముల నడఁవఁ జూచి • నలినశరహరున్
సోముని సమాశ్రయింపుచు, నామృగములు బ్రతిక్షియుండె • నఁటతలపోయఁగా.

క. అని పలుక నాకర్ణశేఖరుం, డనుమోదముతోడ దేవ ◆ రా చూచితె యీ
వనమృగగండరబిరుదాం, కనమునఁ దగుకుర్కురమును ◆ గౌతుకములరన్.

గీ. దేవ యీభైరవుఁడు మించి ◆ సాహసమున
బొమ్మదేవర మొఱఁగుల ◆ పుట్టెఁ బట్టె
దేవతలు గీవతలు గడ ◆ తేర లేరు
మానవులు గీనవులు నెంత ◆ మానవేశ. 119

సీ. ఈమృగదంశకం ◆ బేచిన గండభే
రుండంబు నైనను ◆ బెండుపరచు
నీసారమేయం బ ◆ నేకంబు లైనట్టి
బొల్లినోటిమెకాలఁ ◆ బొలియఁ జేసె
నీకుర్కురంబు వ ◆ న్యేభంబులను గిట్టి
కుంభస్థలాగ్రంబుఁ ◆ గ్రోలి వచ్చె
నీభషకంబు న ◆ ర్యేణవ్రజంబును
దునకలు గాఁ జేసి ◆ తొంగలించె
నిది యుఁ గాత్రేపుఁడనుపేరఁ ◆ బొదలుచుండు
నిది యు బోలమరా జన ◆ ముదము నొందు
నిది యు నాపోతలింగఁడన్ ◆ పదవి నొందు
నిది యు మనుబోతులకు మిత్తి ◆ యులఁదలంప. 120

క. అరవదిమోముల వేలుపు, టూరపుజిరాదారి పైన ◆ యొడయఁడ వగు నీ
సరి యే రిఁక మాచెంచుల, పరి నైతము గాఁ గ రమ్ము ◆ పార్థివముఖ్యా.

సీ. తడకవేఁటకు బంటు ◆ తగిన యీపాపఁడు
నురులకు దిట్టయీ ◆ చిఱుతవాఁడు
బోనులు చేఁ బట్టి ◆ పొదలు నీబుడుతఁడు
వల వేయ నేర్పరీ ◆ కెలనిపట్టి
పందివాటులకుఁ దెం ◆ పరి యయ్యొనీకందు
చిల్లమ్ముబలితుఁ డీ ◆ చెడుగు కూన
బొట్టికోలల మెకం ◆ బులఁ గొట్టు నీబొట్టె
జంజాళి దాల్పు నీ ◆ జంటకుఱ్ఱ

మొదల కుండఁగఁ దెరనోటి ♦ మెకము నైన
బట్టి వల్లార్చు నీచిన్న ♦ వాఁడు సామి
మాకొలంబునఁ బుట్టిన ♦ మగతనంబు
గల్గువారెల్ల మును వేఁట ♦ కాండ్రుదలఁప. 122

క. అని పలికిన వినయోక్తుల, మనమున హర్షించి వారి ♦ మన్నించి ప్రతా
పనిరూఢి వేఁటతమకము, జనియించినరాట్సుతుండు ♦ చయ్యన లేవన్. 123

క. గరికిజిగినీ దగిన రా
నరువున ధరియించితత్తు ♦ నౌచిత్యగతి
స్ఫురణంబున సొంగుకయి
న్మెరయఁగ సొంగు మని శబగ ♦ నికరముబొగడన్. 124

ఉ. చూపరు లుల్లసిల్లఁ గను ♦ జూడ్కికి వేడ్కదలంకఁ బొంకజో
ద్దీపితనామపాదము ధృ ♦ తిం దపనీయపు టంకవన్నెపై
స్థాపనఁ జేసి సవ్యకర ♦ సంస్థితి నాయము లుల్లసిల్లఁ గా
జా పరమేశ్వరా యనుచుఁ ♦ జంగున నెక్కెఁ దురంగపుంగవున్. 125

క. వినయజ్ఞుఁ డైన సునయుఁడు, దనకు సహాయత వహించి ♦ ఘోరాశ్వమునం
దనరి చనుదేర ఖాద్యా; దినివహ మలరంగ దివ్య ♦ తేజుం డగుచున్.

వ. ఇటుల శ్యేనంపాతసముత్సవంబున కోహటించి చటుల భాసుర చంద్రహా
స ప్రాస శరాసన భిండివాల కరవాల తోమర పరశు పట్టిస కుంత శూల
ముద్గర కోదండ గదాదిసాధనంబు లడరఁ దద్బలసహితుం డై గిరి సరి దు
పవన జనపద దుర్గంబుల నిర్గమింపుచుఁ దత్పుళిందసైన్యకలకలనినాదాకర్ణ
నేతస్తతశకుంజపుంజలంఘనజాంఘికమృగంబుల నరయుచుం జని ముందట.

సీ. ఉడుపథోత్కర్షణశా ♦ ఖోపశాఖాశిఖో
త్కటజటాపటలవ ♦ త్కుటసమూహ
ముభయతీరప్రపా ♦ తోల్లలత్కల్లోల
గుంభశుంభత్సరో ♦ జృంభణంబు
నన్యోన్యజన్యకృ ♦ ద్ధర్యక్షవీక్షణ
క్షరదద్భుతతరక్షు ♦ సంచయంబు

నమితశుండాదండ ♦ హాతదండసంతాన
ధావదుద్దండవే ♦ దండనికర
మమితసంప్రోఢకుటజకు ♦ సుమసముదయ
మత్యుదారతరుజమనో ♦ హరఫలంబు
లమరవర్యులకు ను జోర ♦ నలవి గాని
గహన మయ్యెడఁ జూడఁగని ♦ మహివిభుండు. 128

సీ. హారాయితోభయ ♦ ద్వారశిలాసమా
సక్తముక్తాలోక ♦ సమదసింహ
మతివేలమదపూరి ♦ తాశేషనిర్ఝర
బింబితాత్మోరుకుం ♦ భిప్రకాండ
మనుగళద్ఘోరదం ♦ ష్ట్రానిలసఖముఖ
దారితముస్తాత ♦ టోరుకోల
మగణితనగభేద ♦ నాభంగతరశృంగ
సంఘటితాటవీ ♦ సైరిభచయ
మనుపమాస్త్రాభనఖరపం ♦ చనఖఖడ్గ
గంధగంధర్వశంబర ♦ బంధురతల
మగుచు నగభేది వానను ♦ దెగడి నిగుడు
విపినమార్గముఁ గన్గొని ♦ నృపవరుండు. 129

లయగ్రాహి.

నింగి దవులం జిగురు ♦ లం గదురు మానుల వ ♦ యిం గదియు భృంగ
ము లభంగరుతులన్ నా రంగముల ముంగల మె ♦ లంగెడు లవం
గముల ♦ చెంగటఁ దోరంగు నన ♦ లం గొమరుమై గొ జ్జంగులఁ
జెలంగెడు వి ♦ హంగముల భంగులఁగ ♦ నుంగొనుచు నానృపతి
పుంగవుఁడు రాఁజి వ్యాంగులు కురంగులు కు ♦ రంగములు
సింగములు ♦ చంగుననలుంగడల ♦ కుం గదలి పోవన్. 130

వ. మఱియు నాగరాజస్థితి యనం దగి యనంతమూలాధార రై కల్పవేళ య
నం దగి యేకకాలోదితానేకార్క విరాజిత రై సుధర్మయనం దగి స్వ
చ్ఛందకౌశిక రై సత్పురుషసేవ యనం దగి శ్రీఫలాఢ్యరై భారతసమర

భూమి యనం దగి ప్రరూఢార్జున యై సజ్జనసంపద యనం దగి వికసితాశో
కపున్నాగసరళ యై శిశుజనలీల యనం దగి ధాత్రీకలాప యై సుగ్రీవసేన
యనం దగి పనసనలకుముదభాసుర యై క్షీరసముద్రమథనవేళ యనఁ దగి
విజృంభమాణామృత యై లంకాపురి యనం దగి బహుపలాశసేవిత యై
రాఘవచిత్తవృత్తి యనం దగి వైదేహీప్రమోద యై సువాసిని యనం దగి
సింధూరతిలకప్రసవాళాభరణభూషిత యై కురువాహిని యనం దగి ధార్తరా
ష్ట్రోలూకశకునిసనాథ యై భీమకలహభూమి యనం దగి కీచకనికరోపశోభి
త యై న వింధ్యాటవిం గనుంగొని నల నలద నలినీ నిచుల విపుల బిల్వ
చిరిబిల్వ బహుళంబు ను ప్రచురపిచ్ఛిలరంభాభిరామంబు ను వివిధోటజకు
టజరుద్ధోపకంఠంబును వితతచూతప్రతతిప్రావృతావరణతరుణ స్కంధసన్న
ద్ధభృంగగేయంబు ను గోలాంగూలభగ్నగళన్మధుపటలమధురసాసారసిక్త
తరుతలంబు ను నారికేళ తాళసాల హింతాల తమాల లవలీ వకుల పూగ
పున్నాగ నాగకేసర ఘనసార గంధసార మల్లికా కేతకీ కోవిదార ఖర్జూ
ర మందార బీజపూర జంబీర కుంద బృందంబును దాత్యూహవ్యూహకుహూ
కుహూరావభరితనదీతటనికటకుంజంబు ను బుంజితోత్కంఠకలకంఠాధ్యాసి
తసహకారపల్లవంబు ను పరాగపుంజపింజరసిందువారమంజరీరజ్యమాన
మధుకరమంజుసింజితజనితముదంబు ను జంపక లోధ్ర కర్ణికార కదంబ
కదంబంబు ను జటకసంచారచటులవాచాటచాటూకైరక్రియమాణచాటుస
మాచరితచంచుచరణచతురచకోరంబు ను గిరాతమాణవకనిర్దిష్టదుష్టబలాకా
కుటుంబినీనిరీక్ష్యమాణస్థవిరశబరకుంజాంతరంబు ను శైలేయవాసితసుగంధి
శిలాతలసుఖశయితశశకంబు ను సవిధగిరినితంబనిర్ఘరనినదశ్రవణనిద్రాణ
కరికులంబు ను దదాసన్నకిన్నరీగీతాకర్ణనరమమాణరురునికరంబు ను గులి
శశిఖరనఖరప్రకరప్రచండపరిపాటితమత్తమాతంగమదచ్ఛటాచ్ఛురిత చారు
కేసరభరభాసురకేసరివిసరంబు న గు తత్పదంబుఁ బ్రవేశించి మహాభుజం
గంబు చందంబున సదాగత్యభిముఖం బై సరిత్పతి యనం దగి శుక్తిశోభి
తం బైన వింధ్యవనంబన జలని[illegible]వృక్షలాంఛితం బై హంస యనం దగి
మానసగమనం బై హరిత్తురంగం బనఁ దగి చిత్రభానూర్జితం బై తనరుతన
తురంగమంబు నాస్కందిత ధారిత కరేచిత వల్గిత ప్లుతాదిగతుల నడ
పించుచు. 131

సీ. తావల రాయుడికాని ♦ తొలిసోఁకు సోఁకని
చివురు టాకుల వింత ♦ చెలువుఁ జూపఁ
దెలి వాక జోకల ♦ లలి డాలు వీఁకల
నలరారు నిసుకద ♦ న్నెలు మెలంగ
నొకటి పై నొకటి యం ♦ టుక యున్న సన్నంపు
కొమ్మల దొమ్ములు ♦ నెమ్మిఁ జూప
నప్పటప్పటికిఁ గ్లి ♦ దెప్పరంబు గ వచ్చు
కప్పురంబుల పొడు ♦ లొప్పుఁ జూప
సుమసమూహంబులను ఝుమ్ము ♦ ఝుమ్మనుచును
జమిలిముక్కాలిచాలుపుల్ ♦ సందడింపఁ
బొదలఁబొదలుచు నిద్దుర ♦ నొదిగి యున్న
మిన్న మెకములఁ గనితదా ♦ సన్నుఁ డగుచు. 132

సీ. సింజినీరవముచేఁ ♦ జెవులు జిందర దేరఁ
గొందలం బందెడు ♦ కోలములు ను
దురగఖురోత్పన్న ♦ ధూళి కన్నులఁ గప్పఁ
దల్లడింపుచు నుండు ♦ భల్లుకములు
తరవారిదీప్తులు ♦ మిరుమిట్లు గొలుపంగ
గజిబిజి నొందెడు ♦ గజచయంబు
శరపాతనధ్వనుల్ ♦ తరుచు గాఁ దోచినఁ
బరపర లై పోవు ♦ హరిణములు ను
జవ్వుదవ్వున వడి నార ♦ సములు రాఁగ
దవ్వుదవ్వునఁ జను మృగా ♦ దనగణంబు
కర్తరీముఖసుశిలీము ♦ ఖములు గడఁగ
నార్తి నొందు నవార్య హ ♦ ర్యక్షములును. 133

చ. కలఁకులఁ జేరి చేరి శర ♦ కీలితగాత్రతఁ బారి పారి ప
ల్వలములఁ దూరితూరి బల ♦ వత్తనుసైఖరిఁ గేరి కేరి పె
న్మలకల మీరి మీరి చల ♦ నంబొగి లేకను దేరి తేరి బె
బ్బులులు నృపాలు వారిఁబడి ♦ పోవక చావక యున్కి చిత్రమే. 134

ఉ. సందులఁ బొంచి డెక్కతుది ♦ చప్పుడులం బరికించి పూబొదల్
ముందరఁ గాంచి తత్కుహార ♦ ముద్రితమూలముల న్గలంచి శ్రీ
చందనముల్ హరించి ముస ♦ సత్త్వము లేమిఁ దలంచి యొక్కఁడా
పందులు మించి పోక వని ♦ పైఁ బడుటల్ వివరింప శక్యమే. 135

మ. ప్రదరోత్పాటితకుంభసంభవమణి ♦ ప్రచ్ఛాదితాస్యంబులై
మదమాతంగము లొక్కపెట్టున మహా ♦ మందారబృందోల్లస
త్సదనాంతఃపతితోగ్రసత్త్వముల ని♦ స్సారత్వ మొందంపుచున్
బొదలం గన్గొని భూభుజుం డడరి సం♦ పూర్ణప్రతాపంబునన్. 136

సీ. కరవాలమునఁ దుండ ♦ చరణముల్ నరికినఁ
గుంభినీస్థలిఁ బడు ♦ కుంభిచయము
మండలాగ్రంబుల ♦ గుండియ లవియింప
ధారుణి నొరఁగు కం ♦ ఠీరవములు
నారాచముల మెడల్ ♦ నరికిన భూమిపైఁ
బొరలాడుచుండెడు ♦ హరిణములును
గ్రూరమార్గణములఁ ♦ దూరుపెట్టినఁ దన్ను
కొని నేలపైఁ బడు ♦ కోలములును
సాయకంబులఁ బడు చిత్ర ♦ కాయకములు
కాండములఁ దెగు గండభే ♦ రుండములు ను
గలిగి యీకీతి రక్తసి ♦ క్తంబు లైన
భూతలంబులు గావించి ♦ భూభుజుండు. 137

గీ. వేఁట చాలించి యవ్వన ♦ వాటిలోన
నొక్క యెలమావిగుంపులోఁ ♦ బక్కిఁ జేని
మానికంబుల తిన్నెపై ♦ సూనశయ్య
యలరి యుండుట నీక్షించి ♦ నెలవుఁ జేసి. 138

వ. ఇట్లు పోటుమానుసుల గు వేఁటకాండ్ర నియమింప వారలు కుక్కమిగిలి ముగఁటిమి సెగపొగ తెగయ జెగడని మృగంబులఁ దగిలి మిగుల వగల నొగిలించి పోరియలు మరువులుగ నొరఁగుమెకముల మెరుఁగుల వరలు శరముల నరికినఁ దిరుగుడు వడు కరుల కరభరంబులం బాపి తొలఁగక మె

లఁగు బలుపులుల పులులు గరపించి చంగుచంగున నింగిచెంగటి కెగసి మగిడి యంగముల రంగు లెసంగ నుప్పొంగు సింగముల భంగంబు నొందించి మూటిమాటికి వనవాటి దాటఁ గల పాటి గలిగి నేటగు లేఁటిదాటుల సోటుపోటుల నాటించి యల్లకడలఁ గొల్లలగు బొల్లినోటిమెకంబులఁ జిల్లల నడంచి మించువారు ను గొలుసులు డిపి విశ్వకద్రువుల నుసికొల్పి బలు మృగంబుల నడఁగించువారు ను వల లొడ్డి బలుపులుఁగులఁ బట్టెడువారు ను దడక లడరించి వాగురలఁ బ్రసరింపం జేసి కృష్ణసారంబుల విదళింపం జేయువారు నై యుండి రాజయోగ్యంబు లగు కొన్ని మృగంబులఁ బతంగంబుల నాభద్రాయువు మ్రోల నిడి జోహా రొనరించి సంతసించి వైశ్యుం డగు సునయుండు నుం దాను ను దద్బలంబులతో మరలి వచ్చి నిజపదసమీపంబున నాలుబ్ధకబలంబున కాజ్ఞనొసఁగి తన్నగరంబు ప్రవేశించి జననికి నమస్కరించి వైశ్యాగ్రణికి సమ్మదం బలరించి యున్నంత.

సీ. హంసరూపుండ నే • నని వచించిన రీతి
భసితలిప్తాంగంబు • బరగుచుండ
లలితాంతరస్థకుం • డలి బహిర్గత మైన
విధమున యజ్ఞోప • వీత మలర
మస్తకస్థితచంద్ర • మధ్యస్థవటమూల
ములు మించె నన శ్మశ్రు • వులు వెలుంగ
ఫాలంపు టజుని వ్రా • ల్ప్రకటంబు లగు నన్న
వృత్తి నొసలి భూతి • రేఖ లలర
నల పరాదులచే జగం • బుల వసించు
వర్ణరూపిణి నావశం • వద యటంచుఁ
దెలుపు గతి నక్షమాలిక • చెలఁగుచుండ
ఋషభయోగింద్రుఁ డేతెంచెఁ • బ్రియ మెలర్ప. 140

వ. అతండు. 141

సీ. పరశివధ్యానసం • భవపరామృతపాన
మత్తాత్మ నన్యంబు • మరచువాఁడు

నాదానుసంధాన • మోదాత్ముఁ డై లోక
నినదంబుల వినంగఁ • జనని వాఁడు
సతతపంచాక్షరీ • జపచలద్రసనుఁ డై
పరగోష్ఠి సల్పంగఁ • జొరనివాఁడు
ప్రత్యగాత్మస్వరూ • పస్వానుభూతి యై
యితర మెఱుంగక • యేగువాఁడు
సగుణనిర్గుణరూపుఁ డై • స్వప్రభావి
భవము నొందిన యల్లమా • ప్రభువనంగ
బహుళజన్మాంతరతపఃప్ర • భావ మొందు
సనయు భద్రాయు దర్శింప • సరభసమున. 142

క. ఆరాజపత్ని సుగుణవి, హారిం డగు రాట్సుతుండు • నా ఋషభాఖ్యో
దారశివయోగిఁ గని స, త్కారం బొనరంగ • భక్తి గడలుకొనంగన్.

గీ. మాటిమాటికిఁ దగు ప్రణా • మము లొనర్చి
యర్ఘ్యపాద్యాదివిధులచే • నలరఁ జేయ
హృష్టమానసుఁ డై యతం • డిష్టుఁ డైన
రాట్సుతున కట్టులను నను • రాగ మొదవ. 144

క. ఓతండ్రి నీకుఁ గుశల మె, నీతల్లికి లెస్స యగు నె • నీవు సమస్త
ఖ్యాతశ్రుతసంచయములఁ, జాతుర్య మెసంగ నెట్లు • చదివితొ చెపుమా.

క. గురువులకు సపర్యాత, త్పరత వహించితి వె నీకుఁ • బ్రాణసఖుఁడ నై
ధర నెలయు నన్నుఁ దలఁతే, సరవిగఁ బలుకన్ మననతని • జననికడంకన్.

మ. అతివేగంబున డాసి ప్రేమమున సా • ష్టాంగ ప్రణామంబు లూ
ర్జితభక్తిం దగ సల్పి తచ్చరణరా • జీవంబులం బుత్త్రి నా
నతునిం గా నొనరించి సమ్ముఖము గా • నమ్రాననత్వాదసం
యుత యై తేనెలు జిలుకు పలుకులను న • య్యోగీంద్రుతో నిట్లనున్. 147

గీ. ఇతఁడు గురుఁడ వయిన నీకు • సుతుఁడ నగు ని
తనికిఁ బ్రాణం బొసగిన • తండ్రి వీవు
గాన నీతని శిష్యునిఁ • గా భరింపు
సరసకరుణామయాత్మ యో • గురువరేణ్య. 148

క. జ్ఞాతిజనబంధువర్జితుఁ, డీతఁడు వీతనయుఁ డగుట ♦ నితనికి సమ్య
జ్జ్ఞాతిప్రదసన్మార్గము నాతతమతిఁ దెల్పు మీరె ♦ యహూనలరు దయన్. 149
క. అని యివ్విధమున నాగా, వనితామణి విన్నవింప ♦ వాత్సల్యమునన్
ముని పారాజసుతున క, ర్థిని సద్ధర్మంపుతెరఁగుఁ ♦ దెల్పం దొడఁగెన్.
గీ. శ్రుతులయందు ను స్మృతులందు ♦ హితపురాణ
తతులయందు సనాతన ♦ ధర్మమెలమిఁ
బరగ వర్ణాశ్రమాను రూ ♦ పమున సర్వ
థా జనంబులు సేవింపఁ ♦ దగుఁ దలంప. 151
క. చాలఁ గఁ దత్సన్మార్గము, వాలాయంబు గను మాణ ♦ వక భజియింపన్
మేల గుఁ గావున నీ విపు, డీలీలఁ జరించె దేని ♦ హిత మగుఁ దెలుపన్.
మ. తెలియన్ నీవు కవిలంఘ్యమై తనరు మ ♦ ద్దివ్యాజ్ఞనీ వెప్పుడా
విలమార్గంబున దేవహేళనముఁ గా ♦ వింపం దలంచేవు స
త్ఫలదాత్మస్థితి నొందు దేవగురువి ♦ ప్రశ్రేణులం దెల్ల ని
శ్చలభక్తిం జరియింపు సంతతము ముక్ ♦ సత్త్వప్రధానుండవై. 153
మ. ఎపుడున్ దుర్లభవస్తుజాతములయం ♦ దిచ్ఛన్ విచారించ కా
శ్యపదుం డై తగు నేని మున్నతిథి యై ♦ సంప్రాప్తుఁ డైనం బ్రలా
పపరిగ్రాహత నొందఁ బోవక నుసం ♦ భావించి యన్నంబు స
త్కృపతోఁ బెట్టినఁ బుణ్యముల్లసిలు నీ ♦ పృథ్విస్థలిం బుత్త్రికా. 154
సీ. ప్రాణసంకటము సం ♦ ప్రాప్త మై యుండిన
సత్త్వంబు విడనాడఁ ♦ జనదు తలఁప
రమణ గోబ్రాహ్మణ ♦ రక్షణార్థంబు గాఁ
బుడమిలో నొకవేళ ♦ బొంక వచ్చు
పరభామలందు ను ♦ బరవిత్తములయందు
భువి దేవవిప్రవ ♦ స్తువులయందుఁ
దృష్టిను విడువుము ♦ తత్ప్రాప్తబహుబలాఢ్య
దంభంబు సర్వదా ♦ తలఁప వలదు
సత్కథలయందు సద్వ్రతా ♦ చారవిధుల
సత్పథములందు ధర్మాది ♦ సంగ్రహముల

నిత్యము ను దృష్టి నుంచుము • నిరుపమాన
హృదయ శుచియింతుఁ గొన్నింటి • నదయమతిని. 155

సీ. స్వాధ్యాయమున స్నాన • జపహోమపితృతర్ప
ణాతిథిగోబ్రాహ్మ • ణార్చలందు
సలసత్వము వహింప • నర్హమార్గము గాదు
ముందుఁ గ్రోధము ద్వేష • మును భయంబు
న లజాడ్యపైశున్య • మనదాగ్రహంబు కౌ
టిల్యంబు మోహంబు • శీవితోడ
నుద్వేగమును వీడు • టొప్పు క్షత్త్రియధర్మ
మెనసియు వృద్ధుల • హింస వలదు
శుష్కవైరంబు గూడదు • సొం పనుచు మృ
షానులాపంబు పరనింద • బూనఁ దగదు
గాన నీ విఁక బహుధర్మ • గతులు గల్గు
పథమును మనంబులోఁ దలఁ • పంగ వలయు. 156

క. సఖులందు మైత్రి యుంచు ము
సుఖులందు దయానువృత్తిఁ • జూపఁ గఁ దగు నో
సఖ పుణ్యవంతులందు ను
నఖిలము మెచ్చంగ మోద • ములరించఁ దగున్. 157

క. వాసిఁ గుబుద్ధులయం దౌ
దాసీన్యము నుంచి తిరుగఁ • దలఁపుము సద్గ్రం
థాసక్తి గల్గి గురుసే
వాసక్తుం డయ్యె నేని • హర్షము దలఁపున్. 158

క. అత్యాహార మతిశ్రమ, మత్యాలాపంబు మఱి యు • నతికోపం బౌ
ద్ధత్యం బతివీర్యము భువి, నిత్య మతిక్రీడ సలుప • నీకుఁ దగదోగిన్. 159

క. అతివిద్య యతిశ్రద్ధయు, నతిపుణ్య మతిస్మృతి యును • నత్యుత్సాహం
బతిధైర్య మతిఖ్యాతిని, సతతము ధరియింప వలయు • సౌజన్యనిధీ. 160

సీ. మోహాక్షనిద్రాజవరా • రోహాసమఖిలపు
త్వాన్వంతంబుతో నుండి • జనుఁ దలంప

సత్యాహితప్రద ♦ ప్రత్యవస్థాత్మని
స్తర్హణం బొనరింపఁ ♦ దగుఁ దలంపఁ
గణ్యంబు లైనట్టి ♦ పుణ్యంబులందు కా
భ్యస్థితిఁ వర్తింప ♦ నగుఁ దలంప
సభ్యేతరాధర్మ ♦ కేభ్యసంఘమునందు
సాభ్యసూయుఁడ వౌట ♦ నర్హయుక్తి
చండమతిహిండితాత్మపా ♦ షండగణము
నందు సద్వేషుఁ డగుట పెం ♦ పొందుఁ దలఁప
సజ్జనులమీఁద ననురాగ ♦ సహితుఁ డగుట
యుక్త మగుచుండు వివరింప ♦ నుర్విలోన. 161

సీ. తెలివి మీరఁగఁ బ్రకృ ♦ తిప్రత్యయంబుల
ననురక్తి గుణవృద్ధు ♦ లరసి యరసి
ప్రబలపదాదేశ ♦ పదవిభక్తుల సంధి
విగ్రహముల చక్కి ♦ నెలసి నెలసి
పటుపరరూపని ♦ పాతంబు లరసి త
ద్ధితవాక్యముల మేలు ♦ దెలసి తెలసి
సురుచిరాగమముఖ ♦ సూత్రావ్యయార్థవ్ర
త్తుల సమ్మదంబున నలరియలరి
గురుసమంచదహీనవా ♦ గ్గుంభనముల
నలరు చలజాతినిగ్రహం ♦ బుల వితర్క
గతులు గల రాజనీతిప్ర ♦ కార మరయ
వలయు భూపాలతనయ యీ ♦ వసుధలోన. 162

క. కాపాలికలోకాయతి
కాపతకృత్సాగతద్వ ♦ యాతిగులందుఁ
దీపించి తత్పథము దూ
రాపాతన మొందఁ జేయ ♦ నగుఁ దలపోయన్. 163

క. నిర్మర్యాదాభిజ్ఞులు
దుర్మంత్రులు బోధఁజేయు ♦ దుర్బోధము చే

ధర్మంబు దప్పఁ గూడదు
ధార్మికమార్గానువర్తి ♦ తతసత్కీర్తీ. 164

క. వర్ణవ్యావృత్తస్థితిఁ, గర్ణేజపనిర్ణయప్ర ♦ కారోక్తుల నా
కర్ణించు నెడల బధిరో, దీర్ణత్వము నొంద వలయు ♦ దీననిధానా. 165

క. క్రూరశఠదంభధూర్తవి, హారకితవచపలపతిత ♦ నాస్తికజిహ్మ
త్వారూఢులఁ గన్నంత నె, దూరము గాఁ దొలఁగవలయు ♦ దూషితకలుషా.

సీ. సంతతాత్మప్రశం ♦ సారక్తుఁడవు గాక
విజితేంద్రియుఁడవు గా ♦ విశదమతిని
పుత్త్రమిత్త్రకుటుంబ ♦ ముల నొకప్పటికి న
త్యాసక్తుఁడవు గాక ♦ యలర వలయు
సాధ్వీత్వ మొందిన ♦ జాయ వాక్యములందుఁ
బితృభాషితములందుఁ ♦ బ్రీతి నలయ
సద్గురూక్తులయందు ♦ సర్వదా విశ్వాస
ముంచంగ వలయు నో ♦ యునుగుణాఢ్య.
యాత్మరక్షాపరత్వంబు ♦ న ప్రమత్త
త యు దృఢవ్రతసిద్ధి యుఁ ♦ దగఁ జరింపు
మాత్మజులమీఁద నైన నా ♦ కప్పు డైన
వలదు విశ్వాస ముంచంగ ♦ వర్ణనీయ. 167

గీ. అవని దొరకోలు నన్నాసి ♦ యైన విశ్వ
సించె నేని యు వాని హిం ♦ సింప రాదు
మాయ లేక చరించిన ♦ మనుజునందు
శంకఁ జేయంగ వలవ దో ♦ జనవరేణ్యా. 168

సీ. స్త్రీల బాలుర వృద్ధ ♦ కృపణాళ్యనాథుల
నపరాధరహితుల ♦ నవనిలోన
బుద్ధిబలప్రాణ ♦ ముల శక్తిబలమున
నరసి రక్షింపుము ♦ న్నతి ముదమున
సత్యంబువలనను ♦ జలియింపఁ గూడదు
హననయోగ్యుం డైన ♦ యతివరుండు

శరణాగతుండైనఁ • జంపంగ వలవదు
పాత్రుఁడైనను ముక్క • పాత్రుఁడైన
నీచుఁ డగు నేని మఱి మహా • నీయుఁ డేని
యెవ్వఁడైనను యాచించె • నేని వాని
కొఱకు శివ మైన నొసఁగుచు • గురుయశంబు
నొందు మతిధుత్వమున సదా • యుర్విలోన. 169

క. నరపతులకుఁ గోవిదులకు, ధరఁ గీర్తి యె భూషణంబు • తత్కీర్తి యె ప్ర
స్ఫురిత మగు లక్ష్మి తత్కీ, ర్తిరతిం బుణ్యంబు గల్గు • ధీరాచారా. 170

క. అవనీశతనయ సంతత, కవిసన్నుత చంద్రచంద్రి • కల కెటువలె నో
యవినాభావం బటువలె, నవనిజనము కీర్తిచేత నలరుచు నుండున్. 171

క. రాజాశ్వహేమనవమణి, రాజిని గుప్తక్రియలను • రక్షింపు మహో
రాజ యకీర్తిని పతితో, త్తేజిత సర్వంబు విడుము • తృణగణము బలెన్.

గీ. మాతృకోపంబు జనకున • మర్షము నగు
దుప్రతిఘు రైవ్యయంబు పు • త్త్రిలవలనను
బ్రాప్త మగు నపరాధంబు • బ్రాహ్మణాప
రాధము సహింప వలయు నో • రాత్తనూజ. 173

చ. ఎటు వలెనైన విప్రతతు • లెంత ప్రసన్నత నొందుచుందు రో
యటు వలె వారి కీప్సితప • దార్థ మొసంగఁ బోసంగ రాజు సం
కటపడుచున్న వారల నో • కానొక వేళఁ గడంగ యుద్ధరిం
చుట నిజ మై చెలంగుఁ బరి • శుద్ధగుణాదితబోధసంయుతా. 174

శా. ఆయుఃకీర్తిబలంబు సౌఖ్యధనపు • త్ర్యస్త్రీప్రజల్ పూర్వక
ర్మాయత్తంబులు గాన నేది జనితం • బై ప్రాప్త మౌ దాని ని
చ్ఛాయుక్తిన్ భజియింపు కాలము నుదే • శం బుఁ బ్రసక్తిన్ సదా
స్థాయత్కౌతుకకార్యముల్ జనము మె • చ్చం జేయు టే మేల గున్.

గీ. ఎవ్వనికి బాధఁ జేయ రా • దెంచి చూడఁ
బరుని బాధ నివారింపఁ • బడఁ దలంపు
శాత్రవులఁ జోరులను దుష్ట • సంచయముల
శక్తికొలఁదిని బాధింపు • జనవరేణ్యా. 176

గీ. వెలయఁ బితృకర్మజపహోమ ♦ ములను స్నాన
మొనరఁ జేయుతరిఁ జేగ ♦ యుడుగవలయు
భోజనముఁ జేయుచో నిద్రఁ ♦ బోవు నెడను
నత్వరస్థితి నొందంగఁ ♦ జనుఁ దలంప. 177

సీ. దాక్షిణ్యయుక్తమై ♦ తనరి యక్రూరమై
జనమనోహరము నై ♦ సత్యమగుచు
నల్పాక్షరం బనం ♦ తార్థమౌ వాక్యంబుఁ
బలుకఁ మెప్పుడు గురు ♦ భక్తిసహిత
ప్రతిపార్థివులయందు ♦ భయ మొందకుము గురు
శాసనద్విజపాప ♦ చయములందు
భయ మొందుమీ జ్ఞాతి ♦ బంధుమిత్రుల యెడ
జాయాత్మజులయందు ♦ సమతచేతఁ
సంచరింపుము వంజ్త్రిభో ♦ జనములందు
నటుల వర్తింపఁ దగు విద్వ ♦ దభిహితోక్తి
శాస్త్రగోష్ఠులఁ బుణ్యప్ర ♦ సంగములను
ధార్మికులపైఁ బరాఙ్ముఖ ♦ త్వంబు వలదు. 178

క. పరిశుద్ధపుణ్యమానస, సరణిఁ విఖ్యాతవిప్ర ♦ సభయందుఁ బరా
త్పరశివుని మందిరంబున, స్థిరతఁ వసియింప వలయు ♦ ధీరవిచారా 179

క. కాముకకులటాగణికా, స్త్రీముఖనీచార్తదుష్ట ♦ దేశమునను ము
న్నేమరిపాటున నైనను, వేమరు వసియింప రాదు ♦ విహితవివేకా. 180

గీ. త్రిభువనేశ్వరుఁ డగు మహా ♦ దేవు భక్తి
నేదినంబున భజియింతు ♦ వాదినమున
సకలదేవతలను మది ♦ సంస్మరించి
పూజఁ జేయంగ వలయు నో ♦ భూపతనయ

క. నిరతము శుచి నై చిద్వి, స్తరబుద్ధిని నిర్జితారి ♦ షడ్వర్గుఁడ నై
స్థిరశాంతదక్షతలు మదిఁ, బొరయఁగ నేకాంతవాస ♦ మునఁ దగుము నృపా.

సీ. మును త్రయీధర్మాభి ♦ ముఖ్యాన్యవిప్రుల
శాంతులై నియమిత ♦ స్వాంతులైన

యతులఁ బుణ్యాత్ముల • నతివృద్ధులను బుణ్య
నదుల నదంబులఁ • బొదలు చున్న
పుణ్యతీర్థంబులఁ • బుణ్యసరస్సుల
వితతమణీరత్న • వృషభములను
సత్యపతివ్రతా • సముదాయముల నాత్మ
గృహదైవములఁ గూర్చి • కేవలంపు
భక్తిచేఁ బ్రణమిల్లుచు • బ్రాహ్మసమయ
ములను మేల్కని స్వచ్ఛాంబు • వులను గ్రుంకి
యాచమన మొనరింపుచు • నాత్మగురుని
కలర వందన మొనరింప • నగుఁ దలంప. 183

వ. ఇవ్విధంబునం బ్రవర్తింపుచు శ్రీమదుమామహేశ్వరు ధ్యానంబు సేయు మని యమ్మహాత్ముని ప్రభావంబు ముందర శ్రీకవచపూర్వంబు గా వివరించెద నిపుడు సగుణనిర్గుణప్రకారంబునఁ దన్మాహాత్మ్యంబు వివరించెద నాకర్ణింపు మని మఱియు నిట్లనియె. 184

క. శ్రీసుఖదశుద్ధసత్వా, వాసము శివపార్వతీని • వాసము సుమహా
భాస మనాభాసము నై, లాసము దనరారుఁ జిద్వి • లాసం బగుచున్. 185

వ. అది యు నాదిమధ్యాంతరహితంబు ను సజాతీయవిజాతీయస్వగతభేదశూన్యంబు ను నిత్యాపరోక్షస్వప్రకాశాపహసితానంతకోటిసూర్యచంద్రానలాలోకంబు ను వేదశాస్త్రపురాణేతిహాసాగమాగమ్యంబు బహువిధధర్మధర్మగుణనామరూపవికారశక్తివిహీనంబు బ్రహ్మేంద్రాద్యమరాసురోరగగరుడగంధర్వకిన్నరసిద్ధసాధ్యవిద్యాధరచారణాప్సరోయక్షగుహ్యకదేవర్షిబ్రహ్మర్షీశ్వరమునీశ్వరాద్యుపాస్యంబు ను నిత్యనిర్గుణనిర్వికల్పనిరాకారనిరంజననిర్విషయాతీంద్రియావాఙ్మనసగోచరాప్రమేయశుద్ధబుద్ధముక్తకేవలాఖండసచ్చిదానందమయం బు నైన తురీయాతీతపరతత్వకైలాసంబున నవ్యక్తమహదహంకారాదిసప్తావరణవేష్టితం బు నుజతుర్దశలోకకంధరసుందరం బు నుసార్వభౌమాదిహిరణ్యగర్భానంతానందగండశైలభాసురంబు ను భానుసోమనక్షత్రగ్రహతారకాపావకసౌదామన్యాదివివిధరత్నశరకరిలం బు నుబ్రవిమలవైరాగ్యోపత్యకాత్యంతముముక్షుతాధిత్యకాకలితఫలితనిషాకమకరో

పాసనాయాగయోగజపతపశ్శౌచసత్యదయాశీలవ్రతదానాది నానావిధానేకహేలాద్యానవిరాజితంబును ఋషితనిగమాగమాంతకల్పలతావిలసితంబును షడ్విధసమాధిసౌధవిభ్రాజితంబును బరమాధ్యాత్మవిద్యానందజలాభిషిక్తనిర్మలచిత్తవృత్త్యంగణశమదమోపరత్యతిశయ కైవల్య భాండాగారశోభితంబు ను ఫలకామనాభావస్వభావనియతకర్మాచరణచిత్తశుద్ధిసర్వకర్మపరిత్యాగగురుభక్తి శ్రవణమనననిదిధ్యాసనాదిసోపానసమన్వితవిజ్ఞానరాజమార్గలలితంబు ను బంచాక్షరీమహామంత్రమాణిక్యతోరణాలంకృతంబు ను బ్రణవనాదమంగళవాద్యరవపూరితంబు నగు తదాస్థానమంటపాంతరంబున సర్వోపనిషత్సారభూతబ్రహ్మాత్మైకత్వరూపోంకారసింహాసనాసీనుండై శుద్ధసత్త్వప్రధానమాయామయదివ్యశోభనవిగ్రహుండు ను సర్వజ్ఞత్వసర్వేశ్వరత్వసర్వాంతర్యామిత్వాద్యగణితసమగ్రసుగుణపరిగ్రహుండు ను సత్యజ్ఞానానందస్వరూపుండు ను సర్వవ్యాపకుండు న గు శ్రీమహాదేవుండు మూర్తిమంతంబు లైన షట్త్రింశత్తత్త్వంబులు నిచ్ఛాజ్ఞానక్రియాదిశక్తులు హృషీకేశవాగీశ్వరసురేశ్వరనందికేశ్వరభృంగీశ్వరవిఘ్నేశ్వరకుమారాదప్రమథగణాధీశ్వరులు ను బ్రాహ్మీమాహేశ్వర్యాదిసప్తమాతృకలును స్వసాన్నిధ్యంబున నిజకరుణాకటాక్షంబు నపేక్షించి కొలువ స్వస్వరూపావలోకనంబుఁ జేయుచు నాత్మారాముండై యుండఁ దదీయవామార్ధశరీరిణి యుఁ బరాపరప్రకృతిస్వరూపిణి యు నిఖిలజగదుపాదానకారణభూత యు నిఖిలలోకైకమాత యుఁ ద్రిభువనగేహిని యు విశ్వమోహిని యు ధీముఖజ్ఞానవిజ్ఞానలోచన యు విషయవిగక్త్యధర యు విచారమందస్మిత యు నిర్మమతాసిరహంతాహస్త యు యోగబోధస్తని యు సందేహమధ్య యు సంసారచక్రనాభి యు రాగద్వేషజఘన యుఁ గామలోభోరుయుగళ యు సంకల్పవికల్పచరణ యు ఫలత్యాగపూర్వకవర్ణాశ్రమోచితధర్మానుష్ఠానేశ్వరప్రణిధానాద్యుపాసనేంద్రియాత్మాదినిగ్రహ స్థిరప్రజ్ఞత్వాదిసాత్త్వికగుణ భూషణాలంకారిణి యు శుద్ధవాసనావాసిత యు నిత్యానపాయిని యు నగు నమ్మహాదేవి వామభాగంబున వసియింపఁ జెలు వొందు నాయుమామహేశ్వరుధ్యానంబుఁ జేయు మని మఱి యు ని ట్లనియె.

186

క. నారాయణమూర్తి దగు వి,
హారంబు వచింతు దాని ♦ నాకర్ణింపన్
ఘోరతరపాతకంబులు,
దూరముగాఁ దొలఁగు ముక్తి ♦ దొరకొనుఁ దలఁపన్. 187

క. అని పలికిన తద్యోగిని, కనిదండము వెట్టి నీవు ♦ కరుణ దలిర్పన్
నను రక్షింపుము శ్రీహరి, ఘనతరసుగుణానుభవముఁ ♦ గఱపి ముదమునన్.

వ. అనిన నయ్యోగీంద్రుం డిట్లనియె శ్రీమన్నారాయణచరణారవిందతైలధా
రావదవిచ్ఛిన్నప్రీతిరూపాపన్నస్మృతిరూపసంతానం బగు భక్తి యుఁ దద
తరవిరక్తి యు నీకు సంభవించు నిందుకు సాధనంబు వినుము సర్వాత్మలకు
క్షేమహేతు వగు స్వస్వరూపజ్ఞానంబు తద్వ్యతిరిక్తవైరాగ్యంబ ని నిశ్చయిం
చంబడియె నది యె ట్లనిన నాత్మ శుద్ధుండు నిర్గుణుండు నిరంజనుండు శాం
తుండు ప్రకృతిపరుండు జ్ఞానానందస్వరూపుండు ను భగవచ్ఛేషభూతుండు
ను శిరఃపాణ్యాదిలక్షణం బగు శరీరం బాత్మవ్యతిరిక్తంబు గాని యాత్మగా
దు పచయాపచయాత్మకంబు దేహంబు ఘటాదికంబుపగిది నాశస్వభావం
బాత్మ నిత్యుం డని చెప్పి మఱి యు నిట్లనియె. 189

సీ. అనహమర్థం బైన ♦ యంగంబునం దభి
మానంబుచేత న ♦ జ్ఞాని యైన
జనుఁడు తత్ప్రాకృత ♦ సత్వాదికక్రియ
మాణంబు లైన క ♦ ర్మములఁ గర్త
ననుచు బద్ధుం డగు ♦ ననయంబు తద్గుణం
బులు స్వకార్యంబులఁ ♦ బొదలుకతనఁ
దాన కర్త నటంచుఁ ♦ దత్త్వజ్ఞుఁ డగు వాఁడు
దలఁచు నిస్సంగవ ♦ ర్తనముచేత
నాత్మ కీదృశకర్తృత్వ ♦ మరసి చూడ
లలిఁ బురాకృతకర్మమూ ♦ లగుణయోగ
కృతము గాని విచారింపఁ ♦ గేవలస్వ
రూపకృత మనఁ దగ దవ ♦ నీపతిలక, 190

ఉ. కావున నాత్మయందు రతి • గల్గి తదన్యములం దరక్తుఁడై
పావనమూర్తి శ్రీయువతి • భర్తృసమర్పణబుద్ధిఁ జేసి క
ర్మావలి నాచరింపుచు ని • రంతరతత్ఫలసంగకర్తృతల్
భావమునందుఁ జేర్పక వి • భాసిలు నాత్మహితాభిలాషి యై. 191

సీ. అధ్యాత్మయోగని • ష్ఠాతిశయంబు వి
జ్ఞానంబు శ్రీనాథు • సరసనత్క
థానులాపంబు త • దాకర్ణనంబు ను
బరమయోగీశ్వరో • పాస్తి యంచి
తార్థేంద్రియారాము • లగువారి విడచుట
యును వారికిష్టమై • తనరు నర్థ
కామంబులందు న • కాంక్ష శీతోష్ణాది
సహనతాహింసలు • శమదమాది
కంబు విజనస్థలస్థితి • గల్గి శౌరి
కీర్తనామృతపానవి • స్ఫూర్తి దక్కఁ
దదితరపదార్థవైరాగ్య • దశ దలిర్చి
యుండు యమనియమాదిసం • యుక్తుఁ డగును. 192

వ. ఇట్టిపురుషునికి జ్ఞానవైరాగ్యయోగంబున భక్తియోగాగ్ని జనించి హృదయగ్రంథివిదాహం బగు నిట్లుదగ్ధహృదయగ్రంథి యైన పురుషుఁడు బాల్యాదిబాహ్యధర్మంబులు సుఖదుఃఖాద్యాంతరధర్మంబులు రాజభృత్యాద్యుచ్చనీచభేదంబులు నాత్మైకారాముం డగుటం జేసి కన కుండు ద్రష్ట యైన యాత్మకు దృశ్యంబు లైన యింద్రియార్థంబులకు నంతఃకరణంబు బంధహేతు వగుటంజేసి యయ్యంతఃకరణం బాత్మ కధీనం బైనకతనఁ దదితరదృశ్యభేదంబులు నీక్షించ కుండు నిట్లు గా కుండిన విషయాకృష్టంబు లైన నింద్రియంబులచేత మనం బాకృష్టం బై విషయాసక్తిం దగిలి యాంతరం బైన విచారశక్తి నపహరించు. దానివలనఁ బూర్వాపరానుమేయసంధానరూపస్మృతి దొలంగు నట్లైన నాత్మవిషయకజ్ఞానంబు దూరం బగు నది యెయాత్మావసాన్నమంబునం దగు నది యు నుం గాక. 193

సీ. మహి నాత్మనో నుకా ♦ మాయ సర్వం ప్రియం
భవతి యన్న్వైదిక ♦ భాషణమున
నఖిలంబు ప్రియతమం ♦ బగు నాత్మకై యాత్మ
స్వాపహ్నవంబున ♦ నలరుకంటె
నధికతరం బైన ♦ స్వాత్మనాశం బెద్ది
గలుగుఁ జర్చింప లో ♦ కంబునందు
మఱి యు సంసృతి దాట ♦ మదిఁ గలపురుషుండు
దొలి పురుషార్థచ ♦ తుష్టయంబు
త్రితయ మతిభీకరం బని ♦ తెలసి నాలు
గవది ముఖ్యార్థ మని జనుల్ ♦ గణుతిఁ జేతు
రనుచు సద్భక్తియుక్తుఁడై ♦ యనుపమాన
మైన మోక్ష మపేక్షించు ♦ ననఘచరిత. 194

వ. అది యునుం గాక స్థావరజంగమాత్మకం బైన ప్రపంచంబునందు భగవంతుఁ డైన శ్రీహరి వ్యాపకుం డై యంతర్యామిత్వంబు నొంది యుండు నమ్మహాత్మునియందుఁ గార్యకారణావస్థాద్వయంబు గల జగంబు సదసచ్ఛబ్దవాచ్యం బై ప్రవర్తిల్లు "యస్యాత్మా శరీరం యస్య ప్రకృతి శ్శరీరం" ఇత్యాది వేదాంతవచనములచేఁ జిదచిదాత్మకం బైన ప్రపంచంబంత యు సచ్ఛబ్దవాచ్యం బగు నతనికి శరీరభూతంబు గావున సూక్ష్మదశాపన్న చిదచిచ్ఛరీరుం డగు నతండు కార్యభూతుం డై "అహ మేవ బహు స్యాం ప్రజాయేయేతి" యనం బడు నట్టి పరబ్రహ్మభూతుం డైన పురుషోత్తమునికి శరీరిశరీరభావంబుచేతఁ గాని నిర్వికారం బైన స్వరూపంబునం గాదు ఏకవిజ్ఞానంబున సర్వవిజ్ఞానంబు నగు నని వేదాంతోదితార్థంబున సూక్ష్మచిదచిచ్ఛరీరకబ్రహ్మవిజ్ఞానంబున స్థూలచిదచిజ్జనకబ్రహ్మదిజ్ఞానం బగు నని సార్థకం బగు దేహగతంబు లైన కౌమారాదికంబులు దేహియందుఁ జెందని తెఱంగున హృద్గతంబులైన వికారంబులపహతపాప్మాదిగుణకుం డైన జగచ్ఛరీరియందుఁ దవులకుండు నట్టి సర్వేశ్వరుండు స్వసంకల్పకృతజగదుదయవిభవలయలీలుండు నుపాసకానుగ్రహార్థంబు హృత్కమలకర్ణికాంతరంబున వసించి సర్వనియామకుండు సర్వవిలక్షణుండు దివ్యమహిషీరమారమణీరమణుండు బ్రహ్మ

జ్వలనాశ్రయాధార • జలజబాంధవపాత్ర
సంభృతైందవసుధా • స్వాదమంది
సుందరేశ్వరహృదయసా • నందసరసి
సరసహంసీవతంసయై • సంభ్రమించి
బ్రహ్మవిద్యామృతాదన • పరసమాంస
మీన మీనాక్షిఁ దలఁచు నీ • మానసమున. 204

వ. మఱియు నమ్మహాలక్ష్మీస్వరూపంబుఁ గొంచెం బభివర్ణించెద మృష్టపద్మరాగసదృశచరణాంబుజనఖరనికర యు యావకనిరపేక్షచరణలౌహిత్యవాహిని యు మారతూణీరదర్పహరజంఘిక యుఁ గరికరనిభోరుయుగళ యు సూక్ష్మారుణదుకూలాలంకృతనితంబజఘనాభోగ యు నఘ్నోరుకగ్రంథిమద్రక్తకాంతివిరాజిత యు నతనాభిమహావర్త త్రివళ్యూర్ధ్వప్రభాఝురి యు స్తనకుట్మలలోలముక్తాదామశతావృత యు నతిపీవరవక్షోజభారభంగురమధ్య యు శిరీషదామపేశలచతుర్భుజయుఁ బరిసంమృష్టశంఖసుందరకంధర యు సువృత్తముకురాభవదన యు బింబికాపాటలాధర యుఁ బఙ్క్తిపరిశుద్ధశుచివిద్యారూపభాస్వత్కుందముకుళసుచ్ఛాయదంతదర్శితచంద్రిక యు స్థూలముక్తాఫలసన్నద్ధనాసాభరణభాసుర యుఁ గేతకాంతర్దళద్రోణిదీర్ఘలోచన యు నర్ధేందుతులితఫాలతలసమ్యక్క్లృప్తకచచ్ఛట యుఁ దాళీవతంసమణికుండలమండితగండభాగద్యుతి యు నవఘనసారకస్తూరికాదసమామోదితవీటిక యుఁ జలచ్ఛారదైందవమండలమధురానన యుఁ జింతామణిసారసహితకిరీట యు దరోన్మీలద్రక్తాభఫాలనేత్రవిరాజిత యు గాఢాంధకారనిబిడశ్యామలకుంతలసంహతి యు సీమంతవీథీవిన్యస్తసింధూరరేఖాభాసుర యు స్ఫురచ్చంద్రకరోత్తంసయు మదలోలవిలోచన యు సర్వశృంగారవిశేషాఢ్య యు నగు నమ్మహాదేవిని సేవింపు మని యిట్లనియె. 205

గీ. హరిహయానలయమకోణ • పాంబుధీశ
పవనయక్షాధిపేశ్వర • ప్రభృతిదిక్ప
తులను బుణ్యాత్ములగు మునీం • ద్రులనుగూర్చి
ధ్యాన మొనరింప వలయు ని • త్యంబు మదిని. 206

సీ. సముదయుప్పద్మినీ ♦ రమణునకు నిరంత
రంబు నమస్కార ♦ ణం బొనర్చు
పుష్పసుగంధతాం ♦ బూలశాకంబుల
ఫలపత్రముల శివా ♦ ర్పణముఁ జేసి
భుజియింప వలె భక్ష్య ♦ భోజ్యాదు లన్నింటి
నటు వలెఁ జేయంగ ♦ నగుఁ దలంప
నేది దత్తం బగు ♦ నేది కృత్యం బగు
నేది స్నానము జపం ♦ బేది వ్రతము
నేది తప మగు నది యంత ♦ యీశ్వరునికి
నర్పితము గాఁ దలంచుట ♦ యర్హ మగును
అమ్మహేశ్వరు కృపచేత ♦ నఖిలపదవు
లనుభవించంగ వచ్చు నీ ♦ యవనిలోన. 207

సీ. రుద్రాక్షవలయసం ♦ రూఢోజ్జ్వలత్కర
దండయుగ్మంబునఁ ♦ దనరుచుండి
ఫాలభాగాంతర ♦ ప్రస్ఫురత్సితభస్మ
యుక్తత్రిపుండ్రంబున ♦ నొప్పుచుండి
వరమంత్రరాజ మౌ ♦ పంచాక్షరి జపించి
సావధానం బైన ♦ శాంతమునను
సతతంబు శివపదా ♦ బ్జధ్యాన మొనరించి
యింపు గాఁ గను భుజి ♦ యింపు నెడను
పలుకు నెడఁ జూచు నెడ నిల్వఁ ♦ బడిన యెడఁ దొ
రఁగు నెడలఁ గూర్కు నెడ విహా ♦ రం బొనర్చు
నెడను విను నెడ గ్రహియించు ♦ నెడను శివుని
చింత సేయంగఁ దగు బుద్ధి ♦ మంతులకును. 208

క. ఈవిధమున సంక్షేపము, గా వచియింపఁ దగె ధర్మ ♦ గతిసంగ్రహ మీ
భూవలయమున బహుపురా, ణావిష్కృత మయ్యెఁ బ్రకటి ♦ తాంచితవృత్తిన్.

చ. సకల పురాణగుహ్య మఘ ♦ సంహరణంబు పవిత్రమూజయ
ప్రకటసుఖప్రదం బతివి ♦ పత్తివిమోచన మై తలిర్చు నై

వకవచ మేను నీకుహిత ♦ వర్తన మొప్ప వచింతు రాట్కుమా
రక పరిశుద్ధమానసము ♦ రంజిలఁ జేయుము సమ్మదంబునన్. 210

వ. అని శివకవచంబు సాంగంబుగా నతనికి నుపదేశించి యాఋషభయోగీం
ద్రుం డిట్లనియె. 211

సీ. అవని వరప్రదం ♦ బగు శైవకవచంబు
చెలఁగి నాచే నీకుఁ ♦ జెప్పఁబడియె
సకలబాధావళిశాం ♦ తికరంబు సర్వదే
హులకు రహస్య మై ♦ యొప్పుచుండు
ఏమానవుం డేని ♦ నీయుత్తమం బైన
శివకవచంబు పా ♦ సించె నేని
యామర్త్యునకు శాంభ ♦ వానుగ్రహంబున
భయ మించు కేని సం ♦ భవము నొంద
దరసి చూడంగ శ్రీకాయు ♦ వైనఁ బ్రాప్త
మృత్యు వైన మహారోగ ♦ మిళితుఁ డైన
నతులసద్యస్సుఖంబు దీ ♦ ర్ఘాయు వలమిఁ
జెందు సంశయ మొకింత ♦ నొందవలదు. 212

గీ. సర్వదారిద్ర్యశమనంబు ♦ సర్వమంగ
ళప్రదం బైన శివకవ ♦ చప్రభావ
మెవ్వఁ డేని వహించు వాఁ ♦ డివ్యసుమతి
దేవతలచేతఁ బూజ్యుఁ డై ♦ తేజరిల్లు. 213

క. ధరణి వివరించి చూచితె, పరమమహాపాతకోప ♦ పాతకములచేఁ
బరివర్జితుఁ డై శివకవ, చరతిన్ దేహాంతమునను ♦ సద్గతి నొందున్. 214

క. నీవును శ్రద్ధాయుక్తుఁడ, వై వర్ణితశైవకవచ ♦ మృత్యుత్తమ మి
చ్ఛావిధి ధరియింపుచు శ్రే, యోనంతుఁడ వగుము మామ ♦ కోక్తివశమునన్.

క. అని యివ్విధమున ఋషభుం, డనుపమశివకవచ మవని ♦ పాత్మజునకు నే
ర్పున నుపదేశింపుచుఁ బ్రజే, మను తదుపరి సత్కృపాన ♦ మగరిత దోషన్.

శా. గర్వాఖర్వవిపక్షశిక్షణచణా ♦ గ్రశ్రీకసచ్ఛక్తముల్
సర్వద్వేషణహృత్పుటస్ఫుటనక ♦ చ్ఛంఖంబు ము న్నిచ్చి శ్రీ

సర్వేష్టం బయి మంత్రపూత మగు భ • స్మంబుం దదంగంబునన్
వేర్వేఱన్ స్పృశియింపుచున్ మఱియు నా • విర్భూతమోదంబునన్. 117

చ. ద్విగుణితషట్సహస్రగజ • దీప్తబలంబు నొసంగ నప్పుడ
య్యగణితశక్తిభూతిమహి • మాతిశయం బలరన్ ధృతిస్మృతి
స్వగురువిభుత్వమొందఁ జన • శాసనసూనుఁడు శారతేందుఁడై
సొగసు వహించి కేల్మొగిచి • చూడ్కికి వేడ్క నొసంగుచుండఁగన్. 218

వ. అయ్యెడ నిమ్మహాత్ముండు. 219

మ. మనుజాధీశతనూజ ఖడ్గము తపో • మంత్రానుభావంబుచే
తను నీ కిచ్చితి దీనిఁ జూచి పరుఁడం • తం బొందు న్వైరుల్ నిరా
సనముం జెందుటఁ జెప్ప నేల మఱి యీ • శంఖంబు మ్రోయంగ ము
న్వినిన్ శత్రులు మూర్ఛ నొందుదురు పృ • థ్వీశాత్మజా భూమిలోన్. 220

సీ. జననాథ సురదివ్య • శంఖఖడ్గంబులు
పరసైన్యనాశన • ప్రతిభఁ జెందు
నాత్మసైన్యంబుల • నలరించు నిత్యంబు
భవ్య మానేతృత్వ • భావమునను
జటులద్విషట్సహ • స్రద్విపబలముచేఁ
బ్రస్ఫుటభస్మధా • రణముచేత
నిఖిలశాత్రవసేన • నిర్జించి పితృసంచి
తం బైన సింహాస • నంబు నొంది
భూమిఁ బాలించఁ గలవని • బుద్ధిఁ దెల్పి
జననిచేఁ దత్సుతునిచేత • సరసపూజ
నంబులను దృప్తిఁ బొంది యా • నందమునను
ఋషభయోగీంద్రుఁ డరిగె య • థేచ్ఛ మీర. 221

వ. అని యివ్విధంబున సూతుండు శౌనకాదులకుం జెప్పిన నటమీఁద కథయెట్టి దనిన. 222

మ. శరసైజస్ఫురణోద్ధసర్వభువనో • పాదాన పాదానత
స్వరధీశాజమునీంద్రనిత్యవిలస • ద్వామాంగ వామాంగనా
కరుణారక్షితశాస్త్రసత్త్వబలవ • ద్గాంగేయ గాంగేయభూ

ధరహాసాస విలాససత్యపదక్ష • దాస్యహర వాస్యహరగా. 223

క. హార్ద్రస్తుతిక్ష్యుజ్జనసౌ, హార్ద్ర సమావర్ద సుక్తి • దావగ యభ్యా
మర్దనసంమర్ద బలీ; వర్ధరవనిపాట్యమాన • వనజభవాండా. 224

భుజంగప్రయాతము.

ప్రమాణప్రమేయప్ర • మాతృస్వరూపా
యమేయంవ్యయాత్యద్భు • తైశ్వర్యదీపా
రమానాథవాణీశ • రమ్యానులాపా
నమోంతానువాకాభి • నంద్యాప్రతీపా 225

మ. ఇదిశ్రీమత్ప్రతిపాద్యవేద్యకవితా • హేవాక భావాదిక
ప్రదశయ్యాధ్వనివృత్తిరీతిరసపుం • భావప్రభావప్రబం
ధృదయాసంభృతిరాజశేఖరహిత • శ్రీరమ్యభద్రాద్రియర
భ్యుదయాభిఖ్యమహాప్రబంధము ద్వితీ • యోల్లాసమై సొంపగున్. 226

గద్య.

ఇది శ్రీరామారెడ్డిపేట రాజరాజేశ్వరకరుణాకటాక్షేక్షణప్రసాదప్రాప్తాశేషభా
షావిశేషసామ్రాజ్యపూజ్య రామల్ల్యగోత్రపాత్ర కామినేనివంశపయఃపారా
వారరాకాసుధాకర రాజధ్రాజన్న దేశాయిసార్వభౌమాజ్ఞాపితాంధ్ర గీ
ర్వాణకవిత్వతత్త్వచాతుర్యధుర్య పరాశరగోత్ర రాపాకలింగ నామా
త్యపుత్త్ర లక్ష్మీపతిప్రణీతం బైన భద్రాయురభ్యుదయంబునందు
ద్వితీయోల్లాసము





శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# భద్రాయురభ్యుదయము

## తృతీయోల్లాసము.




రాజ్ఞీకరుణారస
ధారాప్లుతహృదయ సదయ • తత్సవనధురా
ధౌరేయసుఖకరవిహా
రా రామారెడ్డిపేట • రాజమహేశా.

వ. అవధరింపుము శౌనకాదిమహామునీంద్రులకు సూతుం డిట్లని చెప్పఁ దొడంగె. 2

గీ. అధికబలుఁ డుదశార్ణదే • శాధినాథుఁ
డై తగినవజ్రబాహురా • జ్యంబు గొనఁగ
మగధదేశాధిపతి మహా • మహుఁడు హేమ
రథుఁడనెడు రాజు సబలాభి • రాముఁ డపుడు. 3

క. ధనబలవంతుం డా యో, ధనబలరథగజతురగప • దాత్యసిముఖసా
ధనవలయితభుజుఁ డరిసా, ధనవిలయాంతకుఁ డగు దును • దగ్రతదోర్బ

వ. అంతనాకర్ణనాఁడు రాజకార్యఖడ్గపత్రీవీణు లగు ప్రధానపురుషులం జూచి యిట్లనియె 5

మ. విమతవ్యూహవిభేదనో[illegible] • [illegible]
ర్వ్యము నీతిప్రముదాత్మరక్షణవిధి • ప్రారంభ మిష్టార్థలా
భము విద్వన్నికరస్తుతంబు శమనం • బ్రాప్తంబు నౌ మంత్రికా
ర్యము గోప్యం బగుఁ గాన మీమదిని ని • త్యం బిచ్ఛయింపం దగున్. 6

గీ. కాన నామదిలో నొక్క • కార్యసరణి
యిప్పుడు దృఢ మయ్యె న • దెట్టు లనిన
సకలదేశాధిపతులు లం • చము విధాన
మొసఁగి రొకవజ్రబాహుఁడు • నొసఁగ కుండె. 7

క. అతఁడు మదోన్మత్తుండు, ధృతధనబలవిక్రమములఁ • దనరును యుద్ధో
ద్ధతి గెలచి యతనిసంపద, లతిరయమునఁగొనఁగవలయు • హర్షింపఁ దగున్.

గీ. అనిన విని తత్ప్రధానవీ • రాగ్రగణ్య
ముఖ్యు లిది దండనీతిస • ముజ్జ్వలంబు
నీదువచనంబు మామది • నిరుపమాన
మోద మొనరించె నీయెడ • మేదినీశ.

క. అని వార లియ్యకొనిన, జ్జనపతి సాగ సైన కొలువుఁ • జాలించి [illegible]
కనకరుచిరధ్వజకీలిత, కనకరథం బెక్కి కౌతు • కం బిగు రొత్తన్. 10

క. సంధుక్షితషడ్విధబల, బంధురుఁడై వెడలెఁ గామ • బధీకృతది
గ్బంధురసింధురదుందుభి, ధాంధాంధాంకగణములను • ధరణివణంకన్. 11

వ. ఇవ్విధంబున వెడలిన 12

సీ. మథితదుష్పథజవ • ప్రథితావితథమనో
రథదాత్రశత్రుభృ • ద్రథము లలర
బంధురావయవగ • ర్వాంధకారప్రవ
ద్గంధసింధురఘటల్ • గడలుకొనఁగ
ఘోరబాహ్లీకధా • రారట్టతుఖార
ఘోట్టాణధట్టికా • కోట్లు లెనయ
చటులారిధీరహృ • త్స్ఫుటపరిస్ఫుటనార

భటిసముద్భటవీర ♦ భటులు గొలువ
భూరిభేరీమృదంగఢ ♦ క్కారవములు
పటహగోముఖవాద్యశ ♦ బ్దములు భద్ర
కాహళీకహళీరవ ♦ వ్యూహములు ను
నాకఁ మొగి మ్రోయ మాగధుల్ ♦ పికఁటిల్లి. 13

వ. మఱియు. 14

సీ. అధికు లై తగినట్టి ♦ రధికులు ధృష్టులై
వధికులుఁ దవిలి ప్రే ♦ వలఁ జెలంగఁ
ప్రాసికుల్ కార్ముకా ♦ భ్యాసికుల్ ముద్గర
న్యాసికుల్ దగుహలా ♦ హళి యొనర్ప
తాళికుల్ వందిసై ♦ తాళికుల్ నిశితార
హాళికుల్ సాటోపు ♦ లగుచు నడువ
హేతికుల్ ముసలవి ♦ ఖ్యాతికుల్ ముష్టిసం
ఘాతికుల్ మెండుగాఁ ♦ గ్రందుకొనఁగ
శాంఖికుల ఘాంటికులఁ గూడి ♦ చాక్రికులు ను
ఖాడ్గికుల యాష్టికుల మించి ♦ కౌంతికులు ను
దారసోత్సాహసన్నాహు ♦ లగుచు నపుడు
పగర నిర్జించు వేడఁ-చే ♦ బలసి రాగ 15

సీ. స్వవిషయానంతర ♦ స్థానుండు శత్రుండు
తదనంతరుండు మి ♦ త్రత్వ మొందు
తత్పరతరరాజు ♦ దాసీనుఁ డగుచుండుఁ
దన వెనఁ నుండు భూ ♦ ధవుఁడు దలఁప
నటుల పార్ష్ణిగ్రాహుఁ ♦ డనఁబడుఁ గాన ని
వ్విధ మంతరంబున ♦ వెలయుచుండ
సాధుసహాయంబు ♦ సాధనోపాయంబు
పరదేశకాలవి ♦ భాగ మరసి
ఘనవిపత్తికి మను ప్రతీ ♦ కారవృత్తి
కార్యసిద్ధియు నన నైదు ♦ గతులు గలుగు

సరసపంచాంగ మరయుచు • షడ్విధంపు
బలము నడపింపఁ దొడఁగె న • బ్బలితుఁ డపుడు. 16

సీ. కాండీరవిక భయం • కరనినాదంబులు
శారభికస్వాన • జారభటులు
పౌండరీకిక ఘోర • ఘాంకారరావముల్
సైరిభికప్రస్ఫు • టారవములు
వారాహికోద్ఘట్ట • ఘోరసంరావముల్
భైరుండికోగ్రశ • బ్దవ్రజంబు
ఖాడ్గిక సందర్భ • కఠినస్వనంబులు
కౌశికహుంక్రియా • కలుషరుతులు
సాహసాగతసైన్యకో • లాహలములు
గలసి యేకీభవింప ను • త్కంఠతోడ
భీకరారణ్యగణ్యద • ర్వీకరోగ్ర
మార్గముల నిర్గమింపుచు • మహిభుండు. 17

వ. మఱియు. 18

సీ. పరదేశములకు సం • బాధంబు రాకుండ
వ్యూహంబు నొనరింప • నూహఁ జేయు
దుష్టసత్త్వంబులఁ • దూలించ నియమించు
వితతదృష్టాదృష్ట • విధముఁ దెలియుఁ
దవిలి సాంద్రదృష్టికో • త్కర్షంబుఁ గార్తాంతి
కులు దెల్ప సంతోష • కలనఁ జెందు
నింపు మీరంగ శ్యే • నంపాతకిట్టి ప్ర
స్థానం బనుచుఁ బలుకఁ • బూనఁ జేయు
నస్త్రముల బండ్ల సవరణ • లలరుచుండ
శార్కరిలసికతిలమహా • శాద్వలములఁ
ప్రకటపంకిలనడ్వల • పద్ధతులను
గడచి చతురంగబలములు • త్కలికతోడ 19

శా. భీమానర్గళనిర్గళత్పరబలా • భేద్యంబు ధాన్యాదిక

స్తోమస్థేమ మనేకపార్శ్వరథవి ♦ స్ఫూర్జద్భటప్రక్రియో
ద్దామం బద్భుతనూత్నరత్నవిలస ♦ ద్ధ్వానం బజత్సైనికస
ద్ధైమచ్ఛత్రగవజ్రబాహునృపురా ♦ జ్యం బాక్రమించెన్ వడిన్. 20

చ. కలుషితధూళితో నెదురు ♦ గాడ్పులు డాయ వరళ్ళు గూయ ను
ల్కలు వడ రక్తమేఘములు ♦ గర్జిలి నెత్తురు నింప మించి చు
క్కలు భయదంబుగా దివిని ♦ గన్పడ దుష్టములైన శాకునం
బులు గనుపించ మాగధస ♦ మూహము బెగ్గిలకగ్గలంబునన్. 21

వ. ఇవ్విధంబున సముద్రతరంగంబుల చందంబున వర్షబిందువుల విధంబునఁ జిలుకపరిగతి మిడుతగమివడువున నిసిళ్ళగుంపురీతి నేలయీనినపగిదఁ దండోపతండంబులై లక్షోపలక్షలై కోటానుకోటులై పెక్కుగతుల నెక్కుడఁగన నక్కుడఁ గనుపట్టు శతాక్షోహిణీమాగధబలంబు వజ్రబాహుపరిపాలితదశార్ణదేశనగరగ్రామజనపదంబు లాక్రమించి. 22

ఉ. కొందఱు రత్నరాసులను ♦ గొందఱు స్వర్ణచయంబులన్ మఱిం
గొందఱు దివ్యవస్త్రములఁ ♦ గొందఱు గోవృషసంచయంబులన్
గొందఱు సుందరీమణులఁ ♦ గొందఱు బాలురఁ గొంద ఱింపు జె
న్నొందిన ధాన్యసంఘముల ♦ నుద్భటవృత్తిని సంగ్రహించుచున్. 23

సీ. యోగ్యకాపోతమా ♦ యూగశౌకాదస్ఫు
టోద్యానవరముల ♦ నుక్కడంచి
జాలపాదరథాంగ ♦ జాలమోదాభంగ
విమలాంబుపద్మాక ♦ రములు గలఁచి
సుఖభోగ్యశాలికా ♦ ముఖయుక్తసస్యంబు
ఘోటకంబులు మెక్కఁ ♦ గోసినైచి
ముక్తాఫలాసక్త ♦ ముక్త్యేక్షువనములు
విటతాటనంబుగా ♦ వించి మించి
క్రమకేళిరథంబులు ♦ గాసిఁ జేసి
ధనపదాగారములు జొచ్చి ♦ తస్కరించి
సకలవస్తువ్రజంబులు ♦ త్సుకతఁ గొనుచు
రిపుబలంబులు తద్రాజ్య ♦ రిపుల నొంచి. 24

చ. అలరులఁ ద్రుంచి తీవియల • నన్నఁటి మున్నిరసించి పెంపుడుం
బులుగులఁ గాంచి వానిఁ బోరి • పుచ్చఁదలంచి రహస్యకూటముల్
తొలుతనడంచి రథ్యములఁ • దోరణముల్ విదళించి స్త్రీల సొం
పుల నడలించి వారి వగ • భూషణముల్ హరియించి మించఁగన్. 25

క. అనద లగుచు ద్విషదపహృత, ధనకనకకళత్రపుత్త్రి • ధాన్యాంబరగో
ధను లైనిర్బంధను లై, చనుదెంచి నిజాధిపతికి • సాఁగిలి భీతిన్. 26

సీ. ఓమహారాజ నీ • యుర్విలోపల ముందు
సుఖసమృద్ధినిఁ జెంద • సుతులు మేము
సకలసంపదలచే • సంతతంబుఁ జరియించు
వారమై యుండు నీ • వార మయ్య
వలసినయప్పు డె • వారిదంబులు నిల్చి
వర్షంబుఁ గురియు న • వ్వారి గాఁ గ
ముక్కారు పంటలు • నెక్కడఁ గనుగొన్నఁ
దరుగ కుండును ధాన్య • తతి దలిర్చి
కామధేనువు లన ధేను • లాముకొనఁ గ
క్షీరవారిధి నింపు నీ • సీమ నెపుడు
బ్రాహ్మణక్షత్త్రియార్యశూ • ద్రవ్రజంబు
సత్యవృత్తిఁ జరించు నై • శ్వర్య మొంద. 27

గీ. అట్టి మాపాటు విను మిప్పు • డవనినాథ
యరివరులు నీదురాజ్యంబు • నాక్రమించి
భంగపాటును సంకట • పాటు దుఃఖ
పాటు గల్గె నయా యేమి • పలుక వచ్చు. 28

క. నిగుడింపు నీదుమగటిమి
సెగపొగ లెగయంగ శత్రు • సేనాటవులన్
దగులుకొనఁ గ లేకునికిని
వగలు డుగు నె నిన్నుఁ గొల్చు • వారల మదిలోన్. 29

వ. అని విన్నవించిన. 30

మ. విని యాభూపతి క్రోధఘూర్ణితరసా • వేశాత్ముఁడై మంత్రికా
ర్యనిరూఢాంతరులైన వారిఘనశా • ర్యస్ఫూర్తిఁ జెన్నొందు వా
రినిఁ బిల్వ న్నియమించి శాత్రవుల గా • రించం గ నెన్నాళ్ల కో
మన కుద్యోగము గల్గె సర్వబలసం • మర్దంబు గాఁ బోఁ దగున్. 31

మ. అని మీసాల్వడి వేసి యీసునను బా • హాదండపాండిత్య మే
ననిలోఁ జూపెద నాసమానుల టె ము • న్నామాగధుల్ గీగధుల్
ననుబోటిం దొడరంగ వచ్చినను నా • నానావిధాస్త్రాళి త
త్తనువుల్ నెత్తుట జొత్తిలం బరపెదం • దథ్యంబు గా నెంచినన్. 32

వ. అని కోపాటోపంబులం బలికి. 33

సీ. సమరసన్నాహదు • స్సహబలం బలరంగ
రథముఁ దెమ్మనిన సా • రథి గడంగి
వివిధాస్త్రశస్త్రప్ర • వేశదివ్యంబైన
తేరు సమ్ముఖము గాఁ • దెచ్చి నిలుపఁ
గని తద్రథం బెక్కి • కదనం బొనర్చు నా
ప్తవరూదినీపతుల్ • దరిసి నడువ
నాగరాశేషమా • నపయోదము వహించి
చతురంగవాహినీ • సహితుఁ డగుచు
స్వీయదేశప్రజా • ర్తిక్ష • చ్ఛిలఖేల
బహుళమాగధసైన్యసం • బాధనంబు
కొరకు రౌద్రరసవిశేష • ఘూర్ణమాన
మానసంబున వెడలె న • మ్మహి వడంక. 34

స్రగ్విణీవృత్తము.

భూర్భువర్భారక్ష • ద్భూరిభేరీనినా
దార్భటుల్ ఘాకరిని • రావ్రాదముల్ మ్రోసె నా
నిర్భవత్సాస • ద్వేషిరాడ్గర్భిణీ
గర్భనిర్భేదనో • త్కటంత దీపింపఁ గన్. 35

క. తనరాజ్యవర్తులై తగు, మనుజులలోఁ గల్గు పోటు • మానిసు లెల్లన్
వెనువెంట నంటి రా న, జ్జనపతి నంగరము సేయ • సరభసవృత్తిన్. 36

వ. ఇవ్విధంబున బలసమన్వితుండై యొక్కదినమాత్రంబున శత్రుసైన్యంబుఁ
దారసిలి. 37

క. అరదంబులు నరదంబులు
కరులు కరుల్ హరులు హరులు ♦ కౌతుక మలరన్
నరపతులు ను నరపతులు ను
దుర మొనరించంగ నప్పుడు ♦ తుములం బయ్యెన్. 38

సీ. శుండాంచితాయసో ♦ ద్దండతండములచే
నెత్తులు వగులంగ ♦ మొత్తి మొత్తి
కఠినోగ్రతరదంత ♦ ఘట్టనంబులచేత
గొమ్ములు జిరుగంగఁ ♦ గ్రుమ్మి క్రుమ్మి
పటుభయంకరవాల ♦ పాశతాడనముచే
వీఁపులు జెదరంగ ♦ వ్రేసి వ్రేసి
దృషదృషత్సంకాశ ♦ దీప్తదేహోద్ధతి
మేనులు నలియంగ ♦ మొదపి మొదపి
మలయమాళవచోళసిం ♦ హళసముద్ధ
చండవేదండము లఖండ ♦ సమరసంఘ
లంబు గను హాస్తిపకసమా ♦ లంబనంబు
దోఁచఁ దదధిష్ఠితవ్రజం ♦ బేచి పోరె

సీ. ఫాలస్థలాయఃప్ర ♦ బాలీనమకుటముల్
ఖడ్గధారలు ♦ ఖంగు ఖంగు మనఁగ
కవచరూపంబు లౌ ♦ ఘనశిలాభక్తరుల్
కరవాలగతి ఘుల్లు ♦ ఘుల్ల నంగఁ
గూర్పరగుప్త్యయః ♦ కోశముల్ మండలా
గ్రంబులచే ఖణిల్ ♦ ఖణి లనఁగ
బంధురతరము లౌ ♦ స్కంధదేశంబులు
తరవారులను ఖరిల్ ♦ ఖరి లనంగ
పొత్తుకొని మత్తులైనరా ♦ హుత్తు లదరి
సింధుకాంభోజకురుపార ♦ శీకవనాయు

యవనభవననవీనవా • హములఁ బరపి
తుముల మొనరించి రన్యోన్య • సమత దనర. 40

సీ. రథములఁ బరపి త • ప్పృథులఘట్టనముల
నెదిరించు భటుల నుఱ్ఱ • జదిపి చదిపి
రయము మీరఁగ సాంప • రాయికంబున మోహ
రింపు పాదాతంబుఁ • జంపి చంపి
యిరుగెలంకుల నిల్చి • దుర మొనర్చినవారి
శిరముల నందంద • చిదిమి చిదిమి
వెనువెంట నంటి వ • చ్చిన శూరబలముల
మించి తచ్ఛదములఁ • ద్రుంచి త్రుంచి
యద్భుతాన్యోన్యసైన్యగ • హనమునడుమఁ
జొచ్చి ఘంటాపథంబు గాఁ • బెచ్చుపెరిగి
రధికులత్యంతరణమనో • రధికు లగుచు
బవర మొనరించి రమిత మా • బరవసమున. 41

వ. ఇవ్విధంబున నుభయసైన్యంబులుఁ దలపడి పరిఘ గదా ప్రాస తోమర భిండివా లాసి ముసల కణయ కంపణ భల్లాంగ చ్ఛురికా కుంత ముద్గర శర చక్ర క్రకచ ఫాల లాంగూ లాంకుశ కఠార శూలాదిసాధనంబులం బ్రయోగింపుచుం దలపడి. 42

లయవిభాతి.

పుడమి గడగడ వడక • నెడతెగక నిగుడు వడి •
పిడుగులను దెగడు కడు • బెడిద మగు దంతుల్
తొడర జడి విడివడిన • వడుపునను మిడుగురులు •
గడలుకొన నలుగడలఁ • బడు కడిఁదితూపుల్
తడబడక గడుసు లగు • నొడల నడుములఁ దొడల •
నడుగులను నెడలిబుడి • బుడి వడియు రక్తం
బడరఁ బొడు పొడు మనెడు • నుడుపులను నుడువుచును •
విడనికడిమిని జడత • దడబడక సేనల్.

సీ. ప్రబలముష్టీముష్టిఁ • బోటించి కొందఱు
శిరములు వఱియ లై • తొరుఁగఁ జేసి
ప్రకటఖడ్గాఖడ్గిఁ • బచరించి కొందఱు
కరచరణంబుల • నురుముఁ జేసి
భీమబాహాబాహిఁ • బెనఁగొని కొందఱు
కాయంబులను దును • కలుగఁ జేసి
చటులదండాదండిఁ • జర్చించి కొందఱు
బిరుసు లౌ వీఁపులఁ • బెటిల మోది
పటునఖానఖి ఘనపదా • పదిఁ గచాక
చిని రదారది ననిఁ జేసి • రనుపమప్ర
తాపదీపితవీరాను • లాప మలర
నుభయపక్షబలంబులు • రభసమునను. 44

ఉ. భండనభూమి నిట్లు భయ • వర్ధను లై కడు నుత్సహించి యు
ద్దండపటిష్ఠతం దొడరి • దారుణయుద్ధముఁ జేసి చేసి బ్ర
హ్మాండకటాహముల్ వగుల • నార్చిన నద్రిగుహాంతరంబులన్
నిండి ప్రతిధ్వనుల్ నిగుడ • నివ్వెఱఁగందిరి దివ్యు లత్తఱిన్. 45

వ. మఱియు నబ్బలంబులు రువడి నొక రొకరు తమశౌర్యంబు మెఱయ ఖడ్గం
బుల వేసి కుంతంబులం బొడిచి కుఠారంబుల నడిచి వంకులఁ గ్రుమ్మి శూ
లంబులం జిమ్మి ముసలంబుల మొత్తి పరిఘంబుల విదళించి పాశంబుల బం
ధించి ప్రాసంబుల విశసించి భిండివాలంబుల భేదించి ముద్గరంబుల ఛేదిం
చి చక్రంబుల విక్రమించి తోమరంబుల నాక్రమించి మఱియు వివిధాయు
ధంబులఁ బరఁగించిన విరుగు తేరు లును నొరఁగు నేనుంగులు ను దిరుగు హ
రులు ను దరుగు భటులు నుం గలిగి విచ్ఛిన్నంబు లైన ఛత్రంబులు విదళి
తంబు లైనకేతనంబులు విద్ధంబు లైనతనుత్రాణంబులు విదితంబు లైనశరా
సనంబులు విధ్వస్తంబు లైనశరీరంబులు విగతంబు లైన బొమిడికంబులు
వికలంబు లైన మస్తకంబులు విలూనంబు లైన కంఠంబులు వికీర్ణంబు లైన
భుజంబులు విగళితంబు లైన వక్షంబులు వివిధంబు లైన తుండంబులు విశ
కలితంబు లైన యూరువులు విపాటితంబు లైన జంఘికలు విక్షిప్తంబు లైన

పదంబు లుం గలిగి విష్వగ్వ్యాకీర్ణనర్తనపరివర్తనప్రభూతభూతప్రేతపిశాచ
శాకినీడాకినీబేతాళాదిగణకోలాహలరవంబు గలిగి బహుప్రహరణంబులవల
న బుడిబుడి జడియు శోణితధారాళధారావారిపూరంబు దారుణబాణవిలూ
నగజవాజియోధమేదోమాంసమజ్జమస్తిష్కంబు పంకంబు భుజంబులు భు
జంగంబులు శిరఃకపాలంబులు కచ్ఛపంబులు శిరోరుహంబులు శైవాలంబు
లు కరంబులు మత్స్యంబులు తురంగంబులు నక్రంబులు ద్విపంబులు ద్వి
పంబులు ఛత్రంబులు ఫేనపుంజంబులు చామరంబులు మరాళంబులు నానా
విధభూషణమణిగణచూర్ణంబు పులినంబు గల సంగరాంగణంబు మహార్ణవం
బు ననుకరించె నట్టి దంభసంరంభవిజృంభమాణద్వంద్వయుద్ధంబున శతాం
గంబుల నిట్టట్టు జేయుమాతంగంబులు మాతంగంబులఁ దూలించు తురం
గంబులు తురంగంబులఁ జెదరించు భటులు ను నిట్లు నిర్మర్యాదంబు గాఁ
బెనంగు సమయంబున 46

క. మగదమహీపతి బలమున, మగటిమి గల వార లేచి • మార్బలముల మున్
బెగడుపడఁ జేసి తరిమిన, వగ చెడుమ దశార్ణసేన • వడిఁ బరచు తఱిన్.

వ. అట్టియెడ వజ్రబాహుండు. 48

క. కలఁగిన తద్బలమును మును
గొలుతలఁగాఁ జేసి నృపతి • కుంజరుఁడు చలా
చలవృత్తినొంద మాగధ
బలముల జర్ఝరితగాత్ర • వరులు గఁ జేయున్. 49

క. పరచరచి నలుగడలకున్
బరచిన తన బలముఁ జూచి • బాహాబలవి
స్ఫురితుఁడగుచు మాగధుఁ డం
బరతలభూతలము లదరఁ • బటురయ మలరన్. 50

క. హుంకృతులు సింజినీభవ, టంకృతులు సదానకరిఘ • టాసంభూతో
ద్ఘీంకృతులు భేరికోదిత, భాంకృతు లదరంగ వజ్ర • బాహుం గదిసెన్. 51

సీ. వజ్రబాహుం డేయు • వాడి తూపుల చేత
నరవరులై పోవు • నరదములు ను

హేమరథుం డేయు • భూమమార్గణములఁ
బరవర లై పోవు • భటచయములు
వజ్రబాహుం డేయు • వరశిలీముఖముల
న ట్టిట్టు బడు చుండు • నశ్వములును
హేమరథుం డేయు • నిద్ధబాణంబుల
జిరజిరఁ దిరుగు పె • న్కరివరములు
నిటుల నన్యోన్యబలముల • నేకశరము
లడరఁ గాఁ జేసి యలయించి • కడిమి మెరసి
యేపుతో వజ్రబాహుండు • హేమరథుఁడు
దీప్తదివ్యాస్త్రములఁ బూనఁ • దివిరి యపుడు. 52

గీ. వజ్రబాహుండు విస్తార • నారిధార
వారిదాస్త్రంబుఁ బరఁగింప • భూరికోప
మెసఁగ నా హేమరథుఁడు • ను ద్వృత్తిమీఱ
మారుతాస్త్రంబు జేతఁద • న్మహిమ నడఁచె. 53

క. విరసంబు మ్మరను గ భూ, ధరబాణము వజ్రబాహు • ధరణిపుఁ డేయన్
సరి గా హేమరథుఁడు ద, త్పరిహర మై తనరఁ గులిశ • బాణం బేసెన్.

క. దర్వీకరాస్త్రమపుడు సు, పర్వులు వినుతింప వజ్ర • బాహుం డేయన్
దుర్వారహేమరథుఁడు స, గర్వుం డై గారుడాస్త్ర • గతిచే నడచెన్. 55

గీ. వర్ణితాగ్నేయబాణ మా • వజ్రబాహుఁ
డేయ నది జ్వాల లడరం గ • నేచి రాఁగ
హేమరథుఁ డంత వరుణాస్త్ర • మేసి దాని
యుదు టడంచెను దనసైన్య • ముబ్బు చుండ. 56

క. రుంద్రప్రకాశమునఁదగు
నైంద్రాస్త్రము వజ్రిబాహుఁ • డడరించ యశ
స్సాంద్రుఁ డగు హేమరథుఁడు మ
హేంద్రాస్త్రముచేత దాని • యేపడచె వడిన్. 57

వ. ఇవ్విధంబున సింహంబులచందంబున శరభంబులబోలికె శార్దూలంబులగతి వృషభంబులవిధంబున గజంబులచాడ్పున నంతకంతకు మచ్చరంబు గ్రి

చ్చుకొన దివ్యాస్త్రవిలాసంబుఁ జూపుచుఁ జిందంబుల మొఱయింపుచు భే రులు మెరయింపుచు నిజబిరుదంబులఁ జాటింపుచు శరవర్షంబులు వాటింపు చుఁ బోరు నవసరంబున. 58

సీ. సచివభృత్యామాత్య • సహితుఁడై యవ్వజ్ర
బాహుండు మగధాధి • పతిని గిట్టి
రైదింట గుఱ్ఱంబు • లారింట సారథి
నేడింటఁ దద్ధ్వజం • బెనిమిదింటఁ
జాపంబుఁ దొమ్మిది • తూపులఁ దత్తను
త్రాణంబు దశసంఖ్య • బాణములను
వక్షంబుఁ గాడంగ • వడి నేయుటయుఁ జూచి
క్రోధారుణాక్షుఁడై • యోధవరుఁడు
నతఁడు నిగుడించు శరముల • నంతకంటె
బెడిద మగు తూపుగమిచేత • నుడిపి తత్ప్ర
కారమార్గంబునకుఁ బ్రతీ • కార మెనయఁ
జేసి కడుకూటయుద్ధంపు • చిత్తమునను. 59

క. తనయోధాగ్రణు లందఱిఁ, గనుఁగొని చేవీచి కడిమి • గడలుకొనఁ గఁద త్సునిశితబాణాసారము, మునుమిడి వారింపుచో న • మోఘాస్త్రుండై. 60

గీ. స్వాతివర్షంబు గురిసిన • చందమలర
నతని యరదంబు బాణమ • యంబుఁ జేసి
విజయబిరుదాంకనిజయోధ • వితతిఁ జూచి
పట్టుఁడని బరవస మెచ్చ • నట్టియెడల. 61

సీ. ఆహవంబున నుగ్రకి • యలఁతఁ జెందిన వజ్ర
బాహుపై మాగధుల్ • పలువు రేచి
యొగిఁ బ్రాగవాక్పృత్య • గుదగధిస్థలములఁ
దవిలి శస్త్రాస్త్రసం • తతులచేతఁ
దద్వాహము సహస్ర • ధారంధ్రము గఁ జేసి
కొంద ఱాతనిలేరు • గూల్చి రొకఁటఁ

గొంద ఱాతని సూతు • గుఱియంగఁ జేసిరి
కొంద ఱాతని విల్లు • గ్రిందుపరచి
రెలమిఁ గొందఱు తత్ప్రాణ • మిలఁ బడంగఁ
జేసి రొకకొంద ఱతని వా • జివ్రజంబు
నరికి యిటువలె నారాజు • విరథుఁ జేసి
పట్టి బంధించి రత్యంత • బలము మెఱయ. 62

చ. ఇటువలె బద్ధుఁ జేయుచు ను • హేమరథాధిపు యోధు లెల్లఁ ద
ద్భటసచివాప్తభృత్యగణ • బాంధవులం దఱిఁ బారఁ ద్రోలి యు
ద్భటు లయి భేరికావిజయ • ఘాంకరణంబుల శంఖ కాహళ
స్ఫుటరవముల్ సెలంగఁ బరి • పూర్ణమనోరథవృత్తి దోఁపఁగన్. 63

సీ. మహితకాంచనమణి • మయము లై రంజిల్లి
కనుపట్టు తగు శతాం • గములఁ గొన్ని
దానధారాసమిం • ధానగంధోల్లస
ద్బంధురతరయూధ • పములఁ గొన్ని
కల్యాణకరరత్న • పల్యాణభరవాయు
గమనంబు గల తురం • గములఁ గొన్ని
యతిభారవాహకో • న్నతకాయములు గల్గి
సమదంబు లైన యు • ష్ట్రములఁ గొన్ని
బహుళముక్తాఫలాంచిత • పటగృహముల
వితతసౌవర్ణముద్రికాం • చితవిశాల
పేటికాసంఘముల రాజ • బిరుదకేత
నాదులను గొని రత్యంత • మోద మలర. 64

వ. మఱియు. 65

గీ. పరచు తన్మంత్రిముఖయోధ • వరుల మీఁద
వాయువేగాశ్వములఁ దోలి • వారిఁ బట్టి
పాశనిర్బంధదేహు లై • పరఁగఁ జేసి
హేమరథు మ్రోల నిడె నమ్మ • హీశుఁ డపుడు. 66

గీ. వీని నావజ్రబాహుని ♦ విరిచికట్ల
తోడ బలుశకటములతోఁ ♦ గూడఁ బెట్టి
తెండు మీ రిపు డేమర ♦ కుండుఁ డనుచు
విజయదుందుభి మ్రోయించి ♦ వేడు కలర. 67

క. నృపుఁడు చతుర్విధసైన్య, ప్రపతులఁ గని మనము వజ్ర ♦ బాహుపురశ్రీ
నిపు డపహరించి యారా, జ్యపరిగ్రహణంబు సేయ ♦ నర్హం బరయన్. 68

క. అని యానతి నొసఁగిన వా, రను మోదముతోడ వేగ ♦ మలరఁగ శుభల
క్ష్మినిఁ దగు తత్పురవరణముఁ, గని లగ్గకుఁ జొచ్చి మిగులఁ ♦ గడిమిదలిర్పన్.

క. వీరులు తత్పురి కావలి, వార లోకించుక యు వేటు ♦ వాటులచేతం
బోరఁ గ వారల నెల్లం, జీరికిఁ గైకొనక శత్రు ♦ సేనలు కడిమిన్. 70

గీ. ధనకనకవస్తువాహనా ♦ దిసిఁ దలిర్చు
వజ్రబాహుని నగరి ము ♦ వ్వాకరి గాఁ గ
దోఁచి తమతమ కిష్టవ ♦ స్తువులఁ గొనుచుఁ
బ్రభునియుక్తిఁ దదంతఃపు ♦ రమున కేగి. 71

సీ. నవవిధస్థానసం ♦ భవమౌక్తికంబులు
గలుగు దివ్యాగార ♦ ములు గలంచి
వజ్రవైదూర్యపద్మ ♦ వాళగోమేదికం
బులమిం చుదవసితం ♦ బుల నడంచి
సౌవర్ణచేలసం ♦ చయమున విలసిల్లు
లలితచతుశ్శాల ♦ ములఁ జరించి
రమణీయతపనీయ ♦ రౌప్యముద్రిక లుండు
భాండాలయంబుల ♦ బడలుపరచి
హారకేయూరమంజీర ♦ చారుమకుట
ఘటితపేటీభరంబుల ♦ గానిఁ జేసి
వలసినట్టుల దిరిగి య ♦ వ్వారి గాఁగ
నపహరింపుచు రిపుసైన్య ♦ మలరు మతిని. 72

సీ. రామణీయకకన ♦ దాద్రిజగృహశ్రీల
రాజిల్లు దానదా ♦ సీజనులను

జన్యస్థలమునకుఁ ♦ జనక శైలలనుండు
రంగత్తురంగమా ♦ తంగములను
హరిమూర్తివివాహి ♦ తావివాహితనిత్య
మాన్యలై తగు రాజ ♦ కన్యకలను
బోషితవ్యక్తకా ♦ పోతమాయూరాద
భరితచామీకర ♦ పంజరములఁ
జనమనోహరతనుమృగ ♦ సంతతులను
మహితకస్తూరికాసంకు ♦ మదమృగమద
ముఖ్యగంధయుతసుకంద ♦ ములును మొదలు
గాఁగ సర్వార్థము హరించి ♦ కౌతుకమున. 73

సీ. ద్రాక్షాఫలసమృద్ధి ♦ తసాసవంబుతోఁ
జరఠాయుధోపదం ♦ శంబుఁగూర్చి
సమ్యగిక్షువరసాం ♦ చత్సీధుతతితోన
జాప్తైరరంబుఁ బో ♦ సంగఁ జేసి
మత్స్యండకాదిసం ♦ భవమధుప్రతతితో
సచ్ఛేకతరసంబు ♦ సంఘటించి
మహితగంధోత్తమా ♦ మైరేయమును గూర్చి
యావికపలలంబు ♦ నావటించి
వారవనితాళిఖేలాస ♦ వంబుగాఁగఁ
జేసి పానం బొనర్చి రం ♦ జిల్ల వారిఁ
బట్టుకొని ప్రమదావన ♦ ప్రముఖములను
రూపు మాపుచు నప్పుడా ♦ రూషబులులు. 74

సీ. దుర్భరాపర్వాగ్ర ♦ సౌర్భకస్త్రైణాశ్రు
పాతపంకిలము నే ♦ పట్టుఁజూడ
గుల్భద్వయసశాత ♦ కుంభముక్తాఫల
శార్కరిలంబు నే ♦ చక్కఁగనిన
జానుమాత్రసితాభ్ర ♦ సంకుమదాగరు

గంధగంధిలము నై • కక్కడఁదలంప
నక్థదఘ్రాణక • చణకశాలికుళుత్థ
మాషతుందిలము నే • మనిక్కి నరయ
ఘనజనులు చూరఁ బుచ్చిన • కతనఁ దత్ప
రాపణంబులు జూపట్ట • నఖిలజనులఁ
జెరఁ గొనుచుఁ బోవ సింధుసం • భరితనినద
మనుకరించెను వినువారి • కద్భుతముగ. 75

గీ. అప్పు డాబాలగోపాల • మనక ప్రజలు
నొక్క మొగి వైరులకుఁ జిక్కి • స్రుక్కి పొక్కి
కుంద యాక్రందనధ్వనిఁ • జెంది యుండ
శత్రుజను లేగు చుండు త • త్సమయమునను. 76

మ. సరథాశ్వేభభటాళి యైమగధదే • శం బేలు చున్నట్టి హే
మరథుం డున్న నృపాలమౌళి మిగుల • న్మత్తిల్లి దాశార్ణరా
జ్యరమాధీశ్వరు వజ్రబాహునృపుఁ బ్రీ • ఖ్యాతాత్ముఁ గాఁ జేసిచె
చ్చెర బాధించుక పోవు వాతన్ మొరసెన్ • శేషించు దేశంబులన్. 77

క. ఆవార్త సకలరాజ్య, శ్రీవిభవసమేతరాజ • శేఖరుల హహే
త్యావిష్కృతోక్తు లడరఁ భ, యావహతన్ జాగరూకు • లై యుండి రొగిన్.

వ. అట్టి యెడ. 79

సీ. ఒనరభద్రాయుర • భ్యుదయాధి నెఱిఁగిన
వాఁ డౌటఁ జేసి య • నైశ్వర్యవరుఁడు
మథితారివీరుఁ డ • మ్మగధాధినాథుఁడు
ద్వృత్తుఁ డై యస్మత్స • మృద్ధిగల్గు
మించు దేశం బాక్ర • మించఁ గలఁడు వాని
విక్రమం బిమ్మహా • వీరుచేత
నడఁగింప వలయు నీ • యెడ నది యుం గాక
మును బితౄణముఁ దీర్చు • కొను నతం డె
సుతుఁడు గాక తదన్యుఁడు • సుతుఁ డె మఱి యు
నివ్విధంబున భూపాల • కేప్సితంబు

సర్వజనసమ్మతం బని ♦ శక్రప్రసాద
లబ్ధబలుఁ డితఁ డతనిఁ గ ♦ లంచఁ గలఁడు. 80

వ. అని విచారింపుచున్నంత. 81

మ. ఫణిహారుల్ పరదేశనైవగికు లై ♦ ప్రస్తావనావాప్తవా
క్ఫణితి స్మార్ద్రగతార్యవల్లభునితో ♦ భాషింప నాతండు త
త్ఫణితిం జెప్పినసూక్ష్మదూర్జితశర ♦ త్పర్జన్యగర్జావిజృం
భణ మేపార నపారకోప ములరన్ ♦ భద్రాయువత్యుద్ధతిన్. 82

సీ. ఘనయోగివరలబ్ధ ♦ ఖడ్గశంఖంబులఁ
గొని హీరకవచంబు ♦ మును ధరించి
మణిగణాలంకార ♦ మకుటాదుల వహించి
రమ్యదుకూలాంబ ♦ రములు గట్టి
పరశు పట్టిస శూల ♦ కరవాల ముద్గర
ప్రాస తోమర భిండి ♦ వాల ముఖ్య
శస్త్రాస్త్రముల నెల్ల ♦ సవరించుకొని వీర
గంధమాల్యంబులు ♦ తఱలికఁ దాల్చి
యాశ్వరాజగవసమాన ♦ విశ్వజైత్ర
మనుశరాసనవరము బ్ర ♦ హ్మాస్త్రముఖ్య
మార్గణంబులు విలసిల్ల ♦ భర్గుఁ డనఁ గఁ
దనరి సఖుఁ డైన తద్వైశ్య ♦ తనయుఁ జూచి. 83

క. ఇపుడు ధనుర్విద్యాభ్యా
సపరిశ్రమ మాకుమార ♦ చాతుర్యముతో
నుపమింపఁ జేసి శాత్రవ
నృపతుల మును గీటడంచి ♦ నిగుడఁ గవలయున్. 84

క. కావున నీ వీరొడ వీ, రావేశముఁ బూను నాన ♦ హాయము గలుగన్
నావిజయ మె నీవిజయము, గా వివరింపు మి దె మైత్రి ♦ గడలుకొనంగన్

గీ. అనుచుఁ బలికిన సమరోచి ♦ తాసమాన
భాసమానసముద్యచ్ఛ ♦ రాసమాన

నీయశ్వాణవశిసాధన ♦ నియతుఁ డగుచుఁ
దదశ్వథోత్సాహపరతచేఁ ♦ దగిన నగుచు. 36

సీ. ఋషభయోగీంద్రిము ♦ హిళ్వారాంఘ్రిల ముందు
స్వాంతంబులోపల ♦ సంస్మరించి
మాతృవందనము త ♦ న్మానితాశీర్వాద
మొంది నైశ్యాధ్యు నా ♦ నంద మెనసి
బహుమంత్రిపూర్వక ♦ పరిహారణంబులు మూతిఁ
మంతంబులై కనం ♦ బడి వెలుంగ
ననఘుఁడై రంజిల్లు ♦ సునయుఁ డప్విధమునఁ
బొలిచిన వారి న ♦ వ్వురజనమ్ము
నలరి శత్రుల గెల్చి మీ ♦ రతిరయమున
రావలయు నని దీవింప ♦ భావజారి
కవచసామర్థ్యయుక్తవి ♦ క్రిమధురీణుఁ
డైన భిదాభియు వచ్చోళ ♦ హర్ష మెసఁగ. 87

శా. దార్ఘిష్ఠప్రతిఘాతిఘాతవిధిసం ♦ ధానోన్మనీషామహా
శ్లాఘామోఘజవప్రభావవిలస ♦ చ్ఛౌర్యంబునన్ స్వీయధా
రాఘోట్టాణము నెక్కి దివ్యబలధా ♦ రంధర్యధుర్యుండునై
మేఘాడంబరశంబనిస్వనసమౌ ♦ స్మిలదిివారంభుఁడై. 88

క. వినయంబుతోడ సునయుఁడు
ఘనతరకాంభోజఘోటకము నెక్కి యశో
ధనుఁడై తగుభదాభియువు
వెనుకొని మును రాఁగదివ్య ♦ విభవం బలరన్. 89

వ. ఇట్లు త్వరితగతిం జనుదెంచి. 90

సీ. అశరీత బాభిహృణం ♦ బజ్ఞాతపార్థివం
బవిదితార్యం బఖు ♦ ద్ధాంత్యవర్ణ
మాహృతధనధాన్య ♦ మాదరివత్కంఖాణ
మాస్థలస్థజబృంద ♦ మావిలూన

రథసంగ మాధ్వస్త • రథ్యాధరాజాత
మాభ్రమచ్ఛేకంబు • నావతద్ధ్వ
జవ్రజం బాభిన్న • సౌధాగ్రమాగళ
త్తోరణం బాకృత్త • దుందుభి యును
గళితపట్టణము నరాజ • కంబు నప్ర
ధాన మావర్జితపదాతి • మాన మగుచు
దుర్హృదపహృతశేషవ • స్తువులు నిటుల
గాసిఁ జెంది కనం బడఁ • గనికరమున. 91

శా. కంటే మత్సఖ యస్మదీయపితృసో • త్క్రాంతాఖిలశ్రీపురీ
లుంటాకప్రకటప్రతాపమున నీ • లోకంబు గావించి పె
న్బంటై హేమరథుండు నోఁ గలఁడె మ • ద్బాణానలజ్వాల లో
క్కంటం జేయుచుఁ దద్బలేంధనము వే • గన్ మండఁ గాఁ జేసెదన్. 92

క. వనజాప్తతురగ మేగతిఁ, జను నాగతి నామనోజ్ఞ • జవనాశ్వము వే
చను నీవు ను నావెంబడిఁ, జనుదెంచితి వేని నాకు • సంభ్రమ మలరున్.

వ. ఇవ్విధంబున బరవసంబుఁ జేసి జయబిరుదభేరికాభాంకారాదుల నిగుడిం
పుచుఁ బోవు మాగధసైన్యంబును యోజనమాత్రఁ గూడ ముట్టి. 94

శా. స్వోధానఘ్యన్చిరత్నరత్నమయమే • రూద్యద్ధనుశ్శింజినీ
గాధాకర్షణ మాచరింప నది యా • కల్పాంతభూభైరవ
ప్రౌఢధ్వానము నై తగన్ శ్రవణమా • త్రప్రత్యవస్థాత్మసం
రీధాలజ్జితవేపమానతనునా • రీగర్భనిర్భేద మై. 95

గీ. అమ్మహానినాద • మఖిలభీతిప్రదం
బయ్యె రిపు లగుండె • లావలించెఁ
గొంతవడికిఁ దెలివి • గూడంగ రిపుసైన్య
మొక్కమొగిని గవిసెఁ • బిక్కటిల్లి. 96

వ. అట్లు గవిసిన నక్కుమారకంఠీరవుండు మనోవేగంబు గల నిజతురంగంబు
ను దత్సైన్యంబునకు వలయాకారంబు గాఁ బరపి ద్యావాభూము లదర
నార్చి నిలు నిలు మని యదల్చి తన ధనుర్విద్యాభ్యాసపాటవంబు నొక్కిం
చుక చూపం దలంచి లాఘవలక్ష్యదృఢత్వశుద్ధిదనరఁ బ్రళయాభ్రవిభ్రమర

జాదభ్రనిరర్గళ నిర్గళన్నిఘాతపాతనంబుల ననుకరించు మార్గణగణాసారం బుఁ బరగింపుచు శత్రుసేనారణ్యంబు ప్రాగవాక్ప్రత్యగుదగ్దిగ్భాగంబు తేర్పడ ఘంటాపథంబుఁ గావించి యాహవదోహలం బగు తనవాహనంబు మెరయ నిర్వక్రవిక్రమక్రమంబు నెరపుచు నెక్కుడం జూడ నక్కుడం దాన యై యెరికి నెదురింపరాక యెదురించినవారి నొక్కకోలను నొక్కనిఁ బెక్కుకోలలం గూలించి కేలిసలుపుచు నప్పటప్పటికి జ్యానాదంబు నిగుడింపుచు లస్తకంబున నుభయకోటుల బెడిదంపు టంపవెల్లి నిగుడింపుచు నెదిరి నిల్చుపగరఁ బద గుల్ఫ జంఘా జా నూరు మధ్య తుంద వక్షః కంఠ శిరంబులఁ గత్తులఁ బచ్చడి సేయు చందంబు నొందించి చతురంగ బలములఁ దునియలు పరియలు గుదులు నై బడలుపడ నడచినఁ గూలి యు వ్రాలి యుఁ జచ్చి యు విచ్చి యుఁ గెడసి యు మడసి యుఁ జెల్లి యు డొల్లి యు దొరసి యు విరిసి యు వెరచి యు నుండ మెఱుఁగు మెఱసిన తెఱంగునఁ గొఱవిఁ ద్రిప్పిన చందంబునఁ గార్చిచ్చు బొదివిన చాడ్పున నింద్రజాలంబుఁ జూపిన యేపున మాయఁ గావించిన పగిది మంత్రించి వడనైచిన గతి విపక్షబలంబును గనుపుగొట్టఁ గనిమసంగి ప్రళయసమయసమారంభసంరంభజృంభమాణవరాశాంభవీనిటలతటస్ఫుటితకీలికలాపం బనం దనరి యమ్మహాత్ముండు మందస్మితవదనారవిందుం డై. 97

శా. పూజ్యప్రాజ్యవిభావిభాకరము లై ♦ పుంఖానుపుంఖంబు లై
సజ్యేష్వాససముత్థితంబు లగు నా ♦ శస్త్రంబులన్ సంప్రహా
రేజ్యన్ వర్తిలు శత్రుసంచయములన్ ♦ హింసించి తద్రక్తపూ
రాజ్యేద్ధార్చిరవక్రవిక్రమశిఖన్ ♦ హర్షంబు నొందింపుచున్ 98

చ. దుర మొనరింపు శాత్రవుల ♦ తోరను లై తగు మేను లెల్ల జ
ర్ఝరితము లై తలిర్చఁ గను ♦ సాయకముల్ పరగించి మించి దు
ర్భరతరశాతహేతుల న ♦ పాగవిరోధివరూథినీశభీ
కరకరపాదమస్తకని ♦ కాయములం దెగటార్చి పేర్చుచున్. 99

వ. మఱి యును. 100

ఉ. ఆశుగవేగతోమర గ ♦ దా సి పరశ్వధ కుంత చక్ర ది
వ్యాశుగ ముద్గ రాదినివ ♦ హంబుల మున్ నిగుడింపుచున్ ధనుః

కౌశల మేర్పడన్ భయద ♦ కాండము నొక్కటి నేర్చి సంగరా
ఖ్యాశభటాళి మీఁదఁ దెగఁ ♦ బాపె వణిక్సుతుఁ డిచ్చ మెచ్చఁగన్. 101
చ. పొదిఁ దగు కోలఁ బూనుట ది ♦ పొందు గ వింట ఘటించు టంతలో
చెదిరిన మార్బలంబుపయి ♦ నేయుట హా రనిలోనఁ గూలుట
మ్మదవదరాతిభంజనుని ♦ మానస మొక్కట టెఱుంగుఁ గాక వా
ని దురముఁ జేయు నేరుపు ఫ ♦ ణిపప్రభు లైన వశం బె యెన్నఁగన్.
గీ. పది యు నైదు రెండు ♦ పరఁగంగ నొక్కటి
యెదురు లేని కోల ♦ లేర్చి రిపులఁ
బదిపదులను వేయి ♦ పదిసహస్రంబుల
లక్షఁ దునుము హస్త ♦ లాఘవమున. 103
వ. అట్టి యెడ. 104
ఉ. ఈసున శత్రుసైన్యము ల ♦ నేకము లై తగుసైనికోత్తముల్
బాసట లై మెలంగఁ బటు ♦ భల్లసమూహములు ల్లసిల్లఁ గా
వేసి యు డాసి యున్ సరగ ♦ విచ్చి యు నొచ్చి యు మత్సరంబుతో
గాసి దలిర్ప నిప్పగిదిఁ ♦ గయ్యము దయ్య మెఱుంగఁ జేసినన్. 105
చ. అనువు గ వారు బట్టిన శ ♦ రాసనబాణకృపాణతూణముల్
తునుకలు గాఁ గ బెట్టిదపు ♦ తూపుల నేయుచు వారిమర్మముల్
దునిమి తదంగకంబులను ♦ దూరఁ గ ఘోరతరాశుగంబులన్
జొనుపుచు రక్తపూరములు ♦ జొబ్బిలఁ జేయుచుఁ గౌతుకంబునన్. 106
క. గంధేభగమనుఁ డరిని
ర్గంధన మొనరించి కార్ము ♦ క ప్రోద్ఘుష్టగో
గంధనసఖవిశిఖశిఖా
సంధానితము గ నొనర్చెఁ ♦ జతురిమ మెరయన్. 107
వ. అప్పుడమ్మగధబలంబులు. 108
చ. తమ తమ దర్ప మేర్పడ ము ♦ దంబునఁ గోత్తలఁ జేసి సంభ్రమ
భ్రమితమదేభఘోటభట ♦ పఙ్క్తుల నేరుపుచేఁ బ్రచక్రసూ
ద్యమ మలరంగఁ జేయుచు య ♦ థావిధి గా మొన లేర్పరించి భూ
రమణునితోడ శత్రులు దు ♦ రం బొనరించిరి పేరు పాడుచున్. 109

గీ. అట్టి సమరంబుఁ జూచి వై ♦ శ్యాగ్రగణ్యు
సుతుఁడు భద్రాయుఁ గనుచు నో ♦ శూరవర్య
ఘనగదాయుద్ధనైపుణి ♦ గలదు నాకుఁ
జూడు మని వాహనము డిగ్గి ♦ స్ఫురణ దనర. 110

ఉ. దండధరప్రచండతర ♦ దండసమానము నైన పెన్గదా
దండముఁ గేలఁ బూని భుజ ♦ దర్ప మెలర్ప నిజాంగకప్రభా
మండల మానదేశమున ♦ మార్బలముల్ గని భీతిఁ జెంద ను
ద్దండపటుత్వ మొప్పఁ బ్రవి ♦ దారణభూమినిఁ బొల్చి నిల్చినన్. 111

క. కని మగధాధీశ్వరమి
త్రనివహమధ్యమున శూర ♦ ధన్యుం డనువాఁ
డనుపమబలదర్పుఁడుతన
జనపతి కింపు గను గద వె ♦ సం గొని వచ్చెన్. 112

వ. ఇట్లు వచ్చి యవ్వైశ్యనందనున కభిముఖుం డై. 113

మ. సమదాటోపత వార లిర్వురు జయే ♦ చ్ఛం బోరుచో మండల
భ్రమణంబుల్ బటుసింహచంక్రమణముల్ ♦ పాటిల్ల నుద్యద్గదా
సమిదారంభవిజృంభితోభయగదా ♦ సవ్యాపసవ్యప్రహా
రములం జప్పుడు లుప్పతిల్ల భయదా ♦ రావంబునం బోరుచున్. 114

వ. మఱియు హరిగతి గజగతి వ్యాఘ్రగతి మహిషగతి జంబుకగతి మర్కటగతి మార్జాలగతి హరిణగతి చటకగతి తాండవగతి మొదలగు ద్వాదశగతులు జూపుచు భ్రాంతంబు నావృతంబు నావిద్ధంబు నాహితంబు ను విభ్రమణంబు ను మానుషంబు ను నిర్మర్యాదంబు ను జిత్రకంబు ను భిన్నంబు ను సవ్యకరంబు ను దుంగబాహువు నాపృష్ఠప్రహారంబు వేల్లితంబు ను గుంచితంబు ను స్వస్తికంబు ను మొద లగు ద్వాత్రింశత్ప్రకారంబులఁ బచరింపుచు.

చ. మొనలు గనుంగొనం గదలు ♦ ముప్పిరి గాఁ గదియం గఁ జుట్టు నె
మ్మనములఁ గోపముల్ గదుర ♦ మర్మవిభేదన మాచరించు నే
ర్పున బహుచిత్రమార్గముల ♦ మూఁపులు వీఁపులు మోది మోది తెం
పొనరఁ గ సేదఁ దీర్చుకొన ♦ నోపని వైపున నేపుఁ జూపుచున్. 116

శా. పాదద్వంద్వసమాహతిం గరము భూ • భాగంబు గంపింప శే
షాదుల్ తద్భర మాని ఖేదమున ని • ర్వ్యాపారు లై యుండఁ బెన్
వేదండంబులు సింహముల్ శరభముల్ • ద్వీపుల్ మహోక్షంబులున్
భేదం బించుక లేక పోరుగతి ని • ర్భీతిన్ విజృంభించుచున్. 117

మ. ధ్వజినుల్ భీతి వహింప వైశ్యసుతుఁడు • త్త్రాలప్రఖేలద్గదన్
నిజదోర్మండలమండనాచరితమా • ణిక్యప్రభల్ మించ నా
వృజినాదాననిదానశాత్రవుని పై • స్వీపుల్ శిరోధిస్థలిన్
భుజముల్ వ్రేసె ఫెడిల్ ఫెడిల్లను రవం • బుల్ పిక్కటిల్లన్ వడిన్.

వ. ఇవ్విధంబున. 119

మ. చలవాదం బలరన్ స్వసంభృతగదా • సంఘట్టనప్రోజ్జ్వల
జ్వలనజ్వాలభవస్ఫులింగములచే • సంగ్రామరంగస్థల
స్థలదుర్ద్వేషణు లొక్కపెట్టునఁ గలం • గం బారఁ దద్గాత్రముల్
శలభాభంబుల జేసి కాల్చి నటన • స్థానంబు నొందించినన్. 120

క. ఇనతనయుఁ డివ్విధంబునఁ
దననెచ్చెలి యైన వైశ్య • తనయుఁడు బోరన్
గని నీవు విశ్రమింపుము
ననుఁ గనుఁగొను యుద్ధ మిపుడొ • నర్చెద ననుచున్. 121

ఉ. చండతరప్రభావిభవ • శాతశరంబుల నేర్చి పేర్చి దో
ర్మండలఖండలీకరణ • మండితచాపలతావిశేషుఁ డై
ఖండనభూమి శాత్రవుల • భల్లములం దెగటార్చి యార్చె నా
ఖండలదివ్యముఖ్యులు స • కౌతుకమానసు లై కనుంగొనన్. 122

వ. అట్టి సమయంబున భీషణహేషావిశేషరంగదుత్తుంగతరంగసన్నిభంబు లగు తురంగంబులు ఘీంకారభయంకరచతుర్దంతకాంతంబు లగు దంతావళంబులు దీర్ఘఘుర్ఘురనినదావక్రచక్రసుందరంబు లగు స్యందనంబులు చటులాయుధపటలసముద్భటు లగు వీరభటులు ను నిజాధిపతిపనుపున నడువఁ దచ్చతురంగబలపదాఘాతలసద్భూతప్రభూతధూళిపిహితకాంతి గలిగి మార్తాండమండలంబు కళలఁ దొలంగ విశ్వవిశ్వంభరాతలంబు తద్రజోమయం బై యుండఁ బ్రతిపదవాద్యమానోద్యద్భేరీపటహఢక్కాశంఖకాహ

శాదులు మ్రోయఁ దత్పరాగభరంబున మునింగి యొకరొకరి నెఱుంగక పేరెలుఁగుల మెలంగుచుఁ గనకమణిమయంబు లగు తమతమధ్వజంబులు మెరయఁ గూటయుద్ధంబునకుఁ జొచ్చి భిండివాల మండలాగ్ర భల్ల నారాచ రోహణ నఖర వ్రముష్టి ముద్గర శూల ముసల భుసుండిక ప్రాస ప్రకూర్మ కంపన గదా గదా యోద్దండ కణయ కుంత పరశు చక్ర పరిఘ పట్టిసంబులను పంకిణి సబళంబులను సెలకట్టెలఁ జిఱుతచయమ్ముల గొరకలు సురియలు మొదలగు బహువిధాయుధంబులు నారాజకుమారుం గప్పుచుఁ గదియం గనుంగొని. 123

క. ఆరథికులలో నొక్కమ
హారథుఁ డెదుట న్వసింప ♦ నతిజవమున నా
త్మారూఢహయము డిగి కరు
డారయమునఁ దద్రథంబు ♦ నందుచుఁ గడిమిన్ 124

గీ. సునిశితాస్త్రంబుచే వాని ♦ సూతుఁ దునిమి
తద్రథికు శిర మొక్క శ ♦ స్త్రమున నరికి
తా మహారథుఁ డై యుండ ♦ తనదుసఖుని
సారథిఁ గఁ జేసిపరశరా ♦ సనముఁ బూని. 125

వ. అట్టి యెడ. 126

ఉ. దారుణవృత్తి మాగధులు ♦ దగ్రత నారథికాధ్యు తేరు దాఁ
గేరుచు వచ్చి హెచ్చి యిరు ♦ ప్రేవలఁ గ్రిందను వెన్క ముందరన్
నేరుపు మీఱ నిల్చి యతి ♦ నిష్ఠురశస్త్రము లేసి రుజ్జ్వల
ద్వారిధరంబు లొక్క మొగి ♦ వారికణంబులు రాల్చు కైవడిన్. 127

వ. ఇట్లు గదిసినం గనుంగొని. 128

సీ. ఆమహారథికుండు ♦ వామదక్షిణపాద
జలజముల్ సవ్యాప ♦ సవ్యములు గ
సాచి పార్శ్వద్వయీ ♦ సంచరద్వంచక
శూరవర్యుల ముందు ♦ స్రుక్కఁ జేసి
సమము గాఁ బదపద్మ ♦ యమళంబు నియమించి
చరమభాగస్థాసన్న ♦ వరుల నడఁచి

మంథానదండసం • భ్రమణంబు నొందించి
- యగ్రతస్సరసప • త్త్రాళిఁ గలఁచి
యంఘ్రిసరసీరుహములు నా • యామములు గఁ
జేసి తన తేరిక్రిందటఁ • జెలఁగుచున్న
బలువిరోధివరూధినీ • ప్రభులఁ ద్రోలె
భూరిశరములచేత న • ద్భుతనియతిని. 129

క. సమిదధికబ్రితాల్యాలీ
ఢము నాలీఢంబు మును గ • డల్కొను చుండన్
సమపాదమండమండల
కమనీయస్థానపంచ • కంబునఁ బోరెన్. 130

వ. అప్పుడు. 131

ఉ. కొందల మంద కప్పగర • కూటువ కూటవిధంబు ద్రోవఁ గా
నందడి గాఁగఁ గూడి శర • జాలములన్ నిగుడించి మించ నా
నందడికయ్య మియ్యకొని • శౌర్యధురంధరుఁ డైన రాట్సుతుం
డెందు నుజూడఁ దా నగుచు • నేపడచెన్ రిపుకోటి నయ్యెడన్. 132

వ. మఱియును. 133

చ. సొగ నగు కెంపు సొంపు గల • చూపులఁ బుట్టిన కోపవహ్ని కొం
బొగ లెగయం గ రౌద్రరస • పూజ్యతరాజ్యము చేతఁ బై పయిన్
నిగుడఁ గఁ జేసి యీసునన • నీకచరారుల మీఁద దీపితా
శుగ మరిఁ బోసి రోయ నది • నూరెల ముట్టి దహించె వ్రేల్మిడిన్. 134

ఉ. ముక్కులుఁ జెక్కులుం జెవులు • మూపులు వీఁపులు జాను జంఘముల్
ప్రక్కలు డొక్కలుం దలలు • ఫాలతలంబులురంబు లూరువుల్
వెక్కసమా టొనర్చు శర • వేగ మెలర్పఁ గఁ జక్కు చక్కు గాఁ
జెక్కుచు నుక్కడంచె రిపు • సేనల గ్రక్కున నుక్కు మీఱఁ గన్. 135

వ. ఇవ్విధంబున నయోధ్యవరుండు లయకాలకాలగళాభీలాలికకీలికీలాకలాపంబు మెరసిన తెఱంగునఁ గాండప్రకాండంబుల నిగుడింపుచు నిజబలంబులఁ గనిమసంగినం జూచి కోపాటోపంబున హేమరథుండగ్గరి. 136

మ. విలసచ్చాపవిలాసకౌశలసమా • విర్భూతతేజంబుతో
బలవద్బాణపరంపరల్ గురియఁ ద • ద్బాణంబు లావ్యోమభూ
తలమార్గంబులఁ బర్విపైరిచయసం • తానంబునం బొల్చి యు
జ్జ్వలుఁ డౌ రాట్సుతుపై వయి న్నిగుడె గీ • ర్వాణోత్తముల్ భీతిలన్. 137
వ. ఇట్లు నిగిడిన. 138
సీ. అమ్మహావీరాఢ్యుఁ • డాశీవిషాభంబు
లై హేమరథుఁ డేయు • నస్త్రములను
దిలలంత లైపోవఁ • దీవ్రాశుగంబులఁ
బరఁగించి తచ్ఛత్రు • బలము లెల్ల
జర్ఝరితాంగు లై • సమరవిద్రావంబు
నొందంగఁ గుందించి • డిందుపరచి
చండశుండాకాండ • హిండితాంచితభుజా
దండకుండలితకో. • దండ మలర
సరసకరపద్మసవ్యాప • సవ్యముక్త
నిబిడనిశితశిలీముఖ • నికరములను
సమరసమయసముద్భూత • సాహసప్ర
తాపదీపితుఁ డైరణ • స్థలి నిగుడ్చె. 139
వ. ఇట్లు నిగుడించి వేఁడిమిఁ జూపిన. 140
మ. జ్వలనాస్త్రంబ రి వోసి హేమరథుఁ డా • శర్వప్రసాదోజ్జ్వల
ద్బలవద్వర్మమహాప్రభావుఁ డగు నా • భద్రాయుపై నేయఁది
కుల్ నిండం బెనుమంట మింట నెగయన్ • ఘోరస్ఫులింగావళుల్
గలయం బర్వఁ జిటచ్ఛిటార్భటులు ము • న్గనప్పట్టఁ గా వచ్చినన్. 141
సీ. ధళధళదీప్తిసం • ధానాచిరత్రభా
దూరస్వగాఢాంధ • కార మగుచు
ఘుళఘుళధ్వానని • ర్గళితనిర్ఘాతా ప్తి
నాబధిరీకృతా • జాండ మగుచు
ఫెళఫెళస్వానగ • ర్భితనిర్భరార్భటుల్
స్తనితభీరూభవ • త్స్వర్గ మగుచు

గళగళన్నాదసం • కలితకూలంకషా
పూరితాకూపార • వారియగుచు
ఝుళఝుళస్వనభేదసం • జాతఘూత
వారిధారాళధారాను • కారిఘోర
వారివాహంబు జనియించు • వారిదాస్త్ర
మేసి భద్రాయుఁడనలాస్త్ర • మిలఁ గలంచె. 142

ఉ. భూధరబాణ మామగధ • భూధవుఁ డేసిన సర్వలోకసం
బాధకరంబు గాఁగ బహు • పర్వతరూపము దాల్చి యవ్వ డా
యోధనభూవిజృంభితబ • లోద్ధతరాట్సుతు మీఁదఁ బెన్శిలా
సాధనముల్ నిగుడ్చుచును • సత్వరవృత్తిఁ గడంగ నయ్యెడన్. 143

సీ. భద్రాయుఁ డంతదీ • ప్తంబై తలిర్చిన
దంభోళిశస్త్రము • ద్ధతి నిగుడ్ప
నధికోటిశతకోటి • రై తేజతస్వీయ
ధారాప్రభాధాళ • ధళ్య మెనయఁ
జటులమాగధసము • త్సృజితాస్త్రంబు పై
నిగుడి మున్నెన్నంట • తెగయు చుండ
గండశైలములతోఁ • గదియంగఁ దద్వర్ష
ములఁ దచ్ఛిలాదుల • ముం దుద్రుంచి
గిరుల దరులఁ దదుద్బుద్ధ • హరులఁ గిరులఁ
జరులఁ గరులఁ దదుద్యాన • తరుల విరుల
మూలహీనంబు లైపోవ • నేలఁ గలిపి
చనియె శత్రుచయంబులు • సంచలించ. 144

శా. బ్రహ్మాస్త్రం బరి వోసి యేసె నపు డా • ప్రత్యర్థినాథుండు నా
బ్రహ్మస్తంబముఖప్రపంచము భయ • భ్రాంతస్థితిం జెంద నా
జిహ్మప్రక్రమనైజసైన్యము నుతుల్ • సేయంగ సాక్షాత్పర
బ్రహ్మేశానవరప్రసాదుఁ డగు నా • భద్రాయుపై నల్కతోన్. 145

శా. ఆవేళన్ శివవర్మధారి యగు భ • ద్రాయుర్మహావీరుఁ డా
ద్యావాభూములు మూర్ఛిల న్నిగుడు బ్ర • హ్మాస్త్రంబుపై దోర్బలా

సావిర్భూతకుతూహలం బడరఁ బ్ర ♦ త్యస్త్రంబుచే దాని ని
ర్జీవం బై తనరం గఁ జేసె సుర లా ♦ శీర్వాదముల్ సేయఁ గన్. 145

సీ. ప్రబలమాగధుఁ డంత ♦ బహుళమాయోపేత
రాక్షసాస్త్రం బేయ ♦ రయము మీఱ
నది ఘోరశరభసిం ♦ హవ్యాఘ్రసూకర
ఖరవృకోష్ట్రతరక్షు ♦ ఖడ్గశల్య
ముఖమృగాకార మై ♦ నఖరదంష్ట్రాయుధం
బులు గల్గి నిజమాయ ♦ లలరుచుండఁ
దద్గాత్రముల బాధ ♦ దనరం గఁ జేయం గ
మఱియు దుష్టవిహంగ ♦ మార్గమునను
బక్షచంచూపుటాదుల ♦ భయమొనర్ప
వెండి యును జండరాక్షసా ♦ వేశములను
బడలిక నొనర్పఁ దలపోసి ♦ బహువిధముల
నడరుట యుఁ జూచి భద్రాయు ♦ డలుక గడిమి. 146

చ. చటులనిశాచరఘ్న మను ♦ సాయక మేసిన రాక్షసాశుగో
ద్భటవికటాస్యదైత్యసము ♦ దగ్రమహోగ్రమృగాండజాదిసం
ఘటనముఁ బాపి తచ్ఛరము ♦ ఖండిత మై పడఁ జేసి మాగధో
ద్భటబలశౌర్యముల్ దొలఁగ ♦ భల్లముల న్వడిఁ దూరుపెత్తినన్. 147

గీ. మగధదేశాధినాథుఁడు ♦ న్మత్తచిత్త
వృత్తితో నంధకారాస్త్ర ♦ మేయ నది యు
నలుదెసలఁ జీకటులుగప్ప ♦ బలసి రాజ
సుతునిపై రాఁ గ నమ్మహా ♦ శూరుఁడ పుడు. 148

క. సూరాస్త్రం బేసిన దు
ర్వారాఖర్వప్రభాభి ♦ రామం బగుచున్
భూరితమోమయ మగు త
ద్ఘోరాస్త్రము నుడిపెఁ దనదు ♦ గురుశక్తి దగన్. 149

వ. ఇవ్విధంబున. 150

క. అస్త్రప్రత్యస్త్రంబుల
నిస్త్రాణత నొంద వైరి • నిబ్బరపడ వా
క్యస్త్రవరబలంబున న
ర్థస్త్రీశ్వరవర్మమహిమ • దనరఁగ ననిలోన్. 151

వ. ఇటుల నిశ్చేష్టితుం జేసిన నమ్మగధేశ్వరుండు సకలయోధవర్యులం బురికొల్పుకొని తా నగ్రేసరుం డై రోదసీకుహరంబు గలఁగ సింహనాదంబులు జేయుచు భూరిభేరీరవంబులు చెలంగింపుచు శంఖకాహళంబు లొత్తుచు వేయుండు పొడువుండు పోనీకుం డని యార్పులు పెడబొబ్బలు నదల్పులు నింగి ముట్టం జేయుచుఁ బరిఘాదిసాధనంబు లడరింపుచుం గవిసినం గనుంగొని. 152

గీ. ఇటుల తను జుట్టుకొన్నట్టి • చటులశౌర్య
ధుర్యు లగు శాత్రవులఁ జూచి • ధైర్యశాలి
యైనభద్రాయు వతికరు • ణార్ద్రదృష్టి
దనర హింసింపఁ జాలక • తడయ కపుడు. 153

శా. అంభోజప్రభవాండముల్ వగుల మా • ద్యచ్ఛాత్రవాలంభసం
రంభారంభవిజృంభమాణవిలయా • భ్రధ్వానవద్భ్యాంరవ
స్తంభీభూతజలేంధనాగ్నిభయకృ • త్సప్తార్ణవారావకృ
చ్ఛుంభచ్ఛంఖము నొత్తె రాట్సుతుఁడు వి • స్ఫూర్జత్ప్రభావంబునన్. 154

సీ. అట్టి శంఖారావ • మాత్మహృత్పుటములు
భేదింప నత్యంత • భీతిఁ జెంది
ఘోటకరథరథ్య • కూబరాన్వితు లై వి
సంజ్ఞచే భూమిపైఁ • జచ్చినటుల
బడి మూర్ఛ నొందిన • పరఁగఁ గన్గొని దయా
యుత్వంబుతో నరి • జిత్వరుండు
వీతాస్త్రశస్త్రుల • విగతవాహనులను
నష్టచేతసులను • నయవిధిజ్ఞుఁ

డగుటచేఁ జంపరాదని ♦ యాత్మ నరసి
హర్ష మెసఁగ రథావరో ♦ హణ మొనర్చి
సునయుఁ గన్గొని పాశబం ♦ ధనము నొందు
సుజ్జనకునిఁ గనుంగొను ♦ మాన్యచరిత. 155

క. బలవంత మైన సర్పము
చలిచీమలచేత జిక్కి ♦ చందంబునఁ దా
బలవంతుఁ డయ్యు శాత్రవ
బలములచేఁ బడియె దైవ ♦ బలరహితుం డై. 156

గీ. అదియుఁ గావునఁ దొలిబాము ♦ లందుఁ జేయు
పాపపుణ్యము లనుభవిం ♦ పక తొలంగ
వెంతవారల కైన ము ♦ న్నిది నిజంబు
వీరివిడిపించు టే కీర్తి ♦ విభవ మెసఁగ. 157

వ. కావున నిజజనకుల బంధనంబులు విడువు మనిన నతం డట్లు జేయ. 158

క. బాధాసంయుతకన్యా
గోధనధాన్యాద్యబాల ♦ కుల ముందుగ సం
బాధంబు నొందకుండ య
శోధనుఁ డగు రాజసుతుఁడు ♦ సుఖులుగఁ జేసెన్. 159

గీ. మఱియుఁ దక్కిన బాంధవా ♦ మాత్యమిత్ర
భృత్యభటదాసికాదుల ♦ వేరు వేర
విడువ నియమించి క్షణమాత్ర ♦ వివశు లగుచు
మూర్ఛఁ దేరిన శాత్రవ ♦ ముఖము లరసి. 160

వ. వీరిని వధించ రాదని తలంచి. 161

మ. అవనీపాద్యవరోధకాంతల్గఁ దదీ ♦ యశ్వ మనోమారుతో
జ్జవవద్ఘోటకముల్ గిరీంద్రసదృశ ♦ స్తంబేరమంబుల్ సువ
ర్ణవిధానేకశతాంగముల్ సురుచిర ♦ ప్రాయస్థదాసీతతిన్
వివిధాలంకరణంబులం గొనుచు ను ♦ ద్వేగంబు వాటిల్లఁగన్. 162

మ. విరథుం డై తగినట్టి హేమరథు ని ♦ ర్వీర్యుండు నై యుండ దు
ర్భరపాశంబుల బద్ధుఁ జేయుచును ద ♦ త్ప్రాణప్రియామాత్యత

త్వరసేనాధిపనాయకావళిని ము • న్నర్థించి యమ్మంత్రి తో
నరుమంత్రీశుల దాపున న్నిలిపి యా • యుర్వీశపుత్త్రుం డొగిన్. 163
క. ఓమంత్రులార యిపు డీ
హేమరథాదులను గొనుచు • హితవర్తనతో
మీమీపురముల కరుగుఁడు
సామంతులతోడ ననిన • సంభ్రమ మలరన్. 164
చ. ప్రతిభటసంహతి న్మను ప • రాజితులై తగు మంత్రినాయక
వ్రతతులు యోధముఖ్యులు వి • పద్దశ లేక పునస్సజీవన
స్థితు లయి రాకుమారుని ను • తింపుచు విస్మయమానమానసా
న్వితు లయి వజ్రబాహు కడ • నిల్చి సమాహిత చిత్తవృత్తిచేన్. 165
సీ. ఓరాజ విను మిమ్మ • హారాజతనయుండు
భూమిఁ జూడఁ గ వచ్చి • పొదలు చున్న
యింద్రుఁడో చంద్రుఁడో • యినుఁడో యుపేంద్రుఁడో
తెలియంగ వలవ దీ • తెఱఁగు మనకు
మనమహాభాగ్యంబు • మనతపఃఫల మెన్న
నాశ్చర్య మయ్యె నీ • యవనిలోన
ధన్యుఁడై తగిన యీ • ధరణీశసుతునిచే
విజితులై రిపు లెల్ల • నెగడు వడిరి
చెలఁగి యితఁడు మహాయోగ • సిద్ధుఁ డేమొ
మఱి తపస్సిద్ధుఁడో లేక • సురవరుండొ
కానిచో నీయమానుష • కర్మ మితని
చే విజృంభించునా యింత • జెప్ప నేల. 166
గీ. ఇతని జననీజనకుల ము • న్నెన్ని చూడఁ
బార్వతీపరమేశ్వరు • లు ర్విలోన
నిమిషమాత్ర శతాక్షౌహి • ణీబలంబు
బలవదాశుగముల బడ • ల్పడ నడంచె 167
వ. అని బహువిధంబుల స్తోత్రంబు లొనరించి. 168

గీ. ఇవ్విధంబున నత్యంత • హృష్టులగుచు
మహామహైశ్వర్యసంయుతా • మాత్యవరులు
తోషమలరఁగ వరమహా • త్ముఁడ వటంచుఁ
బలుకుచుండంగ నమ్మహా • భాగుఁ డపుడు  169

సీ. విస్మయానందాను • విద్ధుఁ డానందాశ్రు
పిహితాక్షుఁడు సుప్రేమ • విహ్వలుండు
నై నట్టి జనకు న • భ్యర్ణ మాదటఁ జేరి
దండప్రణామముల్ • తగనొనర్ప
నారాజు ప్రణయాప్తి • నభివాదనముఁ జేసి
ధన్యుఁగఁ గని గాఢ • తరము గాఁగ
పరిరంభ మొనరించి • బంహిష్ఠహర్షంబు
నొనరంగ నిట్లను • నో కుమార
నుడువు దేవుఁడవో మను • ష్యుఁడవో లేక
హరుఁడవో పరమేష్ఠివో • హరివొ తలఁప
నీదు జననీజనకు లెవ్వ • రేది దేశ
మేది నీనామము వచింపు • మిద్ధచరిత.  170

వ. అది యునుం గాక.  171

సీ. ప్రత్యర్థివర్యసం • బద్ధులై విద్ధులై
హతతేజులై మృతు • లట్లయుండు
భీరూభవదమాత్య • భృత్యాదుల సపుత్ర
పత్నులుగా దయా • పరుఁడ వగుచు
విడిపించితివి మహా • వీర్య శౌర్యోజ్జ్వల
తేజోబలోన్నతుల్ • తేజరిల్ల
నీవిక్రమక్రమం • బెట్లు నీకు ఘటించె
మహిం సదేవాసుర • మానుషాత్మ
కైన లోకత్రయము గెల్వ • నలవుఁ జలము
గలుగఁ జాలిన నీవంటి • ఘనుని ఋణముఁ

దీర్చికొన లేను ధర సము • త్థితసహస్ర
జన్మముల నైన దివ్యతే • జఃప్రదీప్త. 172

సీ. తగు నిదంపుత్త్రమి • త్రికళత్రపూజ్యరా
జ్యపురం బనక సర్వ • మడర విడచి
ఘనమదీయాంతరం • గము నిచ్చ నీయంద
ప్రేమబంధంబునఁ బెనఁగఁ దలఁతు
ననఘవచోయుక్తి • ననువదింపుము నేఁడు
కడు మత్ప్రియంభావు • కుఁడవు నీవె
యలరు మదీయశు • ద్ధాంతకాంతల నెల్లఁ
ద్వదధీనతఁ జరింపఁ • దలఁతు నిపుడు
తవిలి నీవు జితేంద్రియ • త్వమున నునికి
దోఁచె నామదిఁ గాన సం • తోష మొదవె
సర్వము వచింపు నీవు న • న్నరయ్వహింపు
దేవుఁడవు గాక పరుఁడ వే • ధీరవర్య. 173

క. అని యివ్విధమున జనపతి
వినయంబునఁ బల్క-ధైర్య • వీర్యఘనుండ
జ్జనసుతుఁ డగు భద్రాయువు
ననువొందఁగ నిట్టు లనియె • నందఱు వినఁ గఁ. 174

సీ. ఇతఁడు వైశ్యసుతుండు • కుతలాధినాయక
సునయాఖ్య మత్సఖ • స్ఫూర్తిఁ బొందు
నే నితనింట మ దీయమాతృకతోడ
సతతంబు వర్తింతు • సౌఖ్యగరిమ
భద్రాయురాఖ్యచేఁ • బరఁగుచు విహరింతు
వెనుక వచింతు మ • ద్వృత్త మెల్లఁ
గారణంబున నిన్ను • గాసి నొందించిన
పరిపంథిబల మెల్ల • బడలువడిరె

మును సభృత్యసుహృన్మంత్రి ♦ ముఖుఁడ వగుచు
నిజపురంబుఁ బ్రవేశింపు ♦ నిర్భయము గ
శత్రుసాధ్వస మొకింత ♦ సరకుఁ గొనక
సమ్మదమ్మున వసియించు ♦ జనవరేణ్య. 175

మ. అది యుం గాక మదంచితాగమనప ♦ ర్యంతంబు దుర్బుద్ధిభా
జ్మదమత్తాఖిలశత్రుతాచరదధ ♦ ర్మప్రత్యనీకావళిన్
వదలం బోవక బంధనాలయములో ♦ వతింపఁ గాఁ జేయుము
ద్యదయప్రాప్తిని నేను బోయెద మదీ ♦ యాగారముం జేరఁగన్. 176

గీ. విశ్వజననాదిహేతుత్వ ♦ విభవ మొందు
నమ్మహేశ్వరు కరుణ నా ♦ యందుఁ గలదు
గాన శాత్రవులఁ దృణాయ ♦ మానము గను
జేయఁ జాలిన నేఁ గల్గఁ ♦ జింతవలదు. 177

మ. అని యీరీతిని బల్కి యానృపతిము ♦ ఖ్యాజ్ఞప్తిఁ జెన్నొంది సం
జనితానంద మమంద మై నిగుడ సౌ ♦ జన్యాత్మ భద్రాయుఁడా
త్మనిశాంతంబున కేగి తత్ప్రధనవృ ♦ త్తాంతంబు నాద్యంత మై
తనరం దల్లికి వైశ్యవర్యునికి మో ♦ దం బేర్పడం జెప్పినన్. 178

మ. దయతోడం జనయిత్రి యాత్మజుని మూ ♦ ర్ధఘ్రాణ మామోదనో
దయదాలింగన మశ్రుపాతనము మో ♦ దంబొప్పఁ జెన్నొంది త
జ్జయవద్వైశ్యుఁడు రాజపుత్త్రునిఁ బరి ♦ ష్వంగంబునం జేర్చి ని
ర్భయవృత్తిన్ వసియించె నానృపుని సం ♦ భావింపుచు న్నిచ్చలున్. 179

సీ. ఆవజ్రబాహుండ ♦ నాహతోత్సాహసం
రూఢుఁడై నైజావ ♦ రోధయువతి
పుత్త్రమిత్త్రామాత్య ♦ భూరిబలాన్వితుఁ
డగుచు నవిచ్ఛిన్న ♦ హర్ష మొంది
సమరహతావళి ♦ ష్టవదాతితురగమా
తంగశతాంగాది ♦ తతులు గొలువ
నరివరాపహృతార్థ ♦ సరణిఁ బునఃపున
స్స్వీకారపూరితా ♦ నేకశోక

భారసహితుం డగుచుఁ బటు ♦ పటహభేరి
కానినాదంబు లొలయంగఁ ♦ గౌతుకాత్త
చిత్త మిగు రొత్త నిజపురి ♦ శ్రీసమృద్ధిఁ
బొలుచు భద్రాసనంబుపై ♦ వెలయుచుండె.

వ. తదనంతరంబ. 180

క. నిరుపమతేజుఁడు సాత్త్వా
త్పరశివుఁ డగు ఋషభయోగి ♦ భక్తుండు ప్రియం
కరుఁడగు భద్రాయువునకు
నిరవొందఁగఁ బెండ్లి సేయ ♦ నిది తరియనుచున్. 181

మ. శతమన్యుప్రభుతావిలాసుఁడు మహై ♦ శ్వర్యుండు సీమంతినీ
సతి కిష్టస్థితి భర్తయై వెలయు నా ♦ చంద్రాంగదాధీశు స
మ్మతుఁడై కన్గొనితత్సపర్యలకు సం ♦ భావించి భద్రాయురు
న్నతి సౌందర్యపరాక్రమక్రమము వి ♦ న్నాణంబు గాఁ జెప్పుచున్. 182

వ. నరేంద్రా యమ్మహానుభావుం డశేషనరపతిశిరస్సమభ్యర్చితశాసనుండై పాకశాసనుండనఁదగుఁగరతలోపలక్ష్యమాణశంఖచక్రలాంఛనుండై చక్రధరుం డనఁ దగు నిర్జితమన్మథుండై హరుఁడనఁ దగు విమానాహితరాజహంసమండలుండై కమలసంభవుం డనఁ దగు లక్ష్మీజనకుండై సముద్రుం డనఁ దగు ననవరతప్రవృత్తదానార్ద్రీకృతకరకమలుండై దిగ్గజం బనఁ దగు మహైశ్వర్యంబులకుఁ గర్త సకలశాస్త్రంబుల కాదర్శంబు మిత్రమండలంబున కుదయశైలం బహితజనంబుల కుత్పాతహేతువు వినతానందజనకుండై వైనతేయుం డనఁ దగుఁ గావున నతని జన్మప్రకారంబు తెలియం జెప్పెద నాకర్ణింపుము. 183

సీ. అధిప దశార్ణదే ♦ శాధినాథుఁడు వజ్ర
బాహుం డనెడు నొక్క ♦ పార్థివుండు
తగు పుత్త్రసంయుక్త ♦ దారరత్నంబును
రోగపీడిత యని ♦ రోసి విడచె
విడచిన నారాద ♦ వెలఁదికి నుదయించు
తనయుండు నావల ♦ నను సుమస్త

విద్య లెఱింగి సం ♦ విద్రుపుఁ డైనట్టి
శివుని వగ్మమునఁ బ్ర ♦ సిద్ధి జెంది
ద్వాదశసహస్రగజబలో ♦ దాత్తుఁ డగుచుఁ
దనరు పితృసంకటముఁ బాపి ♦ ధన్యుఁ డైన
యొక్క వైశ్యునిపురములో ♦ నున్నవాఁడు
కాన నీపుత్త్రికనుగుణుం ♦ డైనవాఁడు. 184

గీ. రాజకన్యలలో ధన్య ♦ యై జగతిని
వెలయు నీసుత కమ్మహా ♦ వీరవరుఁడు
భర్త యై యనిక్క యోమహీ ♦ పాల నీదు
జన్మసాఫల్య మెంత ని ♦ సన్నుతింతు. 185

గీ. అతఁడు భద్రాయురాఖ్యచే ♦ నవనిఁ బరఁగు
నార్యనుత శీఘ్రము వివాహ ♦ కార్యమునకు
నిశ్చయించంగఁ దగు నని ♦ ఋషభయోగి
యమ్మహీపతి వీడ్కొని ♦ యతిరయమున. 186

సీ. శ్రీమంతుఁ డై మంత్ర ♦ సిద్ధిఁ బెం పొందిన
భద్రాయుఁ గనఁగ సం ♦ భ్రమ మెలర్ప
వచ్చిన యయ్యోగి ♦ వరుఁ గాంచి సాష్టాంగ
దండప్రణామంబు ♦ తగ నొనర్చి
ముకుళితహస్తుఁ డై ♦ మ్రోల నిల్చినఁ జూచి
నవ్వి గాఢాలింగ ♦ నం బొనర్చి
యోపుత్త్ర మగధదే ♦ శోదీర్ణబలముల
గెలచి వచ్చితె నీదు ♦ బలిమి కలిమి
నెంత వర్ణింతు వినుము భూ ♦ మీశ్వరాగ్ర
గణ్యచంద్రాంగదుని పుత్త్రి ♦ గలదు కీర్తి
మాలిని యనంగఁ దగు నది ♦ మాననీయ
నీవు పెండ్లాడ వలయు సూ ♦ నిక్కము గను. 187

గీ. అతఁడు నీకిచ్చుటకు మహా ♦ హర్ష మొందె
నీసఖుం డైన సునయుండు ♦ నీతిమంతుఁ

డితఁడు జని తత్సమాచార • మెఱిఁగి నీదు
కోరికె సఫలంబు గాఁ జేయుఁ • గుతుకమునను. 188

వ. అని తచ్ఛరీరంబు నిజహస్తసారసంబున స్పృశించి దీవించి యానుసయునికి
సకలలోకకన్యాభిజ్ఞానంబు దెలియ వరం బిచ్చి నిజనివాసంబునకుం జనియెఁ
దదనంతరంబ. 189

సీ. ధారాలసితవారి • ధారాలసితనరా
ధారాలసితహంస • వార మగుచు
సదననిర్యత్సదా • సదనమానసదురా
సదనవార్తికవిద్యు • దుదయ మగుచు
భావజరితహావ • భావపల్లవికాధి
భావకృత్సనితపుం • భావ మగుచు
హాలహాలేత్యనులాప • హాలవిలాసభృతిదో
హాలభుజాబలకృషీ • వలము నగుచు
దేదివద్ధాతుభూతలో • త్థితలతాగ్ర
వితతనీపదనీపనీ • పతదసమకు
సుమసముద్గీర్ణఘుమఘుమ • త్సురభిభూత
లంబు దగ నంబుదాడంబ • రంబు దోఁచె. 190

మ. పలుతాపంబున నాపసోపములు జూ • పట్టంగ నిట్టట్టు గా
నలసెం బంటవలంతి దీని కిఁక నై • త్యప్రక్రియల్ జేయఁ గా
వలె నంచుఁ ఘనుఁ డంత వృష్టిజనిత • వ్యాపారముల్ జేయఁ గాఁ
బులకల్ మేన జనించి మించె ననముక్ • బొల్చెం దృణాంకూరముల్. 191

చ. సికతిలభూముఖస్థలుల • జెందుచు ముందు వివిక్తరక్తకీ
టకము లసహ్యతాపవిలు • ఠన్మహి తత్సమయుండు పొందుఁ బా
యక గిలిగింతఁ గొల్పఁ దరు • ణారుణదీధితిమత్ప్రవాళపా
లికల సరుల్ ఘటించె నన • లీలఁ గనం దనరారె నత్తఱిన్ 192

చ. ముసిముసిమబ్బున న్మెరయు • ముత్తె పుఁబెత్తు లనం దృణాంతసం
వసదురుశీకరంబు లన • వద్యతదంతరకీలితంబు లై

మిసిమి పసిండికెంపు లన • మించు మెఱుంగుపురుంగు లొప్పె నా
సని గలచోట గాటము గఁ • జాలువుపానలు లేని వేళలన్. 193

మ. వినుతప్రాప్తయథాక్రమస్తనిత యై • విద్యుల్లతామూర్తి యై
తనుమార్గాగతవృత్తిమచ్ఛ్వసన యై • ధారాప్రవాహైక యై
కనదుత్తుంగపయోధరోల్లసన యై • కమ్రాంబరోపేత యై
ఘనసంగంబున వృష్టి జూడఁ దగె లో • కంబున్ మది న్మెచ్చఁ గన్ 194

క. అహమహమికావివాదం
బహరహ మా స్తనితవిద్యు • దంబునికరస,
న్నహనములకు రా వర్షము
తహతహ నొందించె సకల • ధరణుల నేలన్ 195

మ. అలరున్ జానపదస్థలంబులు సము • ద్యద్బాష్పధూమాలయో
జ్జ్వలదాచ్ఛాదనముల్ నిరంతరజలా • సారంబునన్ సందునం
దుల ధూమాంకురముల్ జనించి మునుముం • దుం జారుధారాకరం
బులు గాఁ దజ్జరరంబు లంబుధము లై • భూమిం దివిం జేయఁగన్. 196

సీ. ప్రతిపదాదర్శాను • మితవర్తులాద్యంత
రంబు లై రుచిరగ • ర్తంబు లలర
సర్వతస్స్థాపితా • ఖర్వదుర్వర్ణపా
త్రంబు లై పద్మాక • రంబు లలర
పరితస్సమర్పిత • స్థిరదుకూలాచ్ఛాద
నంబులై తటినీగ • ణంబు లలర
విష్వక్పరిక్రియా • విర్భూతతారహా
రంబు లై కుల్యాది • కంబు లలర
పంటవలఁతి యనెడి వాలు • గంటితోడ
మింటితెరువరి దంటవా • ల్గంటి నంటి
నంట కుండిన నివి యెల్ల • నొంటి యుండెఁ
దెలియ వచియింప నలవి యౌ • నలువ కైన. 197

వ. తదనంతరంబ, 198

సీ. కలితప్రకాశసం ♦ ఘాతంబు వేయంగఁ
గలహంసకస్వర ♦ ద్గతులుఁ దనర
బటుతరరజతకుం ♦ భపయోధరము లొప్ప
ధవళాంబరము ధళ ♦ ధళ నెలుంగ
వేణీప్రదేశంబు ♦ విశద మ్మై కనుపట్టఁ
జంద్రరేఖావిలా ♦ సంబు దోప
నరలోచనముల కా ♦ నందంబు ఘటియింపఁ
దారాళి నిర్మల ♦ త్వంబు నొంద
శాలిసుకృతఫలమహోక్ష ♦ మాలికాళ
యంబు విలసిల్ల గాఁ బ్రవీ ♦ ణాశుకవిల
సితనినాదంబు లదర నా ♦ శ్వినపువాస
రంబునను వీఁక శరదాగ ♦ మంబు దోఁచె. 199

మ. హరి క్షీరాంబుధి నిద్రితుం డగుట చో ♦ ద్యం బెట్ల నన్వైద్యశా
స్త్రరహస్యం బతఁ డేర్పడం దెలసెఁ ద ♦ త్కాలోపభోగ్యస్థితిం
జొరలే వన్యము లైన రోగము లటం ♦ దుం లేనిచో శేషసా
గర వైకుంఠముఖప్రముఖ్యసురలో ♦ కంబుల్ దగన్ దేవాకో. 200

వ. తదనంతరంబు. 201

సీ. ఇందూపలాగార ♦ బందీసమాచార
మంబుప్లవోచ్చార ♦ ణాపవాద
ముద్యానయానప్ర ♦ యోగభాగవిలాస
మైందవాతపసేవ ♦ నాప్రసక్తి
పన్నీరగంధసం ♦ బంధనిర్గంధంబు
కోమలవ్యజనవి ♦ శ్రామకరము
సరసాంబుజాతావ ♦ సానప్రకారంబు
ప్రత్యర్థిరచితప్ర ♦ పావిరహిత
మగుచు నెగ డొంది సేవంతి ♦ కాంతరాళ
హారిధారాళతుహినధా ♦ రావతార

మిళితనక్తందివస్రవ ♦ న్మిహిక మగుచు
వసుధఁ దుహినాగమోల్లస ♦ ద్వార మలరె. 202

చ. ఒనర నయోమయాంతరస ♦ ముజ్జ్వలితజ్వలనంబు గూడఁ బొ
ల్చిన ప్రవహంతికాగ్రములఁ ♦ జేతుల నిట్టటు విప్పుచుందు రా
జనము లదె ట్లనన్ హిమము ♦ సర్వజగంబుల నీవ లావలన్
బెనచు నటంచుఁ దెల్పుగతిఁ ♦ బేర్చిన యాహిమవాసరంబులన్. 203

మ. తనరెన్ సాంద్రతరాంతికానలలస ♦ ద్వాసోష్ణవాఃకుంభసం
జననం బిష్టఘనేష్టకోపచితవా ♦ సస్వాపనాట్యాప్రవ
ర్తననిర్నిద్రకళావతీకృతపరీ ♦ గంభస్పృహోద్యద్వయో
జన మాక్రందితదుర్గతాధ్వగవధూ ♦ జాతంబు సీతం బిలన్. 204

సీ. పాదంబులగ్నిలో ♦ పలఁ జాపఁ గాఁ జేయుఁ
బూని మున్నినునంత ♦ వాని నైనఁ
గరములు చల్లగాఁ ♦ దిరుగంగ నొనరించు
వసుధలో రాజంత ♦ వాని నైన
మే నెల్లఁ దెలిడాలు ♦ బూనఁ జేయఁ గనేర్చు
వహి సదాశివు నంత ♦ వాని నైన
నిలు వెల్ల గల్ల నై ♦ మెలఁగంగ నొనరించు
వరలు శ్రీహరి యంత ♦ వాని నైన
నితరు లన నెంత యీహిమ ♦ ప్రతతి కనుచుఁ
దనకు నిలయితవదనపా ♦ దముల విడచె
నగ్ని యటు గాక తక్కిన ♦ వన్ని యుండ
నది యుఁ జలి యొందు నని జను ♦ లందు రెపుడు. 205

వ. తదనంతరంబ. 206

సీ. విలసద్ఘనేష్టకా ♦ విరచితాంతర్గృహ
నిద్రాభిలాషితా ♦ నిరసనంబు
మేదురాగరుకుంకు ♦ మాదిసమ్మిశ్రిత
గంధిలాలేపని ♦ పాకసనంబు

సద్రిక్తమృగరోమ జప్రిచ్ఛదచ్ఛాద
నేచ్ఛావిచారణా ♦ హింసనంబు
స్థాపితాహార్నిశో ♦ ష్ణకదుష్ణవాఃకుంభ
సంభూతకాంతస్నాను ♦ శాసనంబు
తప్తకాంచనకనదవ ♦ ధ్వస్తశస్త
భూమధూమజ్వలనపరి ♦ స్ఫురణచరద
రోమయహసంతికాదిసం ♦ యోగజనిత
సుఖనికారణవృత్తి చే ♦ సొంపు దనరె. 207

సీ. సాంద్రచంద్రోపల ♦ స్థగితధారాధార
సౌధాగ్రకేళికా ♦ సౌఖ్యకరము
మహనీయహిమవారి ♦ మర్దితశ్రీగంధ
చర్చానుమోదప్ర ♦ సక్తిదాయి
సతతఘుమంఘుమ ♦ త్సౌరభోదీర్ణకా
సారహారివిహార ♦ కారణంబు
శీతలానిలజాల ♦ ధూతప్రసూనసం
వాసితోపవనప్ర ♦ వాససేవ
నాస్పదంబు ను జంద్రాత ♦ పాభిరామ
మందిరప్రాంగణాంభోజ ♦ మార్గణప్ర
ధనగతాన్యోన్యపరిరంభ ♦ జననసమ్మ
దావహం బై వెలయు చుం డె ♦ నట్టి యెడల. 208

ఉ. కాంతము పాంథలోకజయ ♦ కారణమారజనిప్రకారవృ
త్తాంతము భృంగసంభ్రమద ♦ దభ్రమదభ్రమదాభ్రదర్శనో
ద్భ్రాంతసమానమానసమ ♦ దప్రమదాపరిరంభశుంభదా
కాంతము నై వసంతసుము ♦ ఖంబు సుఖం బొనరించె నయ్యెడన్. 209

సీ. మాధవీమన్మథ ♦ మహిమచేఁ గనుపట్టి
యల సువర్ణసమేతుఁ ♦ డై తలిర్చి
విగతజీర్ణపలాశ ♦ వితతిచేఁ దనరారి
యతికామవాసత ♦ నమరి యుండి

కాంచనచ్ఛదకాంతిఁ ♦ గన్పడఁజూపట్టి
తాపింఛవర్ణవ౯ ♦ థను వహించి
వినతపున్నాగావ ♦ ననిరూఢిఁ జూపట్టి
సురసాలములచాయ ♦ సొంపునొంది
బహువిధాగమశిఖరసం ♦ వహనసహన
శుకపికస్వరసుస్వర ♦ శోభి యగుచు
మాధవుం డురుతరవనీ ♦ మాధవుండు
పొలిచె వనసంచయముల సం ♦ పూర్ణగతిని. 210

క. మలయు వలరాచ వానికిఁ
బలువిడిదలు గనను శ్వేత ♦ పటమంటపముల్
వెలయించె ననెడు పగిదిం
బొలుపుగఁ బుష్పితనికుంజ ♦ పుంజము లలరెన్. 211

సీ. మెలఁగు సహస్రార ♦ ముల బండ్ల నమరించి
కలువకాడల నిరు ♦ సులు గఁ జేసి
సొగసు నాళంబుల ♦ నొగలుగా సవరించి
పెలుచ గేదఁగిరేకు ♦ పలుకఁ జేసి
మంచి సంపెఁగపువ్వు ♦ మందిగం బొనరించి
పొగడమొగ్గల చీల ♦ లొగి నమర్చి
మేలు దానిమ్మల ♦ మేల్లల తామర
నూలుచే నేటులు ♦ గీలు కొల్పి
పువ్వుదేనియ కందెన ♦ పొలుపు జేసి
పగడముల తీగలను బల్పు ♦ లు గ నమర్చి
రాచిలుకలు ను గుఱ్ఱంబు ♦ లై చెలంగ
రాజహంసలు జులుమతీ ♦ తేజులు గను. 212

సీ అలుల మొత్తంబులు ♦ కలగానములు సేయఁ
గలసి కోవెలలు కా ♦ హళము లూద
సారసంబులు మృదం ♦ గారవంబులు సేయఁ
గలరవంబులు తాళ ♦ గతులు నెఱప

పుడమిపుట్టుగుగుంపు ♦ నెడ నెడ జడియంగ
మెరయు గాడుపు బరా ♦ బరులు సేయ
నే పైన తీవియ ♦ లింపుచేడియ లెల్ల
బలసి పేరాటపా ♦ టలఁ జెలంగఁ
జుట్టు పులుఁగులు నట్టువ ♦ పిట్ట పరవ
పరపు లగు తావి మావుల ♦ మెరకత్రోవ
రహి లతా కోరకాళితో ♦ రణము లలర
మరునికి విహారయోగ మా ♦ మని రచించె. 213

సీ. పూఁచె నశోకముల్ ♦ బున్నాగములు బూరు
గలు కలిగొట్టులు ♦ తిలకములును
కాచె నామ్రకపిత్థ ♦ కదళీకాకంటకి
ఫలజంబుజంబీర ♦ పాదపములు
నేచెసాలతమాల ♦ హింతాలతృణరాజ
నారికేళపలాశ ♦ భూరుహములు
తోచెఁ గైరవసిత ♦ తోయజేందీవర
మాధవీమల్లికా ♦ మహితలతలు
వరలె మఱి మాతులుంగల ♦ వంగలుంగ
హింగుదీభుజపత్రినా ♦ రంగగంధ
సారఘనసారసహకార ♦ సరళవకుళ
కురవకసితాసితాగరు ♦ కుజచయములు. 214

సీ. తొలుదొల్తఁ దేనియల్ ♦ దొలుకు చుండెడు మంచి
ఫలజాతముదయించె ♦ విలసితము గ
నాఫలసంతతి ♦ కన్న ముందు గఁ దోఁచె
దోరగాయల పిండు ♦ మేర మీరి
యాదోరగాయల ♦ కాదియై మును దోఁచెఁ
బువ్వుపిందెల గుంపు ♦ నివ్వటిలుచు
నాపువ్వుపిందెల ♦ నలరించి ముందు గా
ముకుళసందోహంబు ♦ ప్రకట మయ్యె

తిన్ననగు మొగ్గగమికన్ను • ముసైన్న యగుచుఁ
బల్లవములుదయించె శో • భాప్రకార
మందుముందుకు ముందు ని • ష్యందమాన
మధురమధురస మొలయంగ • మహివనమున. 215

సీ. వనలదట్టము లోచ • నంబులై కనుపట్టి
నలుల గుంపు కనీని • కలును గాఁగ
లలిఁ జిగురులు ప్రవా • ళంబులై విలసిల్లఁ
గలికాత్తతులు మౌక్తి • కములు గాఁగ
మంజరుల్ స్తనభార • హేమదీనెలయంగ
నవుణపల్లవములు • హస్తములు గఁ
బండుటాకులు పట్టు • పటగతి రంజిల్ల
శాఖలు భుజములై • సంచలించఁ
బొల్చి వనలక్ష్మి మాధవ • స్ఫురణమునకు
నుచితవేషము ధరియించె • నోయనంగ
నలరుచుండిన యవ్వేళ • నఖిలజనులు
సమ్మదంబునఁ బొదలి త • త్సమయమునను. 216

వ. అని యివ్విధంబున సూతుండు శౌనకాదిమహామునీంద్రులకుం జెప్పిన. 217

మ. పురజిన్మార్గణ మార్గణాళిసుమనో • భూజాతమిథ్యామత
స్థిరధీవారణ వారణాశినగర • శ్రీవిశ్వనాథాంక శ్రీ
కరపాదానతదానతత్పర సదా • కళ్యాణకల్లోదయా
వరసన్మానసమానసప్రభవద • ర్పధ్వంసకృల్లోచనా. 218

క. క్రీడాకిరాతమాయా, క్రోడీభవదాశరథ్య • గురుమోక్షదమా
నీడితత్రిశుత్యవలోడిత, తాడితపూషాభిధాన • దశనవిలసనా. 219

స్రగ్విణీవృత్తము.

విశ్వకమ్మాభవ • ద్వేద వేదాదివ
ర్ణాశ్వతోత్రక్రియా • ద్యక్ష దక్షాంతకా

వైశ్వరూపానుభా • వప్రసిద్ధప్రభా
వేశ్వరీనాథ వా • గీశముఖ్యస్తవా. 220

మ. ఇదిశబ్దార్థపరిస్ఫూర్తియా కలితబం • హిష్ఠప్రతిష్ఠాగరి
ష్ఠదిగంతస్తుతపార మేశ్వరకళా • సంకాశ రంగాంగనా
హృదయానందద రాజశేఖరహిత • శ్రీమూర్తి భద్రాయుర
భ్యుదయాఖ్యాన్వితసత్ప్రబంధము తృతీ • యోల్లాస మై సొంపగుఁ. 221

* గద్య. *

ఇది శ్రీమద్రామా రెడ్డిపేట రాజరాజేశ్వరకరుణారస కటాక్షవీక్షా
ప్రసాదప్రాప్తాశేష భాషావిశేష సామ్రాజ్యపూజ్య రామళ్ళగోత్ర
పాత్ర కామినేనివంశపయఃపారావారరాకాసుధాకర రా
జద్రాజన్యదేశాయిసార్వభౌమాజ్ఞాపితాంధ్రగీర్వా
ణకవిత్వకర్తృత్వచాతుర్యపర్యపరాశరగోత్ర
రాపాకలింగనార్యపుత్త్ర లక్ష్మీపతిప్రణీ
తంబైన భద్రాయురభ్యుదయంబను
మహాప్రబంధంబునందుఁ
దృతీయోల్లాసము.
శ్రీ శ్రీ శ్రీ.



శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# భద్రాయురభ్యుదయము

## చతుర్థోల్లాసము.



తరుణీమృదుమధురర
సాతతవచనరచనాస ♦ మంచితవీక్షా
పాతనరామారెడ్డిధ
రాతలపతిపురనివేశ ♦ రాజమహేశా.

వ. అవధరింపుము నిఖిలపురాణవ్యాఖ్యానమేతుండైన సూతుండు శౌనకాది మునీంద్రులకిట్లనియె నట్లు వసంతాగమంబైన సమయంబున. 2

క. ధీయుక్తిని వెలసిన భ
ద్రాయువు సఖుఁడైన సునయు ♦ ననిచిన వేడ్కన్
శ్రీయుతఁ దత్కన్యామణి
నీయెడఁ గనిర మ్మనుచు మ ♦ హేచ్ఛత దోపన్. 3

క. తనజననికి వైశ్యాగ్రణి
కనుమోదము గాఁగ దద్వి ♦ ధాశయము మదిన్
బెనఁగఁగఁ జేయుచుఁ దనసఖు
ను మిక్కుటమైన నెనరు ♦ మునుకొనఁ బనుపన్. 4

గీ. మణిమయాందోళికను బొల్చి • మహితరథగ
జాశ్వభటసంచయము గొల్వ • ననుపమప్ర
యాణములఁ దత్పురప్రాంత • మధివసించి
చారముఖమున నిజవార్త • నేరుపరుప. 5

క. విని చంద్రాంగదభూపతి
యొనసిన మతి మంత్రివరుల • నెదురుగఁ బనుపన్
జని వార లపుడు సునయునిఁ
గని సమయోక్తుల నుడివిరి • కౌతుక మలరన్. 6

గీ. రమ్యమణిమయసౌధాళి • రామసీమ
దదనుసరబలముల ముందుఁ • దగ వసింప
జేసి చంద్రాంగదుని సభా • సీమఁ గానె
ఱింగి యన్వేశ్యముఖ్యుఁడు • ప్రీతి దనర. 7

క. కనఁ జేసిన సునయుఁడు త
జ్జనపతికి నమస్కరించి • సంభ్రమ మలరన్
దనదు సమీపస్థలమున
నునిచి మహాసునినయార్ద్రి • యుక్తునిఁ జేసెన్. 8

వ. ఇట్లు బహూకరించి భద్రాయువు జననాదిప్రభావంబు లడిగి యేకాంతంబు న కతనిం దోడ్కొని చని తనపుత్త్రికం జతుర్విధశృంగారంబుల నలరించి దర్శింపఁ జేసినం గని లక్షణవేది యగుటం జేసి తల్లక్షణంబు లరసి మహానందకందళితహృదయారవిందుండై తత్కృతసత్కారంబు వడసి మగుడి నిజనివాసంబుఁ జేరి నిజజననీజనకులకుఁ దత్ప్రకారంబు వినుపించి భద్రాయువుం గవుంగిటం జేర్చి తద్వినయంబునకు సంతసించి యొక్క యపుడు క్షీణనిజప్రమదవనాంతరంబున వసియింపం జేసి యిట్లనియె. 9

సీ. తలిరులు తాబేళ్ళు • కలమగర్భంబులు
కదళికాండములు నైసె • కతము సుడి యు
విను తరగలు కన్ను • వీనుల జాడరి
శైలముల్ బిసములు • సారసములు

దరము దర్పణ ముకుం ♦ దములు ప్రవాళంబు
కనకంబు మీనముల్ ♦ కార్ముకములు
సిరు లరచందురుం ♦ డొర పైన తేటులు
కటి మొగుల్ కమలంబు ♦ మెఱుఁగుదీగ
లు ను దొగలు నువ్వుబువ్వు ను ♦ వనజవైరి
శిలలు నవసంఖ్యలు ను బాగ ♦ ములు ను లతలు
పనటు లసిరేఖ కూపంబు ♦ లనటులు కరి
కరములు ను గాళెలు ను మేను ♦ లలరఁ బోలు. 10

సీ. పారబోని మేఘంబు ♦ పాలి బోని చందురుం
డలిగాడ్పు సోఁకని ♦ జలజములు ను
జిగిబిగిఁ బాయని ♦ సొగను సంపెగమొగ్గ
నిద్దంపు టపరంజి ♦ యద్దములు ను
చిలుక ముట్టని బింబ ♦ ఫల మంచ లంటని
తూడులు కోనెలల్ ♦ జూడనట్టి
తలిరులు నెలడాల ♦ నలయని జక్కలు
మెరసి నిల్కడ గల ♦ మెఱుఁగుదీగ
తురుము నెమ్మోము గన్గవ ♦ యొరపు నాస
చెక్కు లధరంబు భుజములు ♦ చేతులు నఖ
ములు ను మైవన్నె లైనగ ♦ ముద్దరాలి
నంచితంబు గ నలువ ని ♦ ర్మించె నాక్కొ. 11

గీ. నలువ వికచశిరీషకో ♦ మలపరాగ
మిందుమృదితామృతంబుతో ♦ నెనయఁ జేసి
త్రిముఖములఁ ద్రిజగద్రత ♦ శ్రీ గ్రహించి
కడమముఖమున నిర్మించెఁ ♦ గమలముఖిని. 12

క. వెలఁదుక కన్నుల కాటుక
పులుఁగు లగుట దెలసి రొగరఁ ♦ బోయీ ననిక

న్నలవిలుతుఁడు రుల నొడ్డిన
చెలువున ముంగురులు దనరె • సింగారము గన్. 13

ఉ. మేలిక డాలిలోని జిగి • మించిన మంచి మొగంపు సొంపుడాల్
పాలమడుంగునం జెలుత • పాయమునం బొరలాడు జోడు లౌ
వాలుగమీలనం గఁ దెలి • వాలుకనుంగవ నుల్లసిల్లు న
బ్బాలిక కందు లోకములు • ప్రస్తుతిఁ జేయును బ్రస్ఫుటంబు గన్. 14

గీ. కలికి నిడుసోయగపు వాలు • కన్ను గవల
వలన గ్రుమ్మరు లావణ్య • జలధినడుమఁ
జెలువుగ రచింపఁ బూనిన • సేతు వనఁ గ
భాసురాంబుజలోచన • నాస మెరసె. 15

సీ. అధరామృతప్రవా • హప్రతిక్షణజాత
నూతనబుద్బుద • వ్రాతమనఁగ
యౌవనమన్మథో • ద్యానతాటీలస
ద్దాడిమఫలబీజ • తతియనంగ
నాననపద్మస • ద్మాలయాంగణసీమ
రంజితమౌక్తిక • పుంజమనఁ గఁ
గించిద్వికచముఖ • ప్రాంచత్ప్రమోదినీ
రసపూరకోరక • విసరమనఁగ
లలితరదనాంశుకారుణ • ఫలకలిఖిత
పంచబాణప్రతాపప్ర • పంచవిజయ
శాసనాక్షరసంతతి • చంద మమరఁ
గాంతకాంతామణీదంత • గణము వెలసె. 16

గీ. వరుస నై యొక్కువలు తక్కు • వలు దొలంగి
యొక్కతీరునఁ బెంపొందు • చున్న దంత
పద్మరాగాళిఁ బెనఁగొని • పరఁగినట్టి
తావి సకలాలి తునుకన • మోవి దనరె. 17

సీ. కన్నుల విలుకాని ♦ యొన్నిక జాళువా
జంజాళియననొప్పు ♦ సకియనాస
చక్కెర విలుకాని ♦ చక్రని తొల్తటి
చిలుకులనఁ గనెల్గుఁ ♦ జెలియ కనులు
రాచిల్క నెక్కాఁడు ♦ రాయని తీరైన
విండ్లనఁ గనుపట్టు ♦ వెలఁది బొమలు
సింగార మైనట్టి ♦ సిరిపట్టి బంగారు
పలుక యనం దోచుఁ ♦ బడఁతి నొసలు
మారుఁడు శ్రీపుత్రుఁ డను మాట ♦ యొలుక పడఁగఁ
జేయుచందము దోప న ♦ చ్చెలియ వీను
లగుఁ శ్రీలు మెలంగెనా ♦ ననుచుఁ బొగడ
భ్రమరకుంతల జూపట్టు ♦ సుమశర మన. 18

గీ. అలరువిల్తుఁ డనెడు గేస్తుఁ ♦ డతివ మేన
లలితశృంగారలక్ష్మివి ♦ లాసములను
లలి వినిర్మింపుచోఁ దొలు ♦ దొలుత సంకు
నిలిపె నో యనఁ దనరారెఁ ♦ గలికి గళము. 19

సీ. అనురాగరత్నాభా ♦ క్రనకశైలము లన
మకరాంకకన్యకం ♦ దుకము లనఁ గ
పరదేహజన్యలా ♦ వణ్యపుంజము లన
స్వాంతసరోజకో ♦ శములనం గ
మదనమోహనభూతి ♦ పదకరండము లనఁ
గంతు నిర్వక్రచ ♦ క్రము లనం గ
హారమృణాళసం ♦ చారికోశము ల న
భవమహీరుహమూల ♦ ఫలము లనఁ గ్రఁ
బథికలోకజిగీషాప్ర ♦ వర్తనప్ర
భవపరిశ్రమలాలస ♦ పంచబాణ

సుఖనివాసగృహము లన • సుందరాంగి.
కులుకుగుబ్బలు దనరారెఁ • బొలుపు మీఱ. 20

క. గళకాంచనాచలాచల
దళదురుసంజీవనీల • తాఫలము లనన్
విలసిల్లెం దదురోజయు
గళ మనఁ దగు లీలచే వి • కాసము దోపన్. 21

చ. మెఱుఁగు దొరంగు మధ్య మను • మేలిమి బంగరు రంగు టాకునన్
మరుఁడు తదీయరూపమహి • మా[illegible]యంబున కన్య మీఁదు గా
దొరయ దటంచుఁ గజ్జలము • తో లిఖియించిన నాగరం బనన్
సరసిరుహాక్షి చక్కనగు • శ్యామలరోమగణంబు సొంపగున్. 22

క. చూపట్టినట్టి పొక్కిలి
తాపల విలసిల్లు కనద • లోలమనోభూ
దీపపుకొడియన నూగా
రాపూర్ణశశాంకవదన • కందం బయ్యెన్. 23

గీ. అంశుకవ్యాప్తిచే మధ్య • మాస్తికత్వ
మొగిఁ బరామర్శఁ దలఁచిన • నానరు ననుచు
నంబుజాక్షి మనసు పట్టు • ననుట గాని
తలఁచి చూడఁ గృశత్వం బె • దాని కిరవు. 24

చ. ఉరుకుచకుంభపాతమున • కోర్వక నోయటు గాక భానిస
త్పురుషకరోరుపాశమునఁ • బుట్టిన ఖేదముచేత నేమొ యా
సరసిరుహాక్షి నెన్నడుము • చారుకృశత్వము బూనెఁ గానిచో
గురుగతి లోచనంబులకు • గోచర మై విలసిల్ల కుండు నే. 25

మ. తలిరుంబోడునఁ గూడు కేఁడు త్రిజగ • త్సమ్మోహవిద్యానవ
ద్యలసద్బాహుపరాక్రమక్రమము [illegible]ం • ధపాత్రీకోటిం జలా
చలవృత్తిన్ భజియించఁ జేయఁ గ జయ • స్తంభంబుల న్నిల్పె నాఁ
గలనన్ భీతమృగీవిలోచన తొడల్ • గన్పట్టె నా చట్టుగన్. 26

క. అంగజుఁడు నిరెడు సామరి
బంగారపు రంగుల న్వి • భాగింపుచు మున్

రంగాయించిన గుదె లన
నంగనజంఘికలు దనరె ♦ నద్భుతలీలన్. 27

గీ. జంఘికాగతలావణ్య ♦ జలధిజనిత
శుక్తు లయ్యెఁ బదంబులు ♦ స్ఫుటితతత్పు
ముఖవినిర్యన్మణులు చంద్రి ♦ ముఖి నఖములు
గాని సుమతారకలు పోల్కెఁ ♦ గానవయ్యె. 28

గీ. తారకలు సరి గాఁ జేయఁ ♦ దగవు నఖస
మాన మొనరుట కని బ్రహ్మ ♦ యమృతబిందు
తతికి నిల్కడ వన్నెయఁ ♦ దగ నొనర్చి
వెలఁది నఖములు నిర్మించెఁ ♦ జెలువు దనర. 29

గీ. అంగజేభశిర మ ♦ నంగ వక్షము దోఁచెఁ
గుంభయుగమురీతిఁ ♦ గుచము లలరెఁ
గరముపోల్కె రోమ ♦ గణము జెన్నొందెఁ ద
దగ్రిము గతి నాభి ♦ యలరు చుండె. 30

చ. అతివవిలోచనంబులు సి ♦ తాబ్జము లంచుఁ గనీనికామిష
స్థితినిరు మేనులం దనరి ♦ శ్రీహరి నిల్చినఁ జూచి లక్ష్మిత
త్ప్రతి నెడఁ బాయ లేక కను ♦ పాప లనే నెప మొప్ప నుండె న
ప్రతిహతవృత్తిఁ జెందు నన ♦ పాయిని గా భువి నెన్న నిచ్చలున్. 31

గీ. ఉదరము దరం బనం దగి ♦ యొప్ప చుండ
మధ్యము ను మధ్యమం బయి ♦ మలయుచుండె
బొమ్మ లలతుంటవింటికి ♦ బొమ్మఁ గట్టి
బిరుదు చాటించుఁ జెలియ పొం ♦ బిరుదు లెపుడు. 32

క. కందర్పగజాలానపు
పొందునఁ దగు గతన్ మనఁ గఁ ♦ బొక్కిలి మెరసెన్
సుందరతచ్చరణాగ్రిస
మందుక మగు రోమరాజి ♦ యలరారెఁ దగన్. 33

క. సోగ సగు నగుమొగ మునిరొడు
తోగరాయని దండనుండి ♦ తోచిన బలు కెం

జిగిఁ దగిన సాంధ్యరాగపు
వగ యనఁ జిగురాకుబోడి ♦ వాతెర వెలసెఁ. 34
సీ. చేలోగృహాంతరా ♦ సీనసూనాంబక
వీక్షణోత్సవదగ ♦ వాక్షములన
వదనసంపూర్ణలా ♦ వణ్యస్రవంతికా
విహారదంజననామ ♦ విహగము లనఁ
గమనీయదరహాస ♦ కలశాంబునిధిభా న
ఘానసీలోత్పల ♦ సూనము లన
లసమానదృష్టిలీ ♦ లాకుందమాలికా
కలితద్విరేఫయు ♦ గళ మనంగ
మహితదృష్టియచేష్టగ ♦ మననిరోధ
కశ్రివణకూపకృతకోప ♦ కమ్రిరూప
లోహితోపాంతముల జగ ♦ ల్లోభనీయ
మగుచుఁ దనరారు మగువనే ♦ త్రాబ్జయుగము. 35
గీ. మరుఁడు సార్వభౌమ ♦ బిరుదుఁ గైకొని తన్ము
ఖంబు భద్రపీఠి ♦ గా నొనర్చి
మెఱుఁగు గరికి పచ్చ ♦ మేలుకట్లొనరింపఁ
బోలు ననఁ గఁ గలికి ♦ బొమ్మ లలరె. 36
గీ. వెలఁదికక్షభాగ ♦ ములు చెలు వొందె నా
ఫుల్లహల్లకముల ♦ పోల్కఁ దనరి
లేఁత లైన దండ ♦ చేతులు విలసిల్లె
వాని తూఁడు లనఁ గ ♦ వన్నె మీరె. 37
చ. సిరి హరి రాణి గాస మయి ♦ చెల్వగు గైరికసారసారసం
బరిమురి విభ్రమద్భ్రమర ♦ కాంచితసంచిత మైన వాసనా
భరమునఁ [illegible]మో మగుచు ♦ భాసితతత్కమనీయపేశల
స్ఫు[illegible]శాల మో యనఁ గఁ ♦ బొల్చెను నాసిక సారసాక్షికిన్.. 38
క. అలు లలయింపఁ గ జ[illegible]జము
వెలఁదుక జిగి దగు మొగంబు ♦ వెనుక కరుగ న

య్యాలకముల పొల్పుఁ దెలుపుచు
నలు లక్క్రడ నిలిచి యుండె ♦ ననఁగచ మలరెన్. 39

గీ. తగు ధనుర్మీనములు గూడి ♦ మగువ భూమిన
యనము లై నను గురుఁడు నా ♦ సను మెలంగి
మౌక్తికాకృతి దేదీప్య ♦ మానుఁ డగుచు
నెలయుఁ దా నేలి కైనను ♦ నెలవు బలిమి. 40

గీ. జలజసాయకుఁ డమ్ముల ♦ సానఁ బట్టి
రత్నమయశాణచక్రమా ♦ రమణి పిఱుఁదు
దానిజిగి కుందనపు బంది ♦ యాను కౌను
తనర నందు వసించిన ♦ దరులు తరులు. 41

క. అలికం బగ నెలఁ దెగడిన
నలికంబును జూపు దెగడు ♦ టది చిత్రము గా
దలకంబు మొయిలఁ దెగడిన
నల కంబును గళము దెగడె ♦ నౌర తలంపన్. 42

క. వలమురి గళ మై తగఁ గలు
వలమురిఁ గొను లేఁతనగవు ♦ వసుధాస్థలి పైఁ
గలమహిళామధ్యమ మే
కల మహిళామధ్యమంబు ♦ కమనీయం బై. 43

క. ఆవరవర్ణిని యధరం, బావరవర్ణిని సుధాస ♦ మన్వితమగుచున్
భావిదిత రైన యాసతి, భావిదిత యనంగ మిగుల ♦ భాసిలు చుండెన్.

క. సర మా తను వసిలోర, స్సర మా వేనలి సుధావ ♦ సర మా నుడి మేల్
సర మా పొక్కిలి రత్నవి, సర మా రదనాళి చెలి ను ♦ సర మా పొగడన్.

ఉ. జంబు గదే కచంబు జల ♦ జంబు గదే మొగ మామణీసమా
జంబు గదే రదావళి గ ♦ జంబు గదే నడ లౌర హేమపుం
జంబు గదే యొడల్ మలయ ♦ జంబు గదే మయితావి చంద్రతే
జంబు గదే స్మితంబు నని ♦ జంబు గదే నడు మెన్న బోటికిన్. 46

క. ఆశమణి రోమగణకబ, రీరమ్యకుచంబు లలరె ♦ శ్రీ దనరారన్
ధారాధర ధారాధర, ధారాధరములు తిరస్కృ ♦ తము లై తనరన్. 47

వ. అని యివ్విధంబున వివరించి. 48

గీ. ఋషభయోగీంద్రుఁ డెపుడు నా • హృదయమునను
స్ఫురణఁ బుట్టించుట యుఁ జేసి • భువనములను
గలుగు కన్యలఁ గంటి నా • కలికివంటి
చెలినిఁ జూడంగ లేద యా • శ్రీదవిభవా. 49

వ. అనియి వ్విధంబునఁ గీర్తిమాలిని సౌందర్యాదిగుణంబు లేకతంబునఁ దెలి
యం జెప్పిన నారాజసూనుండు సంతుష్టాంతరంగుం డయ్యె. 50

గీ. అంతనక్రీడఁ జంద్రాంగ • దావనీశుఁ
డాప్తులను జూచి పలికె భ • ద్రాయువునకుఁ
గీర్తిమాలిని నొసఁగ నేఁ • గీర్తిశాలి
నైతి మీకందఱికిని ద • హర్షము గద. 51.

క. అన వార లనిరి జనవర, యనుపమసౌందర్యధుర్యుఁ • డార్యుఁడు భద్రా
యునికంటె వరుఁడు లేఁ డీ, వనధిపరీత మగు భూమి • వలయములోనన్.

వ. అని వారు సమ్మతించిన నంతఃపురస్త్రీలలో సాధ్వీరత్నం బగు సీమంతినికి
భద్రాయురభ్యుదయాదికం బాద్యంతంబు వృద్ధబ్రాహ్మణముఖంబున వివ
రించిన నాకీర్తిమాలిని విని తనమనంబునకు భద్రాయువు సాక్షాత్కరించిన
ట్లైనఁ గరణత్రయంబు నతనియధీనంబుఁ జేసి. 53

గీ. అవ్విధంబున శ్రీవసం • తాగమంబు
సరససర్వజనానంద • కరము గాఁగఁ
దనరు నవ్వేళఁ గీర్తిమా • లిని విరహాని
లసితడోలాయమానమా • నసము నొందె. 54

సీ. శ్రీమంతుఁ డైనట్టి • ఋషభయోగీంద్రుండు
మిహిరపత్రికాశుఁ డే • మిటికి వచ్చె
వచ్చుఁ గా కేమి స • ద్వంద్య్య భద్రాయువు
ఖ్యాతిశౌర్యాదు లే • రీతి నుడివె
నుడువుఁ గా కేమి సం • తుష్టుఁ డై మాతండ్రి
హితసుదుహ్వాహంబు • సేల దలఁచెఁ

దలఁచుఁ గా కేమి త • త్సౌందర్యముఖములు
ముందు గా మదిలోన • నెందు కలరె
నలరుఁ గా కేమి దుస్సహుం • డసమశరుఁడు
కుసుమశరముల నన్నింత • మసలఁ జేసె
నేమి సేయుదు విరహార్తి • కెట్టుల నోర్తుఁ
దాళ నే నింక నే నని • తలఁకఁ దలఁకి. 55

సీ. మేను వేదనపాలు • గా నొనరింపుచు
నెరజవ్వనంబుఁ గ • న్నీటి కొసఁగి
వేడుక జాలితోఁ • గూడంగఁ జేయుచుఁ
జూపులు దెసలకై • నైపుఁ జేసి
తేనెజాల్గల్గు వా • తెర సోయగం బెల్ల
వేఁడనిట్టూర్పుల • తోడఁ గలపి
సొగసుగుబ్బలమీఁద • పొగ రెల్ల జాఱువా
పసగల పయ్యెద • పాలు జేసి
బయలు కౌఁగిటఁ జేర్పుచుఁ • బ్రకట మైన
ధైర్య మంత యుఁ గడు దీన • దశ కొసంగి
తలఁకె యస్సురనుచు మదఁ • దల్లడిల్లి
బెగ్గిలుచు మన్మథా యని • పేరు గొనుచు. 56

క. నిసుగుం బయ్యెర సోఁకినఁ, గసిగం దెపు వేళ నేలఁ • గదియింపుచు సొ
మ్మసిలం బోవుచు లేచుచు, విసుగుచు వేసరుచు మసలె • విరహాభరమునన్

సీ. తొలుతఁ గాయక్లేశ • మలవడఁ గాఁ జేసి
యచలాసనాభ్యాస • మలవరించి
ఇంద్రియార్థంబుల • నెలమి విసర్జించి
కనుగవ యరమోడ్పు • గా నమర్చి
చూపు లోఁక్రుంటఁ జేసి • శుద్ధమనోవృత్తి
తదధీనముగఁ జేసి • తమి నడంచి
సకలవస్తువుల ను • త్సుకత విడం జేసి
ఖేచరీముద్రను • గీలుకొల్పి.

తన కొకటి దోఁచు టన్నది ♦ తా నొకటికిఁ
దోఁచు టన్నది లేక య ♦ త్తోయజాక్షి
విరహయోగంబుతోఁ గూడ ♦ విభుని పదము
లక్ష్యముగఁ జేసె నాత్మీయ ♦ లలన లదర. 58

క. అభిలాషవిప్రలంభ, ప్రభవస్తంభాదసత్త్వ ♦ భావము లెదలోఁ
ప్రభవించిన నిర్వేదా, దిభయము పొడకట్టెఁ దేట ♦ తెల్లమి గాఁగన్.

గీ. స్థిరవిభావానుభావసా ♦ త్త్వికముఖముల
నలరు రస మంబుజాతాయ ♦ తాక్షి మేనఁ
జెలఁగు చుండె నవస్థావి ♦ శేషములను
నవవిధములఁ బరస్పర ♦ భవము లగును. 60

వ. మఱియును. 61

క. గర మాయె నోగరము సా, గర మాయె వియోగ మలిక ♦ గతకస్తురి నా
గర మాయె రేబగలు జా, గర మాయెం జెలికి విరహ ♦ గతి యెట్టిదియో.

వ. మఱియు మందమందాందోళితకలశజలనిధికల్లోలజాల ధవళితహాసచ్ఛురితాధరంబు పూర్ణిమాశశాంకసంకాశముఖంబు కోటికందర్పలావణ్యాధిక్యద్రామణీయకంబు గల భద్రాయువు సురూపరూపంబు హృదయంబున ధ్యానంబుఁ జేయుచు నేత్రగోచరుం డైనట్టు లైన నలుదిక్కులుం జూచుచు యౌవనసాగరచంచలాభంగతరంగపరంపరాసహిత యు ననురాగరజ్జుసమావృత యుఁ గుసుమశరశరకీలిత యు నభిలాషవిప్రలంభశృంగారభావనాపరిభూత యు నిజరూపపరిభావశల్యకీలిత యు మలయానిలావధూత యు నై ప్రియసఖులం జూచి యోయనంగరేఖా విరహతాపతప్తదుస్సహం బైన నా యెదను నీపాణిపద్మంబుఁ జేర్పుము ఓమదనమంజరీ నాయవయవముల శ్రీచందనోదకంబులం దడుపుము. ఓవసంతతిలకా నాకబరీభరంబుఁ జక్కం జేయుము ఓతరంగవతీ కేతకీసుమపరాగంబు పయిం జల్లుము ఓకందర్పమాలినీ శైవాలజాలకీలితవ్యజనంబుల విసరుము. ఓచిత్రరేఖా నాచిత్తవిత్తాపహారకుం డైన యప్పురుషరత్నంబుం జిత్రపటంబున లిఖింపుము ఓవిలాసవతీ ముక్తాఫలచూర్ణనికరంబు నిక్షేపింపుము ఓసఖీ నళినదళచయంబున నాప

రోధరయుగళంబు గప్పుము. ఓసంచారికా కదళీపర్ణంబునఁ జల్లగాలి సం
చరింపం జేయుము. ఓకాంతిమతీ బాష్పజలంబు లపనయింపు మనుచుఁ బ
లికి నిరుత్తర యై యించుక నిదురించి యులికిపాటున మేలుకని పరిజనప్ర
యత్నంబున గృహీతజీవిత యై యున్నంత. 62

గీ. మత్స్యకూర్మాంగవిలసన ♦ మహిమఁ దనరు
సరసిజానన లావణ్య ♦ సరసిలోన
శంబరాహితుఁ డడరి జా ♦ లంబు వైచి
కలయఁ ద జ్జీవనం బెల్లఁ ♦ గలఁచి కలఁచి. 63

చ. కరువలితేరు తీరరయు ♦ గాఁగడి లేఁదలిరాకుబాకుచే
జిరజిర లాడు నయ్యెడ గ ♦ జిక్కిన గాటపుపోటోనర్ప బి
త్తరి తరియింప రాని బలు తా ♦ పనితాంతదురంతచింతనా
కరవిరహార్తి బెగ్గిలిన ♦ కౌశవఘూకతి నేమరింపుచున్. 64

సీ. అనవరతానిలో ♦ ద్ధతరజోభరసూత
నూతనస్మరమహా ♦ భూతయగుచుఁ
గోరకచ్ఛురికా ప్ర ♦ కారకైతకమూర్తి
మహితరక్షోవీర ♦ మహిమ కలసి 65
వితతకుట్మలకింశు ♦ కతతిపాంథామిష
సహితనఖవ్యాఘ్రి ♦ సరణి కులిక
నిరతోర్ధ్వభాగసం ♦ చరపరాగస్థల
నలినీతలజ్వాల ♦ నునికి జడిసి
నికటకింజల్కపుంజకం ♦ కటచయంబు
కుసుమరసదీర్ఘికాకూప ♦ విసరములను
దనరుచున్నట్టి యుద్యాన ♦ వనముఁ జేరి
తద్భయంకరవృత్తికిఁ ♦ దల్లడిల్లి. 66

గీ. మఱియు శుకపికముఖసము ♦ చ్చరితవిరుత
భరితపరిలసదుపవనాం ♦ తరము శ్రవణ

కటుతఁ జేసిన నీసునఁ • గంపమొంది
సుందరీమణి వలవంత • సోలి సోలె. 67

వ. తత్ప్రదేశంబున శిశిరఘనసారవిసరాపగా పులినతలంబునఁ దుహినమలయజకృతకసరిత్పరిసరంబునఁ గనత్కనకారవిందబృంద సరస్తటచందనవిటపచ్ఛాయల ననిలాందోళితకదళీకాననంబునఁ బూర్వరచితప్రసూనతానమానశయ్యలఁ దుషారసంభూతశిలాతలంబుల వసింపుచు విరహానలదందహ్యమానమానస యై సంచరింపుచున్నంత. 68

ఉ. అయ్యెడ నెయ్యపుం జెలు లా • యారపు టారమణిం దలంచి తా
నెయ్యెడ కేగ నో సకియ • యేకత మేకతమానురూఢి నై
పయ్యెర సోకినన్ వనరు • పాయపు పువ్వుల మేనులాడి తా
నెయ్యెడఁ దియ్యవిల్తువన • మెయ్యెడ హా యని తత్తరింపుచున్. 69

క. రోయుచు నిది యే మని తల
పోయుచు బెగ డొంది కుంది • పూఁబొదరింటిం
డాయుచు లతికలఁ బాయుం
దోయుచుఁ బొగ లెగయు వగల • తోఁ బొరలం గన్ 70

గీ. మంజుకుంజాంతరసమేధ • మానసూన
నీయవర్యమణీఘృణి • నిబిడ మైన
వేదిమీఁదను వసియించి • విరహఘూర్ణ
మానమానసమున నుండు • మగువఁ జూచి. 71

మ. పడతీ సాహసమూల్ వియోగభరము • త్పాదింపఁ గా మమ్ములన్
విడనా డిట్టులఁ దియ్యవిల్తువనమున్ • వీక్షింపఁ గా వచ్చినన్
జడు పింతైనను లేక భీకరశిరా • సారంబు ఘోరంబు గా
వెడవింటుం బరఁగించ నించువిలుతు • స్వేదం గ మాశక్య మే 72

శా. రోలంబాలక మానినుల్ జగతి లే • రో నీవలెన్ వేదనా
లోలత్వంబున కొప్పి ముప్పిరి గ నీ • లోఁ బాయ కున్నట్టి యా
బాలామన్మథుఁ డై ధరాతలమునన్ • భద్రాయు వన్ రానుతుం
డీలో నిన్ బచరించుఁ గావ వగ నీ • కేలే కురంగేక్షణా 73

చ. తెలి కను మీలు వేఁడిఁ గను ♦ తేకువ వచ్చిన నీటి వెల్లితోఁ
గలయ ముడింగి మిట్టిపడఁ ♦ గా మరుఁ డాత్మజయాంకముల్ చలా
చలతను బూన నోవ వని ♦ సారెకుఁ గోపముఁ జేయు నంచు నె
చ్చెలు లుపచారభేదములఁ ♦ జేయఁ దొడంగిరి స్త్రీలలామకున్. 74

క. బిసకిసలయభుజపాణులు
బిసకిసలప్రముఖవస్తు ♦ భేదంబుల నా
బిసరుహనేత్రికి మృగనా
భిసురభిపాత్రిక నొసంగ ♦ భీతిలి తమలోన్. 75

సీ. బిగి పెంపు గల పెంపు ♦ చిగురుటాకుల గుంపు
లంగారముల రంగు ♦ లావహింప
సడరు వీచోపుల ♦ వడలె డతెగని యూ
దుడుకోర్పుల తెరంగు ♦ తొలుత దెలుప
నెనయ జొబ్బిల నంత ♦ ట నలందు గందంబు
మొగి వెలిగారంబు ♦ సొగసుఁ జూప
మేదురస్వేదోద ♦ కోదయసంతతి
కలయఁ జల్లిన నీటి ♦ చెలువుఁ జూపఁ
గనలు ననసెజ్జ యుహసంతె ♦ కళల నీనఁ
జెలియ యొదఁ గుందనపు ముద్దఁ ♦ జేసి కఱఁచె
నతనుఁ డను స్వర్ణకారకుం ♦ డనుచు వగచి
రింతు లొకింత చింత దు ♦ రంతము గను. 76

వ. మఱి యుఁ జిత్తజాయత్తచిత్త యగు బిత్తరి యత్తరుణీమణి లోనరించు నా
రపుఁ గఱవు విరివరుపు పైఁ బొరలుచుఁ జిగురు విలుతు మగఁటిమి సెగ
పొగ లెగయ దిగులు కొని మిగుల వగలఁ బొగిలి నొగిలి కన్నీటి మేటి యే
టి వరువ బరువై యుల్లలదాయల్లక జ్వరప్రతప్తకార్త్తస్వరమణిగణప్రభా
మండలమండితకొండలంబులపైఁ బడి చూత్కృతులు నిగుడింపుచు సిరుల కి
ర వగు కుచగిరుల పైఁ దెరనారి తోరంబు లగు తారహారంబుల నొందించి
పులకకలమాంకురంబులకుఁ దన్నీరంబు చందంబు నొందుచు నందము గన
లందు సిరిగందంబునఁ బొందుపరచిన మేకమేపుగోవజవాది యొప్పిన క

ప్పురంబు కుంకుమ మొద లగు ప్రశస్తవస్తువులు గరంగి కురంగమకరీకలాపకలాపంబుల జిగిబిగి ఛాయ గండమండలం బఖండపాండిమపిచండిలంబై తోఁచఁ జికురనికురుంబంబునఁ దొరఁగి విరిసరంబులు పరిసరంబుల మెరయ మిసిమి గల పసిఁడి మేను కసిగంద నడుగడుగున కుడుగని జడివడిన వడువున నొడలి చిఱు చెమట నిగుడుచుండ వియోగావస్థల నవసిన వర్తైనల గుసగుసలఁ బోయి మసలుచు బిసరుహాలోచనలు తటస్థోద్దీపనవేపమానమానస యగు నాచిగురాకుబోడిం జూచి. 77

సీ. సంతతసురసాల ♦ కాంతఫలాహార
సమయంబు గల శుక ♦ సంచయంబు
వరసుమనఃప్రియా ♦ చరణసవనభూమిఁ
గలయవర్తిలుమాధు ♦ కరగణంబు
మధురసాయననియ ♦ మచ్ఛదాస్వాదనం
బమర నన్నను వనప్రి ♦ యవ్రజంబు
సరసీభువనదేశ ♦ జంఘాలగతులచేఁ
బెనుపొందు పరమహం ♦ సనివహంబు
విభవయోగాగమోల్లస ♦ ద్వివిధఫలద
మాధవాలోకనామోద ♦ మహిమఁ దనరి
పరఁగు నివి యెల్ల నీ కేల ♦ బాధఁ దలఁచు
నింత చింతిల నేటికి ♦ వంత నొంద. 78

సీ. శృంగారరస మొలుకు ♦ సిరికొప్పు మొయిలను
గని డాయ వచ్చు శి ♦ ఖావళములు
రాగవిస్ఫూర్తి తో ♦ రంబు లౌకుచమంజ
రుల నటింపఁ గఁ జేరు ♦ నలుల గములు
మధువినోదముఁ దెల్పు ♦ మహనీయగతి లోచ
నాబ్జముల్ గన వచ్చు ♦ హంసతతులు
నతిమధురతఁ జూపు ♦ నధరబింబము దారిఁ
గేరి వచ్చు నుదార ♦ కీరవార

మలర నింపు సొంపు • హావం బుభావంబు
వహిఁ దలిర్చునీయ • వయవరుచులఁ
గొనరి దెసల మసలు • నసదు బాణబలంబు
తేల జాలిఁ జేయు • లోలనయన. 79

చ. నెనరునఁ జిత్తగించు రమ • ణీ రమణీయమదీయవాక్కులం
దనుతవ హించ నేల వని • తా వనితాంతతనూవిలాస యా
వనటలఁ జెంద నేల మగు • వా తగవా వనజాస్త్రశస్త్రముల్
నెనుకొన వేగ నేల వద • వే పదవేగ మెలర్వ ముంగలన్. 80

చ. తెలసినదాన వాదువు ర • తిప్రియు నాజ్ఞల మీరనట్టి రా
చిలుకలుఁ గోయిలల్ మనకు • సేమము నేమముతోడఁ గోరు నీ
వలయకు మమ్మ సొమ్మసిల • కమ్మ శుభం బగుఁ జుమ్మ నెమ్మదిం
తలకక నమ్మవమ్మ రుచి • ధాళధళీవిక చాబ్జలోచనా. 81

క. అని యూరార్పుచుఁ దద్వన
మున వనితామణికిఁ బ్రొద్దుఁ • బుత్తు మనుచు నే
ర్పునఁ గైదండల నిడుకొని
వనజనయన లిట్టు లనిర • వారణగరిమన్. 82

గీ. చూచి తే కొమ్మ కొమ్మల • సొంపు లింపు
లతలు జతలు ను బూలసం • తతుల గతుల
వెలయు నళులును శుకపికా • వళుల చెలుల
రొదలఁ బొదలెడు పొదల సం • పదల నిచట. 83

చ. అలవి రియె కాంత కాంతలతి • కాంతనితాంతచరస్ఫురన్మరు
చ్చలదళజాలజాలనివ • సన్నివసత్కలికాకలాపసం
వలయితనూతనాతనువి • మానసమానరమావిలాసవ
త్సలలితకాయమానముల • సంచుల మించు మతి న్నుతింపఁగన్. 84

చ. కనుఁగొన వమ్మ యమ్మరుఁడు • కావలి యుంచిన మించు తేటు లీ
వనజమరందబిందువుల • నైపుల చక్కగ మెక్కి సొక్కుచున్
వనిఁ గలయ న్మెలంగుచు న • వా దగు నెదఁగిబోదులందు వి
చ్చనవిడిఁ గూడి యాడెడు వి • నన్ వికచోత్పలపత్త్రలోచనా. 85

ఉ. చూచితి వావనిన్ గమన ◆ సూచితతేజితకీరవాహవా
హోచలితావనీజజని ◆ తాంచితసంచిత మౌ పరాగమున్
రోచదుదారమారజయ ◆ రూఢికనద్ధ్వజచేలలీల గా
నోచెలి యీదిశాసరణి ◆ నోరగ వారుట మంచిదే కదా. 86

చ. చెలి కలయంగఁ జూడు మిదె ◆ శీర్యదుదారరసారుహోత్పత
త్ఫలవిలసద్రసప్రసవ ◆ పంచమరాగపరాగభాగభా
గలిపికశాలికీరసము ◆ దంచితపద్మమరందబిందుతుం
దిలజలపత్రచిత్రితవి ◆ నిందితవారిసరోవరంబులన్. 87

క. లలనా కలకంఠవయో
లలనాకలనాదత ◆ లహరీవిహర
చ్ఛలనాత్మాత్మ పిశిఖాం
చలనానాసూన బలె వె ◆ సంగను మిచటన్. 88

సీ. అల్లిబిల్లిగ నుల్ల ◆ సిల్లుమల్లియతీవ
యెల్ల మొల్లలఁ గూడి ◆ యింపు లెసఁగఁ
బజ్జపజ్జల నున్న ◆ గుజ్జుగొజ్జంగుల
తావి మావుల తావు ◆ లీవుకొనఁ గఁ
జెంతల వింత లౌ ◆ బంతిసేవంతులు
గున్నపొన్నల వన్నె ◆ లెన్నుకొనఁ గఁ
జాలు గా మే లైన ◆ యేలకిచాలుపుల్
గొప్ప కప్పురముల ◆ నుప్పతిలఁ గ
నెలమి వలి గలిగిన వేల్పు ◆ టేటి నీటి
తోటి వీటయి గాట మౌ ◆ తేటనీట
జిలజిలన నేలఁ బలు చలు ◆ పలను దనరు
దొనల్కఁ జెనఁగొను తెలివాక ◆ లనువు గనుము. 89

సీ. కొమ్మ నిమ్మళపు లేఁ ◆ గొమ్మలఁ గదలించి
యింపు నిద్దంపు పూ ◆ జొంప మరసి
తొగరుచేఁ బాగరెకుల ◆ జిగురు పిండుఁ గలంచి
పిప్పువుప్పొడులొ ప్పు ◆ కుప్ప లెకిల

మొల్లమూవటిక్రేళ్ళ ♦ చల్లవ౦దిరులం ది
నెలివలితోఁగలను ♦ గలసి మెలసి
గనిఁ గట్టుకొను తట్టు ♦ పునఃగువ ట్టరయుచు
నల్లుకొన్నట్టి లో ♦ యలను జూచి
కలకలనుపులుగుల పడ ♦ గలను కొలను
లరసి పలుగొమ్మలమెకమ్మ ♦ లమరు చెకు
చెమరుల ల్లార్పుచును గుమ ♦ గుమనువలపు
వెలయు దక్కినపుం దెమ్మె ♦ రలను గంటె. 90

చ. సకి మకరాంకుఁడాగలను ♦ సారెకు మీరుదుఁ గేరు నారులం
జికిలిమెఱుంగు లీను నన ♦ చిల్లల పెల్లున నల్లి బెల్లిగా
నకరుణఁ జేయ నాయెడల ♦ నామని యూరు వారిగోతులం
జకచక లీన నించె ననఁ ♦ జక్కి మెలంగె మరందదీర్ఘికల్. 91

పంచచామరము.

పరిస్ఫుటంబు లయ్యెఁ దీర ♦ భాసురద్రుమప్రసూ
నరాజరాజిమచ్చరత్స ♦ నాతనేందుకాంతవ
ద్దరీఝరీతరంగసంగ ♦ తప్రచారసారసో
త్సరాగరావనీవనీప ♦ వత్ప్రమాణికల్ చెలీ. 92

క. సుమవనసముదయసముదయ
దమితమరందాదనోద్ధ ♦ తస్వననీల
భ్రమదభ్రమదభ్రమద
భ్రమరవ్యూహములఁ గంటె ♦ పంకేజముఖీ. 93

వ. అని మఱియు ని ట్లనిరి. 94

సీ. భూపాలతనయ యీ ♦ పొగడపట్టు దలంపఁ
బొగడ స ట్టగు చుండి ♦ నిగుడు చుండు
నలరు దానిమ్మల ♦ హరిణాక్షి కంటె వే
నిమ్మలకడ సమ్మ ♦ ద మ్మొసంగు
తరుణిరో దేవగాం ♦ ధారి యఙ్గ్రానుంబు
నీకథావతిని వా ♦ యించి తేని

యీసదేశక్షితి • నెనసిన పొద లెల్ల
నేచి పూచి తలిర్చి • కాచి యుండు
సరస మై తగిన వసంత • సమయమునను
బాన యావన మేనాఁట • నైనఁ గల దె
వెలఁది యచ్చోటను దనూల • వితతి ననిచె
నాతి యనురాగముల మించి • ఖ్యాతి మీరి. 95

క. కమలము బారి యగుచు హిమ
సమితవనము మనకు సొంపుఁ • జూవదుగ దె యో
రమణి రతిరాజు కాబీ
రము మానదు విరహిణులను • రా పొనరించున్. 96

గీ. నిబ్బరం బై రవిలిన యీ • గబ్బి మలయ
మారుతం బిచ్చటఁ జరించు • మారు లేక
విశ్రుతానంద భైరవ • విభవుఁ డైన
మారునకుఁ దే రగుచు నిది • మలయు చుండు. 97

క. విరు లంటఁ గ వల దన్నట
సరి యని కోపంబుఁ జేయ • సమకట్టితివి
త్తరి మారు వాడితూపులు
నిరతము శాసించ కున్నె • నీరేజముఖీ. 98

సీ. అతివ కన్నడ గౌల • లితవనంబునను మ
మ్ముల విడనాడి ట్లు • మెలఁగి తేని
యబల నీలాంబరి • నై యొంటిపాటునఁ
జరియింప నేటికి • విరహమునను
చెలియ సాదాహిరి • తుల యూధికాతతుల్
చలియింపు చున్న వీ • నెలవువలనఁ
బడఁతిరో మారాచ • పట్టి నై యీవేళ
ధైర్యమించుక లేక • తలఁక నేల
చూచి తె వరాళి యిప్పు డె • రోచి చెవులు
చెవులు పడ మోయు చున్నది • చిగురుఖోఁడి

తరుణి యిచ్చోటఁ బున్నాగ • తతులు కుసుమ
విసరముల మించెఁ గనుఁగొంటె • విశదమతిని. 99

సీ. నకియరో నాగమ • ల్లికను జూచిన శంక
రాభరణంబన • నలరు చుండు
ఘనవనీచదము మో • హనమై కనుంగొను
వారికి సొంపు గా • మీరు చుండు
నీతోడిరాజక • న్నెలఁ జూచితిమి గాని
విరహార్తి నిటువలె • వేగ లేరు
రేగుప్తిలీలచే • జోగుచు నీచక్ర
వాకదంపతు లుండు • వసతిఁ గనుము
సుఖిని నై మనుకళ్యాణి • సొంపు మీఱి
యవనిగోపలఁ గళ్యాణి • నై మెలంగు
పూరితమనోరథస్థితిఁ • బొలిచియుండు
మనుచు నూరార్చి రత్యంత • వినయమునను. 100

క. విను సహసా వేరై తో
చిన వారిని విడువ వలయు • సేవకధర్మం
బున వర్తించినవారిని
వనితా విడనాడఁ దగదు • వసుధాస్థలిపై. 101

సీ. కేదారగౌళాంధ్ర • కేరళాదిక దేశ
ములనైన నిటువంటి • ఫలితవనముఁ
జూడ లేదెచట నీ • సురటకోకిలకీర
ములఁ జెందు మాకంద • ములఁ దలిర్చి
సారంగనయన వే • సారంగ నేటికే
కడు విప్రలంభశృం • గారమునను
బహుకనకాంభోజ • పద్మాకరంబులఁ
జూచితే యిచ్చోట • సుందరాంగి
కాయజుఁడు కానఁ డావియో • గమున నొంటి
నై చరించిన నిన్నెచ • నంబుజాక్షి

ధవళకుసుమములు కురవక • తరుల వెలసెఁ
గలఁతఁ జెందఁగ నేటికే • లలితగాత్రి. 102

కం. పడతీ విరహాభరం బేఁ
గడతేర్చెద నా యటంచుఁ • గళవళపడుచున్
బడలికఁ జెందఁగఁ దగ దీ
యెడ మావచనంబు నమ్ము • మిందునిభాస్యా. 103

గీ. చెలియ యీవని శ్రీరాగ • కలనఁ జెంది
చూచువారల కిష్టమై • సొంపు హెచ్చు
నతనుఘంటారవంబుల • ననుకరించి
పికసమూహంబు మ్రోయు ను • త్సుకతఁ దనరి. 104

సీ. కుంజముల్ మాలతీ • పుంజముల్ తీరభూ
కంజముల్ వేష్టిత • గుంజములు ను
సాలముల్ కుందాల • వాలముల్ సతతప్ర
వాలముల్ విలసద్ర • సాలములు ను
పూగముల్ కల్పసం • యోగముల్ శ్రీచంద
నాగముల్ మల్లికా • భోగములు ను
కీరముల్ భృంగప్ర • చారముల్ కలకంఠ
వారముల్ మధువారి • పూరములు ను
గలిగి సవిధవివిధకుట • గళితలలిత
కుసుమకిసలయవిసరను • వసనవిలస
నకనదవనీతలము నృప • నలినముఖుల
సుఖమతుల నొనరించెను • సొంపుదనరి. 105

శా. మందారద్రుకుటీతటీవిటపయు • గ్మల్లీమతల్లీగతా
నందప్రోదితమన్మథాంకజయగా • సప్రోల్లసత్కిన్నరీ
బృందాలోకసుఖైకకోకయువతి • ప్రేమాస్పదీభూతమా
రందోదారసరఃప్రతీర మలరెన్ • రాజాననల్ జూడఁగన్. 106

వ. మఱియుఁ దత్ప్రదేశంబున నహరహర్విహారదవక్రచక్రాంగప్రాంచచ్చం
చూపుటత్రుటితనాళీకనాళంబులవలన మొలఁగి వెలి కుబుకు చలి జలంబుల

తుంపురుల సొంపుఁ జూపఁ జంపకంబు పెంప నిద్రించు చమరీమృగంబుల నలరి దామరసపత్రపాత్రన్యాకీర్ణవివిధవర్ణసూనసంతానంబులు శోభారంగంబులై తనరఁ దద్విచక్షణతాదిదృక్షాపేక్షదాక్షిణ్యాతిశాయమానాంతరసమాసీనశస్తకస్తూరికామృగంబులఁ జూపట్టు మదధామసామజసముకంటకిఫలమూలఫలబంధురగంధానుసంధాననిగళాయమానాసమాన మధుపాళిజాలంబుఁ గనుంగొను సారంగంబులు సాంద్రచంద్రరంభాస్తంభానుగళదసమహిమవాలుకాహంసతూలికాశయానసంకుమదమృగంబుల వెలసి పటుపటీరకుటీరప్రదీపీభూతప్రభూతగంధిలగంధఫల్యవికలముకుళంబులనీక్షించుచుఁ గనకకందుకాకారప్రకారఫలంబులఁ గని తత్క్రసలఖాదనామోదనాకుంఠితకంఠకలకంఠంబుల నొనరి మంజరీసంభూతపింజరీభూతభూతలసమానమానితచేతోమోదంబుల మీరు కీరవారంబులఁ దనరి మఱి యును. 107

క. విచికిలవీరుద్వలయిత
నిచులాంగణసైకతాది ♦ నిర్మితవసుధా
పచితవిధాననిధానను
మచయము ఘనకచల కచల ♦ మ నమొనరించెన్. 108

గీ. చూచి తల యూచి చే వాంచి ♦ సోనతేనె
లానుసూనప్రతానంబు ♦ లానిమాని
కములగుమిఁ బెనఁగొను వటి ♦ కముల పడుకు
లడరఁ బడతుక లింపులు ♦ గడలుకొనఁ గ. 109

సీ. కీరవాణి యొకర్తు ♦ సారెసారెకుఁ జేరి
బింబాధరా యని ♦ పిలువఁ దొడఁగెఁ
గలహంస యాన యొ ♦ క్కతె ప్రమోదంబున
బిసరుహానన యని ♦ పేరుకొనియె
కలకంఠనినద యొ ♦ క్కతె మేలమున మించి
పల్లవశయ యని ♦ పలుకరించె
సింహమధ్య యొకర్తు ♦ చెలఁగుచుఁ జనుదెంచి
గజగతి యని పిల్చెఁ ♦ గౌతుకమున

కమలగంధి యొకర్తు వే • గమున వచ్చి
యలిసమానకచా యని • పిలచె నిలచి
యిటుల నన్యోన్యనామంబు • లెంచి యెంచి
చెలఁగి యారామ లారామ • సీమలోన. 110

వ. విరహవేదన నొందు నారాజసుందరికిఁ బ్రొద్దుఁ బుచ్చం దలంచి 111

క. దరహాస మొనర్ప మహా
ధరమునఁ బొన్నలు దలిర్పఁ • దరమా కన శ్రీ
దర మోపవనోదరసుం
దరగతి నీవనము జీవ • నము, మన కతివా. 112

గీ. రమ్యపరిరంభముల కల • రంట కమ్మ
లేచి పూచి రసోచిత • రోచి దనరె
మనము వెనఁగొనఁ గనుఁగొని • కొనలననలఁ
దనవి గ నాసంగ నసమయ • మనఁ గ వలదు. 113

సీ. ప్రనవస్థలంబులఁ • బలుమారు దిరుగుచు
ద్విజపఙ్క్తి మిక్కిలి • తేజరిల్ల
గణికానమూహంబు • కడనుండి పల్లవ
సందోహ మానంద • మందు చుండ
గంధోత్తమావనిఁ • గదిసి నృత్యము సల్పు
మధుపవ్రజము సంభ్ర • మము వహింపఁ
గమనీయభూపరా • గంబులను వహించి
గంధవహుఁడు మంద • గతులఁ జూప
విమలభువనస్థలీవయో • విభ్రమంబు
దనరఁ బద్మిను లతిముదం • బున మెలంగ
సార్వకాలికవైభవ • స్థానవాన
వాటిలోపలఁ దిరిగి రా • బోటు లపుడు. 114

శా. ఆశ్వాసంబు లొనర్చి పొంగుదల లా • హా యేమనన్ వచ్చునా
విశ్వాసంబులు నావిలాసములు నా • విఖ్యాతదాతృత్వముల్

శశ్వత్సుందరతేతగాత్రుల మహా • సంతోష మొందించె నౌ
విశ్వాసః ఫలదాయకో యనెడు ము • న్విధ్యుక్తముం దప్పునే. 115

ఉ. గానము సింధువారనగ • కల్పితపల్లవపుష్పసంపదా
దానము తానసంచయని • దానము రాగవిశేషమిత్రనం
ధానము శ్రోత్రసమ్మదవి • ధానము చంద్రముఖీసుఖోదయ
స్థానము నైకనం దగని • తాంతము తద్వనసీమలోపలన్. 116

మ. అదలించు న్మద మొంది ప్రేంకణము ల • త్యంతంబు కాంతాతతిం
బొదలిందున్ సుమపల్లవాదుల లతా • పుంజాంతరేలాతతిన్
మొదలించు న్మధుపాళిపాళికల న • మ్రీభూతవీరుత్తులం
గదలించుం దదుదాత్తకైశికలస • త్కల్యాణభూషావళిన్. 117

చ. జిలజిలఁ దేనియల్ వెలికిఁ • జిల్కఁగఁ గుల్కెడు ముద్దుపల్కులం
గలయ జనింప సంపెగలు • కమ్మని వాసన లాన నింపు సొం
పులు గల పువ్వుజొంపముల • ముందుకు ముం దొనరించి మించు కాం
తల నలరించె నౌర వ్రిమ • దంబున నాసురకన్నె లెన్నఁగన్. 118

గీ. భాసిముఖవాసనావాసి • తాసవంపు
తావు లంటుచుఁ గేసర • తరువరముల
విరుల నురు వగు పరువుల • దొరల నొసఁగె
ననమకుసుమాంగులకు విహా • రానుగతుల. 119

క. ముద మొదవ మదవతులకుం
బదతాడనపీడనములఁ • బల్లవముకుళా
స్పదరక్తాశోకములు వి
శదకళలం బొదలి కుసుమ • సంతతి నొసఁగెన్. 120

క. అంటిన వెంట నె పువ్వుల
నొంటు గఁ గంకేళి పండు • వొనరింపుచుఁ బూ
వింటను గెంటని బంటగు
దంటను బుట్టించు చతుర • త న్వెలసిల్లెన్. 121

వ. ఇవ్విధంబున దోహదక్రియలొనరించి. 122

క. ఆరామామణు లప్పుడ
యారామమునందుఁ గడు నా • యారంబున సం
చారం బొనరించిరి సము
దారూఢి నతానతాన • తానయుత లై. 123

చ. లలితవయోవిలాసపిక • లాపకలాపకలాపకుంతలల్
స్ఖలితమరందకందళిత • సాలరసాలకిసాలఖాదనం
చలకలకంఠగానసుఖ • సారససారససారసాళులల్
నెలకొను భూతలంబుల గ • ణింపుచు నింపు జనింపఁ బోవుచోన్. 124

క. హేలావతు లై తగినమ
హేలాతతులు పవనోప • హితవిహితవిధా
నై లాతతడోలామత
ఖేలారతల గుచు నగుచుఁ • గేరుచుఁ బోవన్. 125

చ. సవిధగధాతకీతరుజ • జాలకజాలకజాలకాంతిమ
త్ప్రవిమలసూనసంభృతప • రాగపరాగపరాగతాళిసం
భవకలనాదమేదురిత • మానసమానసమానసంతత
స్రవనదముల్ సదేశజక • దంబకదంబకదంబు లైతగన్. 126

క. లలి నీపవనాంతస్స్థిత
ఫలినీలతికారతిప్ర • పదభవవికస
న్నలినీపతదళినీయుత
మలినీకృతరదము ముదము • మదిఁ బొదలింపన్. 127

క. ఆరామాంతస్సంచర
దారామలు మాలయానిలా • ప్తిమరందా
సారసుమాసారలతా
సారగృహాంతరగతాళి • చయములఁ గనుచున్. 128

చ. వలదురు మీనచంచదని • వారితవారితవారిజాకర
స్థలకమలాళి చెంత నత • తంబు తతంబుతతంబు గాఁగ సం

చలదళిచర్మసంచయుని ♦ శారదశారదశారదంపు త్రో
వల్లఁ గలిగించి రింపు గల ♦ పాటలఁ బాటలపాటలంబులన్. 129

క. నాళీకముఖులు మదనుని
నాళీకము లనఁ గఁ దగి యు ♦ నారతవికస
న్నాళీకమృణాళీకము
రాళీకలనాదనోద ♦ రసికసరసులై. 130

చ. వనిఁ బరికించి కించిదళి ♦ వర్గవిహారముఁ గాంచి కాంచికా
ధ్వనులకుఁ జేరి చేరిక ను ♦ దంచితహంసశుకాళికాళిమా
కనపికచక్రచక్రములు ♦ కట్టెదుటన్ వెలయంగ నంగనల్
దనివి సనంగ నంగజుప ♦ దంబని చూచిరి పద్మపద్మముల్. 131

క. ఆరాదాగతయువతుల
కారాదనువమితవికసి ♦ తాగసుమఫలా
ధారామధుధారాబహు
ధారాకటదళిపికాది ♦ ధారలు దోచెన్. 132

వ. ఇవ్విధంబున నందోచ విహరింపుచుఁ బుష్పాపచయంబుఁ జేయం దలంచి

రగడ.

సారసారరజోభరము కా ♦ సారసారము నై తలిర్చును
భూరిభూరినగంబు లిప్పుడు ♦ బూచెఁ బూచెలువంబు దనరఁగ
జాతిజాతిలతావితానము ♦ జాలజాలకములను స్థలకం
జాతజాతసుమంబులను వెద ♦ చల్లఁ జల్లదనంబు నగు ని
ప్పాటఁ బాటలతరులు దగఁ బరి ♦ పాటిఁ బాటిత తామరసకర
హాటహాటకగర్భవాహము ♦ లమర నమరనగంబు లలరెను
గోర గోరంటలను జిదుమం ♦ గోరఁ గోరకములు తొలంగం
బారు బారులు గట్టి సరసపు ♦ పలుకుఁ బలుకుచుఁ గీరచయములు
మలయ మలయసమీరణుఁడు వే ♦ మరు మరుండు ను నెమ్మనంబులు
కలఁగఁ గలఁగుడు వరతు రదె ని ♦ క్కరంబు కంబుసమానగళ యి
క్కురువకురువకతరులు నిక్కలి ♦ గొట్టు గొట్టు పడంగఁ జేయఁ గ

విరియవిరియఁ గఁ బూయఁ దలఁపని • వింత విన్ తరుణీమణిరో యీ
సరస సరసవిలాసమున నీ • సరసి సరసిరుహాక్షికో యి
త్తరిఁ దరింప వశంబు మనచెం • తలఁ దలంకఁ గ నున్న దీయెడఁ
గిలికిలిత కాంతిగల కం • కేళి కేళికి యోగ్య మా యీ
పాళి పాళీనికర మలరులఁ • బర్వఁ బర్వక వచ్చి యీరస
దాడి దాడిమతరులఁ గను మిం • దాక దాకలఁ గనిన గతి నీ
వాడ వాడని ననలు వని చెలు • వమ్ము వమ్ము గఁ జేయ నీకే
సరము సరము లొసంగఁ గొన వే • సర సరకుఁగొన కుందు తగ బం
భర భరంబులఁ దెగడినను వెం • బడి బడిం జను దెంచు నీయెడఁ
గదలి కదలిఁ గనుంగొనవె యొక • కంటఁ గంటకిఫలగణము న
మ్మదమదవతుల కిష్ట మగు గుణ • మనికి మనికి నొనర్చు నీవన
భూమభూమహనీయగీతులఁ • బొగడఁ బొగడలు పూయ వలవుల
సామి సామిహితప్రదములగు • సారెసారెఁ గనం దలంచిన
రమ్ము శుకనికరమ్ము సహకా • రమ్ము పై నుకరమ్ము గా గను
గర్విమ్ముకొని పైకమ్ము గూయను • కమ్ము మీర రకమ్ముఁ జెందెను
రామ యీయారామపదము ని • రామయం బగు రామచిలుకను
నేమమున నుజ నేమ యీవన • నేమ మరయ వినేమ యలితిం
గొమ్మ యీపువు గొమ్మ నికఁ జే • కొమ్మ నెమ్మది కొమ్మఁ జేయను
అని యివ్విధమున ననితరసాధ్యపు
వనిఁ దిరుగుచు జవ్వనితోఁ గూడుక
కలుకులు వనిలోఁ గలికాయుతము గ
ఫలచయమును జంఫలనిచయమ్మును
దళములలోపల దళము గ నింపున
నలరుచుఁ దిరిగిరి యలరుచు లెనయఁగ. 134

వ. ఇవ్విధంబున. 135

క. శీతలభూతలజాతల
తాతలసుమసముదయాప • తద్రసధారా

పాతానిలనీతావిల
శీతాచలగాత్ర లైవ • సింపుచు రాఁగన్. 136

సీ. హరిహరియోపలకుట్టి • మావనితలములు
కాలాగరుజధూవ • కళ వహింపఁ
బద్మరాగపవిభా • ప్రాజ్యస్థలములు నీ
రాజనభాజన • తేజ మెనయ
శశికాంతకాంతభూ • సరణులు శ్రీగంధ
బంధురపాత్రపవి • భావ మొంద
సురభికుంకుమరజో • భరధరాభాగంబు
సాక్షితచ్ఛదపుటం బగుచు వెలయ
బహువిధాగమకుసుమసం • భవపరాగ
నికరమవ్యక్తపరిమళ • నియతిఁ దనర
రమ్మర మ్మని కలకల • రవవిహంగ
రుతి నాసంగించె నాక్రీడ • రోవరంబు. 137

క. చూచి తదోచితవృత్తుల
కాచిలుకలకొలుకు లలరి • యంబుక్రీడా
ప్రాచుర్యసౌఖ్యమునఁ ద
త్సేచనమునఁ దనరిత ద్వి • శేష మరయుచున్. 138

వ. చనఁ జన వసంతలక్ష్మీమాధవసంభోగక్రీడాసుందరమందిరాయమాణమా
నాతీతనూతనలతావితానసమంజసకుంజంబులు ను దదీయహంసతూలికాకేలి
కానల్పతల్పసూచకరోచదుపాంతకాంతద్రుమాంతలతాంతపరివ్యాప్తసాంద్ర
చంద్రోపలస్థలంబులు ను నలయ వలయీభూతసదేశరిరంసుహంసకంబులు
ను తత్సమయజన్యాన్యోన్యగళరవాయితకలరవకోకిలముఖసుఖవికారవిహ
గరుతంబులు ను విలసితరతికూజితయూ ష్లార్థముహుర్ముహుర్భాషణాయమానక
పోతజాతహుంకృతులు ను తద్భ్రమజలక్షణతోడ్కవారకంబులు ను గుచమం
డలమండితకుంకుమసంకుమదమృగమదాదిబంధురగంధధసాయితసవిధవివి
ధకుసుమవిసరానర్గళనిర్గళన్మధూదకంబు ను ఇతస్తతఃపతితవిలులితాలకజా

లాయమానపరితఃపరిభ్రమద్భ్రమరసముదయంబులు ను ఘనస్తనపీడనసమ్మర్దలూనశారహారాయితసమీరకుమారాందోళితసుమితలతావితానంబు ను మధ్యమధ్యరతిఫలమధుసంగతభృంగారూభవన్మరందబృందభరితపత్రపుటపాత్రనికరంబు ను గలిగి విప్రవరసేవ్యం బై సుమనోంచత్సవనభూమి తెఱంగునఁ గాంచనప్రభాభిరామం బై భూరిధరాధరంబ నఁ జందనపల్లవవిలాసాస్పదం బై గణికానివాసంబుగతి నతివిచిత్రపత్త్రరథపాలనశీలం బై విగ్రహభూతంబుపోలుపున నుత్కలికాసమన్వితాంతరాధారం బై శ్యామానికరంబున మించి జడాశయప్రసాదకృదభిరామం బై దేశికోక్తమహావాక్యం బనఁ దగి సమీరకుమారవిహారం బై యారామపదసాన్నిధ్యం బనఁ దగి దేశోపలక్ష్యమాణశంఖచక్రసుపర్ణవిష్వక్సేనాదిసమన్వితం బై మాధవలోకంబువడువున వశీకృతరాజహంసమండలమకరకచ్ఛపకుందాద్యలంకృతం బై శ్రీదవైభవంబురీతి సుగంధబంధుర సుమనోనివహం బై దివ్యనికేతనంబుభాతి నరుణహరిత్పత్రవిలసనం బై లోకబాంధవపథంబునేర్పున నిగమాంతామోదచరధ్వనప్రియాలాపకలాపం బై కమలభవసదనం బన మించి భద్రశకునిబాలవకులోపేతం బై కరణప్రదేశంబురీతిఁ గర్కటమీనసహితం బై రాశివిలాసంబుగతిఁ బుష్పవత్క్రాంతేతస్థలం బై నభఃప్రదేశంబుభంగి బహుళరజోభరం బై గంధవహాగారం బనఁ దోఁచి స్వాభామృతాధారం బై శుద్ధవస్తువువిధంబున మెఱయు సరోవరంబు సిరి కరు దందుచుఁ గుందరదనలు ముదంబున. 139

క. స్థాపితతరణిహరిహయవి
ధూపలఘనకనకనికష • ణోపలరేఖా
రోపణసోపానోపల
కోపరిబాగ్ధాగధగ్య • యోగ మరయుచున్. 140

సీ. లాలితమణిమయా • లంకృతుల్ సడలించి
పంచాస్త్రదివ్యప్ర • భల వహించి
శాలిచోలనిచోల • జాలంబు లెడలించి
సుమబాణబాణవి • స్ఫూర్తిఁ జెంది

వికసితబంధుజీ • వకజపాకంకేళి
కర్ణికారచ్ఛవి • కాండమనఁగ
వరుణశోభనగృహ • స్ఫురదురుకరదీపి
కానేకదీప్తిసం • తానమనఁగ
పద్మినీప్రియవిరహాసం • భవదవాన
లస్ఫులింగప్రకారవి • లాసమనఁగ
మిన్నుడిగ్గియగోపలి • మేలితమ్మి
సంచు దా మింట నెరసంజ • మించెనపుడు. 174

వ. మఱి యు దివసమహిషరుధిరధారాప్రవాహంబనన పరమహార్ణవతటస్ఫుటితవి
ద్రుమలతావితానప్రభ యన గగనకాసారవికస్వరారుణకంజపుంజప్రకా
శంబ నఁ గందర్పరథతప్తకాంచనకేతనద్యోతం బన నభస్సౌధశోణపతా
కాదీప్తి యన స్వయంవరగృహీతపీతాంబరలక్ష్మి యన రక్తాంబరధారితప
స్వియన సాంధ్యరాగంబు మించిన. 175

సీ. సౌరవాహనజిగీ • షానటదస్త్రాద్రి
గహనవాహద్విష • త్కేళిలనంగఁ
దర్ప్పురముకుళీకృ • తవనజనిస్పృహం
బరచరన్మధుపాళి • పాళి యనఁగ
సుఖకరేనవియోగ • శుకవద్మినీస్పృష్ట
సాంజననేత్రాశ్రు • పుంజ మనఁగ
వరుణాంగనాలక • విరచితసంస్కార
కాలాగరుజధూప • కాంతి యనఁగ
వనభవకరటికరటస్ర • వన్మదాంబు
సమ్మిళద్ధరిహయశిలా • స్తరణసరదు
దారనిర్ఝరజద్యోత • వార మనఁగ
రహీనవీనతమఃప్రచా • రంబు మించె. 176

వ. మఱి యుఁ బ్రదోషసమయనటనపాటవనీలకంఠకంఠనీలిమం బనఁ బ్రకుపి
తతారకదైత్యబల మన నిఖిలశాస్త్రాపహారకకృష్ణవర్త్మమార్గంబ నఁ గామి

నీకేశసంస్కారధూపధూమసమర్ధితంబై మధుకరనికరమేచకితకరివరకపోలగళితదానధారాప్రకారంబై వితతతమాలకాననలీయమానంబై పాంసులాకలితౌషధంబన నింద్రనీలమణిమృదితంబై యంధకారంబు దోఁచిన.

సీ. వదములఁ దొట్రుపా ♦ టొదవ నస్ఫుటములై
వాక్యముల్ వెలయ జ ♦ వంబు లేక
సారసాలంకార ♦ చాతుర్య మెడలంగ
విగ్రహంబుల సౌరు ♦ వెడలు చుండ.
విగతసంశ్లేషల ♦ వెలవెలఁ బోవుచు
వృత్తిశూన్యత యొక్కి ♦ వింతఁ దెల్ప
సుమహితశయ్యావి ♦ ధము లేర్పరింపక
యెదుట విపాకముల్ బొదలు చుండ
విరసరీతులు దోఁచంగ ♦ విమలినాంత
రాశయాభావమున మెప్పు ♦ రాక కుకవి
నిర్మితంపు ప్రబంధంబు ♦ నెలవు గలిగి
సందులను గొందులను దూరెఁ ♦ జక్రకుకవి. 178

గీ. మొదల సద్వ్యవహార ♦ మును ద్విజసంతాప
కరము నలతమోవి ♦ కార మగుచుఁ
గాలభేద మపుడు ♦ గన నరాజకమైన
నేమి దెలియ వచ్చు ♦ నిల జనులకు. 179

చ. తొలిఁ గల వైరముల్ దలఁచి ♦ తోరపు చీఁకటి మూఁకలెల్ల నా
వెలుఁగుల యేని చుట్టముల ♦ వేమరుఁ జుట్టి కలంచి మించి యా
కెలతల్లల న్వహింపుఁ డని ♦ కేలిఁ గొనన్ మలినప్రభాననం
బుల నలచక్రదీపచయ ♦ ముల్ చెలఁగెన్ గృహసీమలం దొగిన్. 180

క. ఆరొడఁ గులటలఁ జీకురు
వాయులు బొగడంగఁ ద్రోవఁ ♦ బట్టుచు ఖద్యో
తాయాతరుచులు దివియలు
గాయ గణికలనుచు వెడలఁ ♦ గౌతుక మలరెన్. 181

చ. మొగు లను వల్క మీఁదను బ్ర • మోదముతో నజుఁ డిజ్జగంబు లి
చ్ఛ గ గణితోదితార్థగతి • సంఖ్యయొనర్చి తదన్వయక్రమ
ద్విగుణిత మైన యొద్దు నిడి • తేకువతో గుణియించి సున్న లం
తగ నొనరించునో యనఁ గఁ • దారకలు ల్లసిలె న్మహోన్నతిన్. 182

వ. మఱియు సంధ్యాసమయతాండవాడంబలోచ్చలితమహానటజటాజూటవర్తి
తరంగిణీతరంగలింగత్పృషత్పరంపర లన దిఙ్మాతంగకర నిర్ముక్తతుషారని
కరంబు లన నభ్రభ్రమణఖిన్నదినకరతురగముఖవిశీర్ణఫేనకణంబు లన
వియత్సరోవరప్రకటవికసితకుముదసముదయం బన జగత్త్రయజిగీషామనీ
షానిర్గతానర్గళభుజార్గళమకరకేతనశిరః ప్రసారితరతిసతీకరతలాగతలాజ
లన ఖస్థలకలశపారావారడండీరఖండంబు లన వ్యోమపదలక్ష్మీవక్షోవిహా
రహారతారముక్తాఫలనిచయంబు లన నాకాశమహాస్థాలీభజ్యమానలాజల న
విహాయస్స్ఫాటికఫలకవిలిఖితమదనవిజయశాసనాక్షరంబు లనఁ దనరి.

గీ. గరుడగంధర్వకిన్నర • సురముఖాంబు
జాననాళివమస్తక • న్యస్తకుంద
మల్లికాఫుల్లసుమనస్స • మాజ మనఁ గ
సురపథంబునఁ దారకా • ఘరము దోఁచె. 184

వ. అట్టి యెడ. 185

గీ. వేయియోములతో గంగ • డాయుట యను
దదభిముఖము గ వచ్చు ప్రా • గుదధిమగుట
తటఘటితహీరవరవిభా • పటల మనఁ గఁ
దొలుత దెస వెన బలు నైన • వెలుఁగు దోఁచె. 186

క. హరుఁ డంతరజస్సత్వా
కరుఁ డై వరుఁ డై తమోవి • కారము దూర
మ్ము రయము గఁ ద్రోఁచె గను గతిఁ
జిరము గ నిలుకడలు లేక • చీఁకటి విరిసెన్. 187

మ. కర మవ్వేళఁ బ్రసాధికల్ హరిహరి • త్కాంతం బ్రబోధప్రభా
కరముక్తామయభూషణావయవ గాఁ • గై సేయుచున్ వక్త్రికం

ధరవక్షస్స్థలులందుఁ గుంకుమను విం • తం దిద్ది రో నాఁగ నా
కరణిన్ రేక యి స్వామి రాయై సకల మై • కంజారి యొప్పెఁ వెసఁగ. 188

వ. మఱి యు రజనీరాజకన్యాకరగతకనకకందుకం బన నుదయగిరిబాలమం
దారపుష్పస్తబకం బనఁ బ్రాచీమహిళాలలామలలాటతటబంధురబంధూక
తిలకం బన నభశ్శ్రీప్రతప్తజాంబూనదకుండలం బన దిగ్వధూప్రసాధికాప్ర
శస్తహస్తన్యస్తాలక్తకపిండం బన సురపథశాతకుంభకుంభం బన మకరకే
తనప్రస్థానసమయమంగళకలశం బనఁ బురందరాశాసతీకుంకుమారుణస్త
నమండలం బన నుదయరాగసముజ్జ్వలుం డై చంద్రుం డుదయించి తదనం
తరం బ యామినీగోపాంగనావిసృతనవనీతఖండం బనఁ గుసుమశరశ్వే
తచ్ఛత్రం బనఁ దచ్ఛితచామరం బన వ్యోమతపోధనకరధృతస్ఫాటికలింగం
బన నంబరమహార్ణవశంఖం బన మందాకినీఫేనపుంజం బన ధాతృశాదిపా
ణిగతపారదం బనఁ గందర్పధవళచారుచక్రం బన సురపథసౌధపాండుర
పారావతం బన వియద్దైరావతశుంభత్కుంభస్థలం బన సిద్ధాంగనానీజితసి
తతాళవృంతం బన మన్మథసాయకకషణహరిణశాణచక్రం బన సకలజగ
న్నియామకదివ్యకీర్తికాంతారత్నరుచిరాననం బనఁ బాంథనికరజైత్రయా
త్రావిజృంభమాణపుండ్రేక్షుకాండాసనకుండలీకృతకోదండం బనఁ బౌరు
హూతదిక్పురతస్థాపితరాజితవజ్రకీలితపీఠం బన స్వస్తరంగిణీపరిభ్రమత్సా
రసం బనఁ బూర్ణప్రకాశుం డై యుండె నట్టి యెడ. 189

గీ. హరుఁడు నిజమంత్రసామర్థ్య • మలరు భూతి
నిల కలుషములు బోఁ గొట్టఁ • దలఁచి పెలుచఁ
బరపె నో యనఁ గాఁ గడ • తెఱుఁగ లేక
విరిసెఁ జీఁకటి వెన్నెల • తరుచు మెఱసె. 190

సీ. సరసీదరుల నుండు • జవ్వాది మెకములు
క్షీరస్పృహను వారి • పూర మానఁ
గలితఝిల్లాంగనల్ • కైతక భ్రాంతిచే
నెలమావి చిగురుటా • కులు ధరింప

ముదితనిషణ్ణేభ • ములు కుంజములఁ జూచి
హరిభీతిచే మహా • దరులఁ దూర
జారకామినులు వృ • క్షచ్ఛాయలను జూచి
యారెకుల ను భీతి • నొర కొదుగ
వేలుపులఁద్రోవ సిరి పెండ్లి • వేళ సకల
దివిజు లెడతెగ కుండ సం • ధించినట్టి
మహితకళఁ దగు వెన్నెల • మడుగు లనఁగ
నిండు రేయెండ జగముల • నిండి యుండె. 191

క. చెలులా రచూడుఁ డిదె మన
చెలు లారసి విలసదచ్ఛ • సీధురసము వె
న్నెలరారా ల్గల గిన్నెల
నలరారం దెచ్చి రనుచు • హర్షం బెసఁగన్. 192

క. పానము సేయఁ దగుపయః
పానము దధిపాన మమృత • పానము హాలా
పానమునకు సరి గా దను
మానము మానసమునందు • మలయుచు నుండన్. 193

వ. అది బహుదేశసముద్భవంబు కట్వామ్లమధురతిక్తకషాయాస్వాదనంబు వకుళముకుళపరిమళోల్లాసంబు సర్షపసహితాభిషవోపదంశంబు గల గౌడీమాధ్వీపైష్టీ కాదంబరీ హింతాళీ, తాళీ, నారికేళీ, ఖార్జూరి, ముఖవృక్షసంభవం బైన గంధోత్తమాదానంబునం దనరి ఫాణితైలాచూర్ణభరితసద్యోఘృతపక్వసంస్కారపూపములు కొన్ని మరీచమిశ్రీభవత్తరుణమేషాదిరమణీయపలలశూల్యములు కొన్ని గంధిలద్రవ్యానుబంధబాలవిహంగతరసగస్వర్ణపాత్రములు కొన్ని సమ్యక్సితోపేతశష్కులికాధారఖార్జూరమయపుటకములు కొన్ని లవణార్ద్రకవిశ్వభేషజసమేతధన్యబష్కయణీమండదధిసమృద్ధశాలితండులభక్తంబు సంగ్రహించుకొనుచు నారాము లవ్వేళ వినయములర. 194

క. సుమితకదంబదంబక
కమనీయపరాగ వేది • కాస్థానుస్థ్రీ
రమణీమణి నర్చించిరి
సముబుద్ధిని షోడశోప • చారవిధుల శేక్షా. 195

సీ. నవరత్నఖచితవీ • ణావాదనవినోద
సంగీతరసిక శ్రీ • సరసిజాక్షి
లలితలీలాశుకో • ల్లాసిని బింబోష్ఠి
సరసయావకయుక్త • చరణనఖర
యంచితాకీర్ణకే • శాళిక హృద్యాంగి
సితశంఖతాటంక • యుతసువర్ణ
కమనీయమణిపరి • ష్కారసముజ్జ్వల
సస్మితాధరపూర్ణ • చంద్రవదన
యగు మహాలక్ష్మి కుపహార • ము గ నొసర్చి
వలయితస్థితిచే మధు • వారముకకు
దారతమ్యవిశేషత • త్వరత దనరి
గోష్ఠి సల్పిరి యాముద్దు • గుమ్మ లపుడు. 196

వ. ఇవ్విధంబున మధుక్రమంబునం దవిలి కాండజకాండప్రకాండపుండ్రేక్షు కోదండకాండానసపాండిత్యహిండితం బైన చంద్రమండలంబు నెలుంగ నెలచలుపలు గఱంగి జిలజిల జాలు వారు నీరంబు పన్నీరంబునం గలసి లోరంబు లైన యారంబులం దగు కుసుమసముదయంబులవలన వలపుఁ జెందుమరందబృందంబు నొందుచు స్ఫటికఘటితంబు లైన పడకుల నడరి గంధేభయానలకు గంధోత్తమాభ్రాంతిఁ బుట్టించుచుఁ బజ్జలం జెలంగు గుజ్జుగొజ్జంగులవలని చలిజలంబు సొంపు సంపాదింపు కెంపు జొంపంబులం గల చోటుల నిలచినఁ గాళ్యమద్యం బని మదవతు లెదఁ గుదిరిన ముదంబు నఁ గ్రోల గమకించి తత్ప్రతిఫలితంబు లగునిజనేత్రంబులు సంసారార్ధ్రప తిష్ఠోత్పలదళంబు లని కరంబుల నంటిన నవి యంట కుండుటఁ దెలసిన వ్వుజవ్వనులు సు హరిహరోపలవిపులాతలంబులం దొట్టిన తేటచలినీటిం

జూచి ద్రాక్షాఫలరసవిసరంబుల జనించు మాధ్వకంబ ని కొందఱు ముగ్ధాంగనలు పభోగింపం బోయి నిజాననంబులు బింబించినం దద్వాసనార్థంబుగా నొనరించు కమలంబు లని భ్రమించి రిత్త యగుటకు నబ్బురంబు నొందువారును గలిగి జిగిగరగరికలు గల పచ్చలవిచ్చలవిడిగ్రచ్చుకొనివచ్చునచ్చంపు పన్నీరు చెఱకురసంబున జనించు నాసవంబ ని యాన గమకించి స్వీయనాసికలందుం దోంచిన గంధఫలీకలికల ని విచారించి నిశ్చయింపనివారు ను బుష్యరాగంబులు గల చోటుల గాటంబు గా నిండిన సేవంతికాసూనతానగళన్నీరపూరంబు తేనియవలన సంభవించు మాధ్వాసవంబ ని క్రోలం దలంచి దవ్వు దవ్వులం బోవు చెలులం బిలచుకొని కలసి యాస్వాదింపం దదభావం బగుట కరు దందు వారు ను గోమేదికంబుల నెలవున నలముకొను పుష్పరసంబు ధాతకీ శ్రీమానమిశ్రితగుడసహితధాన్యాంబుకృతం బైన మైరేయం బని త్రావం బోయి సిగ్గు నొందు వారును సొగలు గల మగమానికంబుల నిగనిగను లోయల వెన్నెలతేటను దీఱుకొను వలినీరు పైష్టికం బైన మాధ్వీయని తలంచి తారసిల్లి తెలివి నొందువారు ను వైదూర్యంబుల విలసిల్లు కలుగుల నలరు తెలిసలిలంబు బాలతృణమూలసంజాతహాలావిశేషం బని కదిసి పిమ్మటం బోవు వారు నై సాంద్రచంద్రాతపక్రీడావినోదంబు ను ప్రసన్నప్రసన్నపదంశప్రత్యవసానంబునం దవిలి తరువుల కాంతులం గని లాతివారు చనుదెంచి రని భయంపడి నిశ్శబ్దంబు గాం బానశాలాపురోభాగంబున నాడుగు వారు నస్మృతివిశేషంబున భూషాంబరాదుల వ్యత్యయస్థితి ధరించువారు నై చంద్రాంగదదర్శనార్థమహామునితపస్సంకల్పితం బగు నుద్యానవనంబునం దిరుగు మెఱుంగుమెఱుంగుబోండ్లం గనుంగొని యా కీర్తిమాలిని యాలంబనగుణం బైన రూపయౌవనాదికంబును యౌవనోద్భూతంబు లైన హావభావాదికంబులు ను దదలంకరణంబు లైన నూపురాంగదహారాదులు ను దటస్థోద్దీపనప్రవర్తకు లైన మలయానిలచంద్రాదులు ను స్ఫురించిన నంత కంతకు వలవంత యగ్గలం బై తోంచ విరహభరంబున నొక్క మంజరీసంజాతసింజానమధుకరీపుంజరంజితకుంజాంతరంబున నిజసఖులం గన్గొరంగి వసించి. 197

సీ. కన్గవయీక్షణా • కాంక్షచే విలసిల్ల
జిత్త మభీప్సితా • యత్త మయ్యె
సంకల్పము తదేక • సరణిచే వర్తిల్లఁ
గృశత నెమ్మేనున • విశద మయ్యె
నరతి మిక్కుట మై దు • రంత మై కనుపట్ట
హ్రీత్యాగ మధిక మై • యేపుఁ జూపె
నున్మాద మవ్వేళ • నుద్వేల మై యుండ
మూర్ఛ మున్ బ్రబలి యు • ద్బుద్ధ మయ్యె
నంత్యమూర్త్తియు సందేహ • మై తలిర్చె
ఘోరతరవిప్రలంభశృం • గారమునను
దగుననంగదశాదశ • స్థానమాన
సమునఁ జింతాభరంబునఁ • దెమలి తెమలి. 198

వ. మఱియు స్తంభప్రళయ, రోమాంచ, స్వేద, వైవర్ణ్య, కంపా, శ్రు, వై
శ్వర్యంబు లను సాత్త్వికభావంబులు నిర్వేద, గ్లాని, శంకాసూయామద
శ్రమా లస్య దైన్య చింతా మోహ స్మృతి ధృతి వ్రీడా చపలతా హర్షా వే
గజడతాదు లగు సంచారిభావంబులు ను మనంబునం దోచినఁ జింతాసం
తాపసమ్మోహనిశ్వాసభరంబు నొంది యుండు నట్టియెడ. 199

క. పెనఁగొనిన విరహబాధను
మనలం దిగనాడి కీర్తి • మాలిని యెట కే
గెనొ యరయ వలయు నని నె
మ్మనములఁ గనికరము దోప • మగువలు వేగన్. 200

శా. రారే ముద్దులగుమ్మలార వెదుకన్ • రాకేందుబింబాస్య యీ
రాజన్యుని స్వాత్మలో నిడి కృశిం • చెం జూడరే నేఁడు దు
ర్వారాకారవిహారమారకృతసం • త్రాసాధిక వ్యాధిమ
చ్ఛారీరాద్భుతినోదనశ్రమజలా • సారంబు లోరంబు గన్. 200

వ. అని వితర్కించి. 201

శా. నానాసూనరసాతిరేకమధుపా • నల్ చేతనాచేతనా
జ్ఞానానూనలు వ్యత్యయావయవసం • ఛన్నాంశుకాదుల్ గళ
న్న్యూనధ్వానవితాన లైన నవలా • లున్మత్తమత్తేభరా
డ్యానాన్వేషణభాషణంబులఁ దదా • యత్తైకచిత్తంబులన్. 202

సీ. తరులలోవలఁ దీవ • దరులతావుల నేటి
దరులకోవుల వింత • లరసి యరసి
తొగలచాయలను సం • పెగలవాయలను గొం
పుగలలోయలను వెన్ • దగిలి తగిలి
సరములన్ వీరుదం • తరములన్ మకరంద
ఝరములన్ మిక్కిలి • మెరసి మెరసి
విరులగుంపులను గ • ప్పురపు పెంపులను సం
చరపు వంపులఁ జాలఁ • దిరిగి తిరిగి

దారువుల సారువుల మీఁదఁ • దడసి తడసి
నేలలో మాలెలోఁ జొచ్చి • నెమకి నెమకి
యూరముల తీరముల పట్టు • లెక్కి యెక్కి
రేవులను బావులను జెల • రేగి రేగి. 203

సీ. మదనాగ చూడ వే • మదనాగయానను
లకుచ చూడ నె వర్తు • లకుచ నిపుడు
కరవీర చూపు భీ • కరవీరపుత్త్రిక
జీవక చూపు మ • జ్జీవకసఖి
పాటలమాయాట • పాటల వింటి వే
చంద్రి చూడఁ గదె మా • చంద్రముఖిని
పొగడ మే మెంత నిన్ • బొగడ వినవ దేమె
దాడిమా గట్టైన • దాడి మానె

దంట గోరంట నీకింత • కంటసం బె
పల్లవంబ నిమేషనం • పల్లవంబ

కోరకమ్మ వియోగముఁ • గోరకమ్మ
వకులమా నీదు నీచభా • వకులము గదె. 204

క. మాలతి భవదావరణత
మాలతిమిరవిహరణమున • మసలెద వదె యో
యేలాలత మమ్మేచెద
వేలా లతకూనఁ జూప • విది విదితం బే. 205

క. కైరవమా వింత గ నిట
కైరవమాయె నిది యేమె • యాలింపు మయో
సారసమా మకరందా
సారసమా కృష్యమాణ • షట్పదచయమా. 206

గీ. వేఁపమాన మధూద్వృత్తి • వేపమాన
మానవతులను గారించి • మానవతులఁ
జెందలేవు గదే చూపు • సుందరాంగి
దాకతీవె మరుంగు లెం • దాక తీవె. 207

క. వనజము బంధురగంధిల
వనజమహితలతలనీడ • వాడ వదే కో
కనదమ నిన్ని దైకో
కన దమతరుణీలలామ • కైమే లగుటల్. 208

గీ. అనుదు ననబోఁడు లత్యంత • వినయ మనువు
పడఁ గగుడమిశ్రితాసవం • బడు గడుగున
కొడ లెఱుంగక కోరిలుట • లు డిగి పడఁతి
నడరు మతి రోయుచును డస్సి • యలయికలచేఁ. 209

గీ. తిరిగి పేసరి యాసరి • తీరభూవి
హారహారాయమాణకాం • తావతార
కేనసుముఖీసఖీతతుల్ • యేన కేన
సా ఖవే తిష్ఠం సుఖిని యని • సంభ్రమమున. 210

సీ. పోవఁ బోవఁ గఁ దోఁచెఁ • బుడమిఁ దమ్ముల దొమ్ము
లడర బెడం గైన • యడుగు జాడ
లరయ నరయ వీరు • దంతరాంతఃపాతి
తప్రసవంబుల • తలలు మెరసెఁ
జూడఁ జూడఁ గ నొక్క • చోట గాటం బైన
యాటుతేటులపాట • లమిత మయ్యె
విని విని తారిన • విద్రుమాధర వేయు
వీడెంపు వాసనల్ • వెడద యయ్యె
దరియఁ గదిసిన నొక తీవ • దరి విరి పొద
క్రింద నందము గాఁగ గ్ర • క్చందనాదు
లం దగులొక్కను కురువింద • పంది లంది
చొక్క మైనట్టి కపురంపు • టిక్క దండ. 211

మ. సవిశోద్దీర్ణసుధార్ణవీభవదవ • శ్యాయోదకావాలభూ
లవలీచూతలతావితానసహితై • లామల్లికావల్లికా
భవనాంతస్స్థమినీకకోపలతల • ప్రాయఃపతత్పుష్పసం
భవశయ్యాగతగంధవాహకృతస • న్మానం బపేక్షింపుచున్. 212

వ. వసించు చెలిం జూచి. 113

క. వికవిక నగి సకియరో నీ
వకటా నికటాధిరూఢ • హరిణాంకమరు
న్మకరధ్వజమధ్వాదులు
తుక తను వుడికించ నిటులఁ • దూకొన నగు నా. 214

చ. తలక వ దేమి వింత గల • దాకల దావర మైన మే మిదే
వల దని పల్క నల్క తగ • వా మగువా చలపాది రైన యా
వలపుల రేని రీతి విన • వా కన వా యిటువంటి చోటులన్
నెల వొనరించ మించు మతి • నీ కగునా తగునా వియోగినీ. 215

శా. తాపం బేపగిదిన్ వహించితి నిరా • తంకాంకగాపాదిత
వ్యాపాదుల్ దురరుంతుదోన్మదవచో • వక్త్రద్విరేఫోదితా

టోపుల్ కోపులు మన్మథపత్రిభృత్తులై • ట్టోకా నినుఁ బైచుటల్
భూపాలాత్మజ నైన నైన మనయుం • బుఁ బంచి దూషించినన్. 216
క. అన నహరహర్విరహజద
హనవహనాసహనచిత్త • రై ప్రకటపునః
పునరంగనాపత్రిచోదిత
మనమున నాకరీతి భీతి • మల్లడిఁ గొనఁ గన్. 217
చ. నెలఁతల మూఁపు లాపులు గ • నీడల నీడల నాఁక కాడకున్
నిలచి యొకింత చిఁతిలుచు • నివ్వెర గందుచుఁ గుందుచు న్మొయిన్
బులకలు జెంద డెందమునఁ • బొక్కుచు నొక్కుచు నుస్సురంచు హా
యలరులవింటిదంట నెగ • టారెఁ గదే జగదేకశూరుఁడై. 218
వ. అని యాచేడియలలోఁ బోఁడ యగు నొక్కపూఁబోఁడిం జూచి. 219
మ. నెలఁతా వెన్నెల తాపమై మయికడా • నిం గాచె నేఁ జేయు టే
మె లతాకోమలతాంచితా వినవదే • మే మన్మథుం డేయు న
మ్ములతా తాళనతాఖిలావయవనై • పుంస్కోకిలాలాపముల్
గలతానాకలితాళిసంతతి మెలం • గం గంటి వే వచ్చలీ. 220
గీ. ఏమి సేయుదు విరహార్తి • నెట్టులోర్తు
గాము వలె డాయుఁ కాము నే • కరణి గెలుతు
నేరుపడల నైన నీమాటఁ • దోఁయ లే నె
నెలఁతరో యని పల్కనఁ • బోలఁతి వినిచె. 221
చ. రహి విడనాడఁ గూడ దన • రాళమరాళ కరాళభాషణా
సహనము చేత మారునకు • సాయకదాయకనాయకాఖ్యుఁ డా
బహుళతరప్రకాండసుమ • భారవనారవిహారచైత్రుచేఁ
దహతహ నొంద నేల ముని • తా విదితావిదితం బెఱుంగఁగన్. 222
మ. అని యీరీతి ధరామరేంద్రసుతతో • నాలేమ ము న్మల్లమె
ల్లన నేర్పొర్పున సాధువాక్యములు దె • ల్పన్ స్వాంతజాయల్లకం
బను వేలానలకీలజాలము గ ది • వ్యారామసీమాంతరం
బునఁ జె న్నొందిన భేదభేద ములరం • బురజీభవత్తావు రై. 223

మ. లలనారత్నము నిండు వెన్నెలకుఁ జా ♦ లన్ లేక పైశాతకుం
చల మాస్యంబునఁ జేర్చి యేడ్చె సుమధ ♦ శ్యామాకరాంభోరుహా
కలితగ్రామవిశేషకశ్రుతికళా ♦ కాలక్రియామూర్ఛన
ద్విలసత్కన్నడగౌడమేళకలనా ♦ వీణానుకారధ్వనిన్. 224

క. అని పగచి నునుపు మొనఁ గనఁ
దనరిన గేదంగి సురియ ♦ దరి నదరించన్
గనికరములఁ గరముల నా
కనకాంగులు గ్రుచ్చి గ్రుచ్చి ♦ కౌఁగిటఁ జేర్పన్. 225

క. వల దని వనితలు లవలీ
వలదనిలచలితలతాగ్ర ♦ వర్తనమువఁ గ్రే
వలఁ దవిలి నిలువరింపన్
వలఁ దవిలినమీనురీతి ♦ వనిత వడంకెన్. 226

గీ. ఇటుల వడఁకిన నన్యథా ♦ వృత్తివర్త
నములఁ దవులనియింద్రియ ♦ నటనలైన
తనువలగ్న లోకించుక ♦ తడవు సుడువ
నాలు కాడక నా డాడ ♦ జోడు గూడి. 227

గీ. విప్రలంభార్తిచేఁ జిక్కి ♦ వెలఁది సొక్కి
దీని కొక్క యుపాయంబుఁ ♦ బూని వలయు
ఫలకవిలిఖితతత్స్వరూ ♦ పంబుఁ జూపి
శాంతి నొందింత మీవంత ♦ కొంత దీర. 228

గీ. అని విచారించు నిత్యయా ♦ వనవిలాస
వర్తి రైనట్టి యాతని ♦ వర్ణనీయ
ఫలకతలమునఁ జిత్రరూ ♦ పము గ వ్రాసి
మ్రోల నిల్పిన నారాచ ♦ ముద్దు పట్టి. 229

క. చూచి తల యూచి తత్సమ
యూచరితాయల్లకార్తి ♦ నాఫలకం బా

రేచితదృష్టిం గనుఁగొని
రాచూలి విరాళిఁ దేలి • రావడి పలికెన్. 230

ఉ. ఏలర యివ్వ డింతచల • మేలర మారునికేళిలోన న
న్నేలర యీవిరాళిఁ గొన • నేలర నాదగు వంత దీర్ప నా
భీలరసాలసాలసుర • భీకృతభీకృదసూనసూనవా
చాలవిశాలమాధుకర • శబ్దములన్ వినఁ జాల నేలరా. 231

వ. అని పలికి యాచిత్రఫలకం బక్కునం జేర్చి పలుకరించినఁ బలుక దని చిత్తంబునఁ జిడిముడి పడుచు సారెసారెకు దూరుచు విరిపరపునం బొరలుచు నంతలోఁ దెలి వొంది శిరఃకంపం బొనరించి కన్నీరు మున్నీరై పఱ్వ దడియ నెదఁ గుంది కుంది యాశయ్యను మేను జేర్చి నేత్రాబ్జంబు లర్ధముకుళితంబులు గావించి ప్రాణనాథుండు పురోభాగంబున నిలచె నని విచారించి లే కున్న విన్నదనంబు దోఁచ విరహమోహసాగరమగ్నయై యేదెస కేగె నో యని నలుదెసలుం జూచి లేచి సాంద్రచంద్రాతపంబునఁ దిరిగి పరవశాయత్తచిత్తయై దేహంబు గంపింప నెచ్చెలి మేన వ్రాలి యొక్కింత సేపు నజ్ఞాతచేతనయై నిదురించిన నీవలవంత కొంత దీరు నని తలంచి యూరకుండి కలవరంబు నొంది పలువెతలఁ జెందు సుందరి తలఁకి. 232

లయగ్రాహి.

బంగరుమెఱుంగులతె • రంగు లలితాంగముల
నంగునిడుబీరపు సె • గం గరఁగి నీరై
పొంగి వలిగుబ్బలబె • డంగులఁ దగంగ దరి
యుంగదలి పొక్కిలి మ • డుంగునఁ బడం గన్.
ముంగురులు చెంగలువ • రంగుల కనుంగవకుఁ
జెంగట నటింపుచుఁ దొ • లంగక నియాడన్
ముంగర జరంగి పెద • వింగదియ బెంగలి య
నుంగు చెలులం గనుచు • నంగన వడంకెన్. 233

వ. మఱియును. 234

తోటకవృత్తము.

నెల డాయఁగ వె • న్నెల గాయఁగఁ దే
టులు మ్రోయఁగ బో • టులు డాయ బికం
బులు గూయ శుకం • బులు దోయఁగ న
వ్వలరాయఁడు గ్రే • వల రాయ డిడన్. 235

వ. ఇవ్విధంబున విరహావస్థను జిక్కి తటస్థోద్దీపకు లైన మదనాదుల నుద్దేశించి కోపావేశంబున. 236

క. మదనా యలయించెద వదె
యద నాయె లతాంతశరము • న ట్టిట్టు గ నా
యెద నాటించెద విఁకఁ దా
ళెద నా సదయుఁడవు గమ్ము • లీలాసదనా. 237

క. మము నాదరించ వదె ప్రే
మము మీరఁగ విరహభరస • మగ్రనియమనా
యమ నాయ మనా యమునా
సుమశరముల నేల నేయఁ • జూచెదు చెపుమా. 238

చ. వలపులరాజ రాజ వయి • వారిజలోచనల న్వధించి యూ
వలఁ గలుషంబు నొందఁ దగ • వా పగవారల కైనఁ దద్గతుల్
వలవ దటంచు మించు జన • వార్త లెఱింగి యెఱుంగనట్టు గన్
జల మొనరించ మంచి దగు • నా భువనావనజుండ నై భువిన్. 239

సీ. వరగు నీధర్మంబు • పాండుజన్మహితా
చరణ మై విలసిల్లు • నరసి చూడ
నీసూను నెంచిన • నెరి రజోవతి యైన
యగ్ని శిఖోత్పత్తి • నంటుకొనియె
వెలయ నీచెలికాని • వృత్తిఁ దలంచినఁ
గల కుజాతులకు సౌ • ఖ్యం బొసంగు
మఱి యు నీమేనమా • మను విచారించినఁ
దమ్ముల నడఁగించి • శాఁగృశించె

మొదలఁ జటులనిశాచర ♦ మూర్తులై యవ్యా
నబ్జనేత్రారు లగుదుఁ బాం ♦ థాళి నేచు
వారు వీర నిరోళంబ ♦ రారి మిమ్ము
నఱఁచు దుష్టచతుష్టయం ♦ బని మోఁ దొలుత. 240

గీ. నిన్నుఁ గన్నట్టివాని ము ♦ న్నిగ్రహించు
నట్టివారలఁ జెనక లే ♦ క యదనైతి
వనద లైనట్టి వనితల ♦ నడలఁ జేయఁ
దగదు నీ కిట్టిధర్మంబు ♦ చిగురుబాణ. 241

గీ ఓరి మన్మథ నీతండ్రి ♦ యుగ్రశక్తిఁ
గన్నతల్లినిఁ దుంచి యా ♦ ఖడ్గ మిపుడు
నీ కొసంగెను లే కున్న ♦ నీరజాక్షు
లను గలంచంగఁ దలఁతు వే ♦ వనజబాణ. 242

వ. అని మిక్కుటం బైన వేదనావస్థ నిట్లనిరెం. 243

సీ. విరహంబుచే సుక్కు ♦ వెలఁదుల నేచేవు
నీదు కోదండంబు ♦ నేలఁ గలియ
కళవళపా టొందు ♦ చెలుల నేచెద వేల
కల నీశరంబులు ♦ గాలిఁ బోవు
వెత నొందు తరుణుల ♦ వెరపించెదవు నీదు
బలము లరణ్యంబు ♦ పాలు గాను
జడత నొందిన స్త్రీల ♦ జడిపించ వచ్చెదు
నీకేతనంబులు ♦ నీటఁ గుంక
మును వియోగార్తిఁ జెందిన ♦ వనితలందు
విక్రమముఁ జూపెదవు నీదు ♦ విభవ మెల్ల
వినుము సంభోగశృంగార ♦ మున వసించు
వారి వంచింప లేవు గా ♦ వారిజాస్త్ర. 244

సీ. ఎలమిఁ బలాశాళిఁ ♦ గలసిన వానికి
మధుసంభ్రమంబున ♦ మనలు టెంత

మధుసంభ్రమంబున • మసలినవానికిఁ
జండాలులచెలిమి • సలుపు టెంత
చండాలులచెలిమి • సలిపిన వానికిఁ
బుష్పవతులఁ గూడి • పొరలు టెంత
పుష్పవతులఁ గూడి • పొరలెడు వానికి
నలకుజన్మప్రాప్తి • యలరు టెంత
యొకటికంటె నొకటి యుచ్చ • రికము సేయఁ
బద్మినీద్విజగోహతుల్ • బరఁగఁ జేయఁ
గడఁగు వారలలోపలఁ • గలసి మెలసి
సంతసించెదు దుర్గుణ • సదన మదన. 245

సీ. దాహంబుఁ గొని నీరు • ద్రావ వచ్చిన విప్రు
ధరఁ ద్రెళ్ళ నేసె నీ • తాత యొన్న
చనువుతో శిశు వని • స్తన్యం బొసఁగ వచ్చు
దాని వధించె నీ • తండ్రి యొన్న
యాలంబున వసించి • యోగిరం బిడునట్టి
వానిఁ జంపితివి నీ • వరుసఁ దలఁప
జాతినీతు లెఱుంగఁ • జాల కంతట నిందు
కొని యుండె నార నీ • జనని యరయ
నిలను స్త్రీపుంసమానసం • బులు గలంచి
పెనఁగఁ జేసిన నినుఁ బట్టి • కినుకతోడ
గట్టువిల్తుండు వధియించి • కరుణఁ దిరుగఁ
బుట్టఁ జేయుట కేమందుఁ • బుష్పధన్వ. 246

వ. అని చంద్రు నుద్దేశించి. 247

సీ. లలితసంపూర్ణక • ళావేది యనఁ దగి
విష్ణుపదాసక్తి • వెలసినావు
సన్మార్గమున మించి • సంచార మొనరించి
విబుధసంగతిఁ గని • వెలసినావు

ఘనసంగమంబున • ననయంబు విలసిల్లి
యతనుమిత్రఖ్యాతి • నలరినావు
చెలఁగుచు సర్వజ్ఞ • శేఖరత వహించి
ఖరశరత్పూర్ణతఁ • బరఁగినావు
తరుచు బలుపోకలను బోయి • తిరుగుచున్న
గంధవహునితో నేస్తంబు • గలిగి రేచ
నేల యీవేల నేముద్దు • రాలి ననఁగ
నంద మా నీకుఁ జంద మా • చందమామ. 248

వ. అని కోపాటోపంబున. 249

సీ. దోషాభిముఖుఁడ వై • దురితంబు నొందుచు
నలసదాచారుండ • ననుట కొఱఁత
మ్లేచ్ఛానుమోది వై • మేదిని విహరించి
ద్విజరాజ ననుకొంట • వెఱ్ఱి గాదె
కువలయార్థ్వన్యులఁ • గుందింపు చుండి యుఁ
గువలయాప్తుఁడ నను • కొంట కొదువ
విషసరిత్పతి నుద్భ • వించి యమృతవార్ధి
వెడలితి ననుమాట • కడమ గాదె
నేరము లపారములు గల్గ • మీరి నేరి
సందియము లేక యిపుడు మి • న్నందినావు
నీదునడుమంత్రపుంగల్మి • వాడు లేల
సారెసారెకు విన రోరి • సారసారి. 250

సీ. తగు కళాదుం డను • ధన్యనామముఁ జెంది
మును గళాదుం డనఁ • దనరినావు
తతసురాపానార్హ • త వహించి తతసురా
పానార్హత వహించి • ప్రబలినావు
గురుపరిగ్రహము పైఁ • గోర్కె దీపింపుచు
గురుపరిగ్రహమునఁ • గుందినావు

ద్విజవర్ధనఖ్యాతిఁ • దేజరిల్లుచు నుంటి
ద్విజవర్ధనఖ్యాతిఁ • దేలినావు
బహుళపాపంబుల భరించి • పరఁగు నిన్నా
ముందుగా రౌరవస్థితి • జెంద కన్నా
యొలమిఁ గీలాలజన్మున • కేల గల్లు
సద్గతులు భువి విన రోరి • సారసారి. 251

సీ. భర్గుఁ డధ్వరములో • పల నీకరంబులు
దరగంగ ఖండించఁ • దలఁచఁ డయ్యొ
రాహు నీ దంష్ట్రాంత • రంబున నిమిడించి
కసిగంద కుండంగ • మెసవఁ డయ్యోఁ
దపసి ముని పాండురు • క్స్నుఁగా నొనర్చెను
గడు డస్సి పోవంగ • నుడువఁ డయ్యొ
జడదారి నిను గంట • వెడలించెఁ గాని వే
గర్భస్థుఁ గాఁ జేయఁ • గానఁ డయ్యొ
నార నీవంటిదుర్మార్గుఁ • డఖిలమునను
గలఁ దె నవలాల నేచంగఁ • దొలుత కడిమి
నిన్నుఁ బుట్టించి మున్నొక్క • జన్నిగట్టు
పాదతాడనము వహించెఁ • బంకజారి. 252

గీ. చల్లచేతులవాఁ డని • జనులు పొగడ
వేఁడికరములవాఁడ వై • చేడియలను
జలత నొందింపఁ జేసితి • జడభవంబు
గలుగు వానికి జ్ఞానంబు • గల దె చంద్ర. 253

వ. అని మలయమారుతంబు నుద్దేశించి. 254

సీ. ఎనసి చూచిన నిల • చిన చోట నిలువక
భువనావిలత్వంబుఁ • బూనినావు
భువనావిలత్వంబుఁ • బూనుట యే కాదు
ఘనుల నిల్వఁగ నీక • కలచినావు

ఘనుల నిల్వఁగ నీక • కలచుట యే కాదు
తవిలి రజోవృత్తిఁ • దాల్చినావు
తవిలి రజోవృత్తిఁ • దాల్చుట యే కాదు
సోకుసంగతులచే • సోలినావు
పుడమిఁ బాశ్చాత్యసరణులఁ • బొందువారు
తవిలి దాక్షిణ్యపదమునఁ • దారు టరిది
సుందరీజనబృందంబుఁ • గందఁ జేయు
వలదు వలమానపవమాన • మలయనిలయ. 255

గీ. విరహిజనుల మీఁద • వేడిమి దరికొల్పు
సామి వగుట కగ్ని • సాక్షి యయ్యె
నలిన కారణంబి • నా కార్య ముత్పద్య
తే యటంచు నీతి • తేటపడియె. 256

సీ. కనకసంచయముపైఁ • గాఁక్షఁ జెన్నొందుచు
గంధోత్తమావనిఁ • గలయఁ దిరిగి
ద్విజసంతతుల మింటి • తెరువు నంటఁగఁ జేసి
గోచయంబుల తెల్వి • కొఱంతఁ జేసి
బలముచే సరసుల • భంగపాటొందించి
సుమనః పరిపాతన • స్ఫూర్తి మించి
పరరజోవతు లైన • పద్మినులఁ గలంచి
యుత్పలప్రీతిచే • నుల్లసిల్లి
మహిని స్థావరముల జంగ • మములఁ గంప
మొందఁ జేసి పిశాచాది • యోగ్యవృత్తి
మేనుల భరించి దర్పించి • మించి యిపుడు
మలయ వందుర నామీఁద • మలయపవన. 257

క. తివిరి మదన యానము నై
శివి గా భవనాయమాన • దీవ్యన్మలయో
పవనా గురుపవనా జరు
పవనా మరుకారి నిగుడి • పైరా కుంఠా. 258

వ. అని వసంతు నుద్దేశించి. 259

గీ. సకలజాతుల కెల్ల న • పహ్యవృత్తి
సంచరింపుచు నుండు వ • సంత నీవు
విరహిదశ నొందు చున్నట్టి • వెలఁదులందుఁ
గరుణ లేనట్టి కాయజుఁ • గదియఁ దగు నా. 260

వ. అని పలికి పికశుకమధుకరాదుల నిందించి నిర్వేరఁగందు నాసుందరిం గని చెలు లపుడు. 261

చ. కదియఁ గఁ జేరి చేరి బిగి • కౌఁగిటఁ జేర్చి యదే మి దేమి నీ
వదరునఁ జెంద నందము టె • యా నవు నే మన నింటి కేగి నం
గొదువ యొకింత లేక యొనఁ • గూడు శుభం బన నమ్మి నమ్మికం
బొదలెడు విప్రలంభపరి • పూరితమానస యై రయంబునన్. 262

వ. ఇవ్విధంబున బోధిత యై సఖీజనంబులతోడ నిజాంతఃపురంబుఁ బ్రవేశించి యొక్కప్రసూనశయనంబునం బవ్వళించి మిక్కుటం బగు చక్కెరవిలుకాని చిక్కులఁ జిక్కి సొక్కి క్ళవళపడుచు నలుదెసలం జూచుచు నాచిగురాకుబోడి విరహవేదనాదూయమానమానస యై యుండుతఱిఁ దత్సఖీజనంబు వగచి తద్విధం బంత యుఁ దజ్జనకున కెఱింగించ నతండు శైత్యోపచారంబులు జేయ నియోగించిన. 263

క. నెల రాల నలరుగిన్నెల
జిలజిల యని జాలువారు • శీతలవారిన్
వలిపెపు తామర నూల్గల
తెలివలువలు ముంచి మించి • తేకువతోడన్. 264

గీ. కప్పురంబును బన్నీరు • గదసినట్టి
గంద మందంబు గాఁ • బూసి కంజపుంజ
కేసరంబుల వ్యజనంబుఁ • జేసి విసరి
శాంతి నొందింపు చుండెరి • సంభ్రమమున 265

వ. అని శౌనకాదిమహామునులకు సూతుండు చెప్పిన. 266

మ. అనసూయాశేషవిశేష పాశుపతయో • గాధేయ గాధేయతై
జసవృత్తిప్రదవిశ్రుతిశ్రుతిశిర • స్సంధాన సంధానస
ల్లసమానప్రమథాధినాయక సదా • లంకారలంకారసా
రసదిందాప్రదినుతాంఘ్రిపద్మ హృతపా • రావారరావారయా. 267

క. రణవిజితలాంకజృంభణ
చణకాంచదనంతకోటి • సరసీరుహ భూ
గణితాంధకహర దృంభూ
ఫణమణిఘృణిలసితకర్ణ • ప్రత్యక్పూర్ణ. 268

పంచచామరము.

చరాచరప్రపంచరూప • సజ్జటాటవీనట
న్మరుత్సరిత్తరంగసంగ • మప్రశస్తమస్తకా
సురాసురాదివందనీయ • శుద్ధశైవభక్తిమ
ద్ధరామరప్రధాన ధీని • ధాన ముక్తిదాయకా. 269

మ. ఇదిరాజేశ్వరపాదపంకజనప • ర్యైతప్రభావాప్తసం
పదుదీర్ణత్వవిధుత్వధర్మసుగుణ • ప్రాగల్భ్యసంయుక్తస
మ్మదరాజన్నృపాలకాభిహితశుం • భత్కీర్తిభద్రాయుర
భ్యుదయాఖ్యన్వితసత్ప్రబంధము చతు • ర్థోల్లాస మొప్పున్ ధరన్. 270

గద్య.

ఇది శ్రీమద్రామారెడ్డిపేట రాజరాజేశ్వరకరుణారస కటాక్షవీక్షణ
ప్రసాదప్రాప్తాశేష భాషావిశేష సామ్రాజ్యపూజ్య రాచుళ్ళగోత్ర
పాత్ర కామినేనివంశపయఃపారావారరాకాసుధాకర రా
జద్రాజన్న దేశాయిసార్వభౌమాజ్ఞాపితాంధ్రగీర్వా
ణకవిత్వతత్త్వచాతుర్యధుర్యపరాశరగోత్ర
రాపాకలింగనార్యపుత్త్రి లక్ష్మీపతిప్రణీ
తం బైన భద్రాయురభ్యుదయం బను
మహాప్రబంధంబునందుఁ
జతుర్థోల్లాసము.



శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# భద్రాయురభ్యుదయము

## పంచమోల్లాసము.



మత్సువర్ణపూర్ణమ
ణీమయసంతతసువాసి • నీపూజితల
క్ష్మీమందిర పరితోషిత
రామాగడ్డీంద్రనగర • రాజమహేశా. 1

వ. అవధరింపుము శౌనకాదిమునీంద్రులకు నిఖిలపురాణవ్యాఖ్యావిఖ్యాతుం డైన సూతుం డిట్లనియె నట్లు రాజకన్య నిశాంతసమయంబున సఖీకృతశైత్యోపచారంబు లొందుచున్న తఱిని. 2

సీ. ఎడనెడఁ గన్పట్టు • నుడుతతు ల్మత్తెంపు
గుత్తులు గల పువ్వు • పెత్తులు గను
తొగరుడాల్గల మొగు • ల్తెగలు లత్తుకను బె
డంగైన సిరచె • రంగులు గను
మెఱుఁగారు కఱి మొగుల్ • తెరతెరల్ నలుపైన
యగరుధూపంబుల • పొగలు గాఁగ

వలుచనై నెలయునె • న్నెలపిండు లందంపు
గందంపు కోరల • చందములు గ
పొడల చాయలు కపురంపు • మడుపులు గను
గుంపు రేయండ దీపంపు • సొంపు మీఱఁ
బొలిచె నొ నాయికానాయ • కులు గలసెడు
కేళికాతల్ప మనఁగ న • వ్వేళ మింట. 3

సీ. శ్యామానుమోదంబు • సమకూర్చి కల జీవ
నములకుఁ జల్లద • నం బొనర్చి
సంపూర్ణకళలచేఁ • జెంపు వహించి కు
ముద్వతీవికసితా • మోద మొనసి
బహుళరశ్మిస్ఫీతిఁ • బలుమారు బుధకోటి
కర్పించినట్టిమ • హానుభావుఁ
డనుదినశ్రీవ్యయా • వ్యయమునఁ దనరారి
కువలయంబుల ప్రేమఁ • గోరుచున్న
నరసుఁడైనట్టి రాజు ద్వి • జప్రభువుల
స్వపదముల నుంచె యామత • యపరిమితవ
థంబు గతి యని పలుకరు • ధర్మదేవ
తలు బలుకురీతిఁ జరగాయు • ధములు మొరసె. 4

గీ. సకలచక్రపాల • నకుతూహలేనుండు
శార్వరప్రకాశ • శాసనుండు
కదసి రాఁగ నెదుటఁ • గాహళంబులు మ్రోయు
నరణిఁ గుక్కుటములు • తరుచు మ్రోసె. 5

గీ. ఇఁక మరుద్ద్విజాళి • వృత్తు లొనఁగు దొర
వచ్చెనని తెలుపుద్ధి • వాచకము గ
నమ్మఁ దనుచు నజ్ఞ • నమ్ము తెల్పుగతిఁ గు
క్కుటము లొక్కచక్కిఁ • గూయఁ దొడఁగె. 6

గీ. వీర్యవృద్ధికరంబు గా • విశదపాద
రసఘుటిక పుక్కిటను బెట్టి • రాజ సమ్మ
దోత్తరాదిసతీకేళి • నానది మరల
సుమిరయాగతి జేగునక్షత్ర • ము దయ మయ్యె. 7

చ. బలు వియదాలయంబునన • పారవరంపర లైన పూసరం
బులగతి వెల్గు తారలను • బొల్పుగ జేకువ యూది కెంపుతో
యొల్లి లతి మించు శోధిని బ • యల్పడ నూడిచి రొుకక్రూరాశి గా
నలరిచె నో రుసంగ జల • జారి గసంబడె సారె సారెకున్. 8

మ. కమనీయారుణవాసరం బను వనా • కం బానభోవృక్ష మిం
పెసరం బ్రాక్కి నిశాఖ్యశాఖలను ము • న్నట్టిట్లు గా నూచ బు
క్షములన్ పుష్పములు వల్చ నై కనఁ బడెం • జంద్రుం డనేవంతు ప
క్వము పూర్ణ సంధ్యములోన వ్రాలె ననఁ దో • చెన్ సంధి వేళం దగన్. 9

వ. మఱియును. 10

గీ. యామినీకామినీపీత • హస్తసార
సీరుహచ్యుతపతయాళు • శేషమగుభ
రస్ఫురద్రౌప్యపానపా • త్రం బనం గఁ
జరమభూధరమున శీత • కిరణుఁ డలరె. 11

గీ. ద్విజపతి యు నై ప్రవృద్ధసం • దీప్తవారు
ణీసమాగమమున నుండి • నిశ్చయము గఁ
బతితుఁ డగు నని నవ్విన • పగిది దూర్పు
దెసను దెలిడాలు గన్పట్టెఁ • దెలివి దనరఁ 12

శా. అంధీభూతదివాంధ మంధతమసా • హంకారదూరంబసం
బంధేందీవరగంధ మంబురుహసం • బంధానుసంధానతా
బంధూభూత మహార్మ్యఖాగ్నిముఖసం • ప్రాప్తప్రభం బుజ్జ్వల
ద్బంధూకస్తబకాభిరామము జగ • ద్బంధూదయం బొప్పెనన్. 13

వ. మఱియుఁ బ్రాచీకుమారీలలాటతటఘటిత కుంకుమతిలకంబు వినఁ దద్దిశావి
లాసినీకనకముకురం బనఁ దత్త్రలోహకుంభం బన మరీచిస్థూలనాట్టసూత్ర

పిండం బనఁ బ్రాగ్ధరధాతుధారారుణదిగ్గజపాదతలం బనఁ దిమిరచోరుండై
న దివాకరుండు సంహృతతారకుం డైన కుమారుం డనఁ దగి యుల్లసితప
ద్మం డై పద్మనాభుం డనఁ దగి గోపతి యై శక్రుం డనఁ దగి యుండ న
రుణకేసరిఖరనఖరహతాంధకారకరీంద్రరక్తధార లై యుదయాగిరిగైరికధా
తుభూతలపరాగంబు లై హేషారవపరికుపితకాననసైరిభభయచకితపూషశ
తాంగతురంగఖురపుటీపాటితపద్మరాగోత్పతత్కాంతు లై ప్రాగ్గిరికూటకో
టిప్రరూఢజపాకుసుమద్యుతు లై యరుణకిరణంబులు వెలయ జలధరచ్ఛ
దాంతరేంద్రధనుఃకాంతిలేపం బన నిశాఖ్యాశ్రమశాఖిశాఖాతాండవితకా
షాయపటం బన వ్యోమసౌధాంగణలిప్తకుంకుమరసం బనఁ గామమహానట
నటనయోగ్యారుణయవనికాపటల మనఁ బ్రవాళభంగారుణం బైన బాలాత
పంబు ప్రసరించఁ గ్రమక్రమంబునఁ జక్రవాక హృదయసంతాపహరణం
బువలన దహనప్రవేశప్రభాగ్రహణంబువలన సూర్యకాంతోపలసంగమం
బువలన నుష్ణత్వంబు వహించి మించిన. 14

చ. పలుచని వాతెరల్ మెఱుఁగు • పట్టులఁ గన్బడుచుండ బేరురం
బుల వలిచన్ను లన్నెలల • పొందుల నందముఁ జూప గంధపుం
దళుకులు మేన దంతురిత • ధామముఁ బూన నిజాంగణంబులన్
వెలచెలు లట్టి యొడలను • వేడ్కఁ జరింపుచు నుండి రింపునన్. 15

వ. అట్టియెడఁ గీర్తిమాలిని విరహసాగరనిమజ్జనోన్మజ్జనసజ్జీభవదుత్తరంగ యై
యమ్మనోహరుండు దృగ్గోచరుండుగాఁ దలంచి మనోవృత్తి చక్కం జేసినన
ది సంకల్పమాత్రం బై తోఁచ జాగరావస్థాధీనం బై కృశత్వంబు సంపాదించి
యరతిప్రకారంబు లజ్జాభావంబు మూర్ఛోన్మాదంబులుఁ జిత్తంబునం బేరఁ
బులు వార వియోగావస్థ నొందిన. 16

క. ఆసమయంబునఁ గుసుమశ
రాసనుఁ డాసుదతి హృదయ • మట్టిట్టుగ ను
ద్భాసి శరములను సారెకు
గాసిం బడఁ జేయ సకియ • కళవళపడుచున్. 17

క. చెలులార మరుని బారిం
గలఁగితి నే నెట్టు లింకఁ • గడ తేరుదు నా
వలవంతఁ దీర్చ రే యని
యలరులపానుపునఁ బొరలి • యలమట నొందెన్. 18

క. వనిత విరహార్తిఁ బలికిన
విని యత్తరుణీలలామ • విధ మంత యుఁ ద
జ్జనకునికిఁ దెలియఁ జెప్పినఁ
దనయపయిం గూర్మిచేత • ధరణిపుఁ డంతన్. 19

గీ. నిఖిలసుగుణరత్న • నీరధి యైన భ
ద్రాయు వల్లుఁ డైన • నంతకంటెఁ
బుణ్య మేమి యనుచుఁ • బురము చాటింపఁ గఁ
బనిపి నిజపురోహి • తునికిఁ దెలుప. 20

మ. వినయం బేర్పడ మంచి లగ్నము మనో • వృత్తి న్విచారించి యో
జనపాలాగ్రణి శోభనావసర మా • సన్నంబు గావచ్చె రా
ట్తనయుం దోడ్కొని వచ్చు మంత్రివరు వే • డ్కం బంపు మీ వన్న సం
జనితానంద మమంద మై తనరఁ గం • జంద్రాంగదుం డర్మిలిన్. 21

క. తనమంత్రివరులలో నొక
ఘనగుణమణి రాజకార్య • ఘటనాచతురా
త్ముని వాయువేగజవవా
హనరథమున నునిచి పనుప • నాతఁడు కడిమిన్. 22

గీ. భూరితర మోదమున వైశ్య • పురములో వ
సించు భద్రాయుఁ గనిప్రమో • దించి రత్న
నికరము తోఁచము గఁ జేసి • నిఖిలరాజ
మంత్రతంత్రాంగములఁ దెల్పి • మదిఁ గరంచి. 23

క. స్వామిచంద్రాంగదుఁ డను
భూమీశుఁడు తనదు కూర్మి • పుత్త్రికను బలో

ద్రాయుఁడ వగు నీ కియ్యఁగ
నేమం బొనరించె నిపుడు ♦ నియతాత్ముం డై. 24

ఉ. కావున నీవు వచ్చుట రా ♦ కర్జ మటంచు వచించి యమ్మహా
భావుఁడు వైశ్యవర్యుఁడు స ♦ బాంధవుఁ డై చమదేర దీప్తర
త్నావహ మైన వాహనము ♦ నందు ముదంబునఁ దల్లి నుంచి పుం
భావవరాశ్రమక్రమము ♦ బర్వ సవాహనుఁ డై రయంబునన్. 25

క. వచ్చిన నెదురుగఁ జని మును
గ్రుచ్చి పరిరంభ మొంచి ♦ కూరిమితోడన్
విచ్చనవిడి విడిదలలో
నచ్చు పడన్ విడియఁ జేసి ♦ యతిమోదమునన్. 26

వ. పురాధికారపురుషుల రావించి వివాహకార్యప్రయత్నోత్సవం బవలంబించుం డని నియోగించిన శుంభద్రంభాస్తంభంబులు నిలిపి గరికెపచ్చల విచ్చలవిడి తోరణంబులు గట్టువారును బ్రశస్తకస్తూరికల నలికి యొప్పిన కప్పురంబున ముగ్గులు వెట్టువారును మణిగణఖచితదారువుల రాజమార్గంబుల నలరించి కనకకనకాలుకలఁ గీలించువారును మృగమదసంకుమదపరిమృదితహిమాంబుసంచయంబుల నెల్లకడలం జల్లువారును వివిక్తముక్తాఫలరంగవల్లీసంగతశృంగాటకంబుల హాటకమయవర్ణనీయపూర్ణకలశంబులుంచువారును నిటుల బహువిధశోభనకార్యంబు లొనరించి యాభద్రాయువును శిల్పికళామర్మపారగనిర్మితధర్మ్యమయలక్ష్మీవిలాసమందిరంబుల నధివసింపం జేసిన. 27

గీ. అటుల వసియింపఁ గూతురు ♦ ననుఁగు చెలువ
లలరఁ జేయుం డనుచుఁ దెల్ప ♦ నంత కంత
కభినవవ్యక్తలావణ్య ♦ మమరఁ గాఁ బ్ర
సాధికలు తత్సమయకృత ♦ సాధనముల. 28

సీ. తతపయోధరనిరో ♦ ధంబు గా నంబరం
బలరించఁ దగ నొక్క ♦ తలిరుఁబోఁడి

ఘనసువర్ణప్రభఁ • గన్పట్టె నంజనం
బమరించఁ దగె నొక్క • కమలపాణి
హృదయరంజకము గా • మెదఫి కుంకుమగంధ
మలరించఁ దగె నొక్క • జలజవదన
నేత్రాంతకాంతితో • సూత్ర పట్టిన రీతిఁ
గస్తురిబొట్టొక్క • కలికి యునిచె
విమలగోరోచనాచిత్ర • కములు రోజ
గల్లసీమలయం దొక్క • కాంత నిల్పెఁ
చరణతలముల లాక్షార • సప్రకార
ముంచి చెలరేగె నం దొక్క • చంచలాక్షి. 29

గీ. మెఱుఁగు లీను చన్న • మేలిమి పంఛంగి
విరుల మెరుఁగు తురుము • తరుచు మెఱసె
మెఱుపు లిముడుకొన్న • మేఘ మా నసఁ గను
చెలసెఁ జూదువారు • వెఱఁగు పడఁగ 30

క. పులు గడిగినట్టి ముత్తియ
ములచే రొక నకియ దీర్చ • ముద్దు గులుకుచుఁగా
చెలసె నలతురుము తారో
జ్జ్వలదంతుర మై తనర్చు • జలధర మనఁ గన్. 31

గీ. చెలియ యొకతె నకియ • చెలు వైన నానను
గొప్పముత్తియంబు • నొప్పు నునుప
నాస్యమునఁ దలిర్చె • నధరామృతస్రవ
ఓంబ మైన రాజ • బింబ మనఁ గ. 32

గీ. పడఁతి యొక్కతె కరములఁ • బదతలముల
కంకణంబులు బలుహంస • కములు నిల్ప
మెరసెఁ దద్దేహలావణ్య • సరసిలోన
నవి వినోదింపు టాశ్చర్య • మా నె తలఁప. 33

చ. చెలియ యొకర్తు బోటికటి • సీమపయిన్ రతనంపు సొంపు వి
ల్లల మొలనూలు నిల్పిన సు • లక్షణ మై కనుపట్టె నట్లనన్
గలికి విలోచనంబులు మృ • గంబు లనన్ విలసిల్లుచుండఁ గా
నాలయు నుదారమారమృగ • యుం డొనరించిన జాల మో యనన్. 34

గీ. తీగబోడి యొకతున్ ము • త్తెంపునరులు
కలికి కుచసీమ వెలయింప • నలసె నవి యు
వెలఁదివేసవి మేఘంబు • వలనఁ దొరఁగి
గిరులఁ జాల్గొను ముక్తాప్ర • కర మనం గ. 35

గీ. పొంక మై తగు వజ్రతా • టంకయుగళ
మొకసరోరుహలోచన • యుంచ నలరె
మంగళాంగతదంగనా • పాంగశరము
సానఁ బట్టెడు కంతుని • శాణము లన. 36

క. చెలి యొకతె రుచిరమౌక్తిక
ములచేరులు నుదుటఁ జేర్చ • ముద మలరిచె న
య్యలికార్ధవిధుఁడు తారా
వలయవిలాసంబు దోఁచ • వరలె ననం గన్. 17

క. తరుణి యొకతె సవరపరచె
నురుమణిగణఖచితఘంటి • కౌఢ్యాణముపై
మెరసె నభోంతర్గత మై
మెరుఁగుల నెడతెగక నిలచు • మెరు పో యనఁ గన్. 38

గీ. పడఁతి యొకర్తె తళుకుల • పద్మరాగ
మణుల పదకంబు సవరించ • మహిమ నలరె
సరసతఁ దలిర్చు కుచసీమ • గిరులనడుమ
డంబుఁ జూపిన బాలార్క • బింబమనఁ గ. 39

సీ. లలితకంబుసమాన • గళమున నైక మై
భాసిల్లు ముత్యాల • పట్టెఁ గట్టి

సుందరదోఃకాంతి ♦ కందళప్రదము లా
సండటితాయొత్ ♦ పొందుపరచి
పొగ కెక్కి బిగి రైన ♦ జిగిగబ్బిగుబ్బల
సవరించి జాలీల ♦ రవికెఁ దొడఁగి
శస్త్రగోరోచనా ♦ కస్తూరికాసంకు
మదకుంకుమాగరు ♦ మలయజాది
వస్తువుల విస్తరించిరి ♦ వలయు నెడల
రామణీయక దేహాభి ♦ రామసీమ
నలరఁ జేయుచు దృష్టిదో ♦ షాభిహతి గ
మించు స్రామాణిథూప మ ♦ ర్పించి మఱియు. 40

గీ. తరుణి యొకర్తె నిలువుట ♦ ద్దంబుఁ దెచ్చి
యెదుట నిల్పిన నారాచ ♦ సుదతి జూచె
నంగశృంగారరసభేద ♦ మమర నపర
లక్ష్మి యని మది నాత్మీయ ♦ లలన లలర. 41

వ. ఇవ్విధంబున నలంకరించుట విని పెండ్లికొడుకు నలంకరించుం డని నియో
గించిన నర్మసఖులు గడంగి. 42

సీ సంపెంగనూనెచే ♦ సవరించి యొకర్తె
శిర సంటె నమ్మహీ ♦ వరసుతునకు
మలయజపరిష శ ♦ మర్దితం బైనట్టి
నలు గిడె నొకలేమ ♦ విలసితునకు
నామోదయుక్త మహా ♦ నటకలి నొనరిచె
నొకముద్దుగుమ్మ యా ♦ యుర్విపతికి
పన్నీట జలక మే ♦ ర్పరచె నొకర్తె లతాంగి
సాహసబిరుదాంక ♦ సంయుతునకు
మిసిమిబంగరుచేలచే ♦ మేను లంటి
నట్టి తడి యొత్తె నొకభామ ♦ యధికమతిని

దివ్యవసనంబుఁ గట్టించెఁ • దెరవ యొకతె
సకలజనసమ్మదప్రద • జనవరునకు. 43

సీ. రంగుబంగరుకాలు • రింగులు జారంగ
గప్పి మేనున సిరి • గంద మలఁది
కురులలోఁ బువ్వులు • దురిమి క్రొమ్ముడి వేసి
పై మణికుకుటంబుఁ • బదిల పరచి
కళ లీను మకరకుం • డలములు శ్రవణసం
గతములు గాఁ జేసి • కరములందుఁ
గంకణంబులు నిల్పి • ఘనదోర్యుగమునందుఁ
గేయూరవరములు • గీలుకొల్పి

వక్షమునఁ బతక మొనర్చి • వజ్రరశనఁ
గటితటిఁ సవరించి డా • కాల బిరుద
సారమై తగుగండపెం • డార ముంచి
వడఁతు లీరీతి వరుఁ బెండ్లి • కొడుకుఁ జేసి. 44

చ. కళలు వెలుంగు నెన్నుదుటఁ • గస్తురినామము దిద్ది సొంపుగాఁ
గలయఁ గఁ గంఠసీమ సిరి • గందముఁ బూసి సరుల్ ఘటించి పుం
భొలుపుగఁ గప్పురంపుమడ • పుల్ దగ నోటి కొసంగుచున్ సఖుల్
నిలువగు దర్పణం బెదుట • నిల్పినఁ జూచెఁ దదోచితస్థితిన్. 45

వ. ఇవ్విధంబునం జూచి భద్రాయువభంగమంగళస్నానానంతరంబున సమా
థవ్రసాధికాలంకృతులం గైకొని నిర్జితసంక్రందననందనుండు నిరాకృత
కందర్పుండు నిర్భర్త్సితరాజరాజతనూజుండు నిందితవసంతుండు నిషాకరని
తనలుండు నై నిరుపమానమానాతీతనూతనశృంగారరసవిశేషుండు ను దన్మ
హోత్సవాగతానందకందళితదేశహాసనుందరవదనారవిందుండు నై యుం
డెట విని. 46

చ. అలరుమనంబుతోడ వసు • ధాధిపుఁ డాప్తులఁ బుత్రమిత్రమం
త్రులఁ దగుబంధులం గని పు • రోహితనిశ్చితచంద్రతారకా

బలయుతలగ్ననిర్ణయము • బర్వినవేడుకతోడ నాయెడం
గలితవివాహవేళ యని • కైకొనుఁ డందఱు సంభ్రమంబునన్. 47

వ. అని పెండ్లికొమరుని కాభ్యుదయికస్థితి నొనరించి గోభూహిరణ్యాదిదానంబులు నిర్వహించి బహుమణిగణాగణితభూషావిశేషభూషితులును బంధురసుగంధమాల్యాంబరాలంకృతులును బరిమళమిళితగంధలేపనశరీరులును నగు బాంధవుల వరునివార లై వచ్చుట కిచ్చగించి భేరీపటహఢక్కాడిండిమమర్దలతాళకాహళముఖహృద్యానవద్యధ్వనులును వారనారీవిలాసకుండలిదండలాసకప్రేరణాదినృత్తావధానవిధానచమత్క్రియాచంచలమణిశ్లాఘ్యమేఖలామంజుశింజానమంజీరవిలసితవలయకింకిణీకలాపసంఘాతారావసంఘాతంబులు తర్కద్వయసాంఖ్యయోగమీమాంసాయుగభాట్టప్రాభాకరనాటకాలంకారాక్షీణలక్షణగ్రంథసందర్భదుర్భరవ్యాఖ్యానప్రఖ్యాతిధౌరంధర్యధుర్యావనీసురక్షేమంకరాశీర్వాదభేదంబులు వందిమాగధజయజయశబ్దంబులు మాధురీధురీణతానమానషడ్జమధ్యమగాంధారబంధురగ్రామకరానూనగానసంధానగాయకవీణావేణుముఖనిస్వనంబు లేకీభవింప నిజాజ్ఞావశవర్తిసమాగతాంగవంగకళింగకాంభోజాదిదేశాధీశ్వర సల్లాపంబులు చెలంగ నిజమనోరథంబు లగు రథంబులును సంతతగాంభీర్యనిర్జితసింధువు లగు సింధువులును జవనదూరీకృతగంధర్వంబులగు గంధర్వంబులును నిరంతరబాహుబలోద్భటు లగుభటులును దనర భద్రాయువు భద్రగజంబు నెక్కించి మండలాధిపతుల సామంతుల నతని వెంబడి రా నియమించి సాంద్రచంద్రికాప్రభాభాసురవిచిత్రమౌక్తికాతపత్రంబులు ధ్వజాలవట్టికావ్యజనాదులు సందడింపఁ బరశుగదాప్రాసతోమరభిండివాలమండలాగ్రాదిసాధనంబులు బూని కాల్బలం బేతేరఁ గనత్కనకమణిమయవేత్రహస్తులు వలుదెసలఁ బరాబరులు సేయ బంగరుపళ్లెరంబుల సాక్షతమృగమదసంకుమదఘనసారగంధసారకుంకుమచంపకతైలహిమోదకాదిగంధిలద్రవ్యంబులు గొనుచుఁ బుణ్యస్త్రీలు నిజకరసరసిజపరిస్ఫురన్మంగళారార్తికలు వెలుంగ రత్నమయపాత్రంబుల నవీనదుకూలంబులు మనోహరంబులు ఫలంబులు కుసుమంబులు గొనుచు రాజమార్గంబునఁ జనుదెంచు నెడ. 48

గీ. అమ్మహాత్మునిఁ గనువేడ్క • నతివ యోర్తు
హారవల్లులు మొలనూళ్ళఁ • గా రచించి
కంకణంబుల నలకాళ్ల • కడియములు గఁ
జేసి చనుదెంచె విభ్రమ • స్థితి దలిర్ప. 49

క. స్నానంబు సేయుచో నొక
మానిని రవణములఁ దాల్చ • మఱచి జగద్ర
క్షానిపుణత్వము గలిగిన
యానరపతిసుతునిఁ జూడ • నల్లన వచ్చెన్. 50

ఉ. చేడియ యోర్తు గల్లకుచ • సీమల పై మకరీకలాపమున్
వేడుకతో వహించ కర • వేనలి దూలఁగ వేగ మొప్పఁ దూ
గాడెడు హేమధామవస • నాంచల మిట్టటుఁ జేసి కొంచు త
న్గూడిన లేమ నవ్వఁగను • గోరిక దీరఁగ వచ్చెఁ జెచ్చెరన్. 51

చ. పొలఁతి యొకర్తు నెచ్చెలుత • పుష్పొడి చీర ధరించి మేడలోఁ
పలఁ గలయం గఁ జూచి తన • ప్రాణసఖుండు రతిప్రసంగముల్
దలఁపఁ గ వల్లు వల్లనుచుఁ • దత్పరునిం గన వచ్చె నయ్యెడం
బిలువని పేరటం బనుచుఁ • బెక్కుతెఱంగుల గేలి సేయఁగన్. 52

ఉ. రామ యొకర్తు వచ్చి యల • రాజకుమారునిఁ గాంచి కాంచికా
దామముఁ బుష్పదామము య • థాక్రమయోగము నొంద నంద మౌ
మోమున సామ బొట్టమర • ముంగురు లల్లల నాడఁ జూచు భా
మామణు లెల్ల నవ్వఁగను • మారవికారముఁ జెంది మున్నుగన్. 53

శా. ద్వారాసక్తదృగబ్జముల్ దనర నిం • ద్రప్రస్తరాగారశృం
గారోదారవిహారముల్ మరచి భూ • కాంతాత్మజుం డల్ల దే
రా రే రా రె యటంచుఁ బిల్చికొనుచున్ • రామామణుల్ వచ్చి రో
య్యారం చేర్పడఁ జూడ వీఁటఁ గలవా • రాబాలగోపాలమున్. 54

వ. ఇటుల సకలజనంబు లుపహారంబులు గొని యవ్వరునికి సమర్పించి వెంట
రా నయ్యెడ. 55

గీ. మలయు చుపకంఠనక్షత్ర • మాల దనరఁ
గుజను లెడతెగక విబుధ • గురువు లలరఁ

గలసి చూచు చకోరాక్షు • లెలమిఁ జెంద
సత్పథంబున నారాజు • సంభ్రమించె. 56

వ. మఱియు నీరాజనభాజనకరసరసిజాగణ్యపుణ్యాంగనలు పొంగుచు మంగళపాఠంబులు వాడ దేదీప్యమానకరదీపికానేకంబులు వెలుంగ సాంద్రచంద్రజ్యోతిస్సంచయంబులు ప్రకాశింప నుభయవైవాహికబలంబు లెదురొత్తను నెడ ముందు ముందు గ నందంబు నందరు గ్రందుకొని గందవొడులు పిడికిళ్ళకొలఁది గుప్పునం బరవఁ దత్సుగంధబంధురపరాగంబు నల్దెసలం బ్రసరింపుచుండ నిర్నిద్రభద్రచతుర్దంతకాంతదంతావళంబున నుండి యారాజకుమారుం డనుంగుమగసాలం దిగి యుద్దండమండలాధిపతులు కైదండ లొసంగ సాకలకల్యాణావహవివాహవేది కేతెంచి ప్రచురరచితనూత్నరత్నహాటకపీఠంబు నధివసించి యుండు నంతమహోత్సవంబునఁ జంద్రాంగదు ననుమతి వడసి యత్తఱి. 57

గీ. పొలఁతుకలు పొంగి సింగార • మొలుకఁ దళుకు
బెళుకుచూపుల నల్దెసల్ • వెలుగఁ గలికి
కులుకుగుబ్బలు మోహంబుఁ • దెలుప మెలపు
మొలకనఁగఁ గీర్తిమాలిని • నిలుప నపుడు. 58

క. తెరఁ బట్టిరి తెలివకుఁ దెర
తెర యై లజ్జోదయంబు • తేకువ రా న
త్తెరఁ గెఱుఁగ లేక జన మే
తెరపై పైఁ గదియ భాగ • ధేయకృదార్యుల్. 59

చ. వెలయఁ గ సావధాన యని • వేదవిదుల్ బలుకం గ రాజు స
త్ఫలకరవిశ్రుతశ్రుతివి • ధానగతి న్మధుపర్క మాదిగా
గలుగు విశేషకార్యములఁ • గౌశల మేర్పడఁ జేసి కామినుల్
పలుమరు మంగళార్థగతిఁ • బాటలు బాడుచు సంభ్రమింపఁ గన్. 60

క. జలజాక్షిగళమునను మం
గళసూత్రముఁ గట్టె వరుఁడు • కౌతుక మొదవన్
జలజాస్త్రి గెలిచి తత్పురిఁ
గలుఫలతోరణముఁ గట్టు • కైవడి దోఁపన్. 61

క. నలు వొంద నవ్వు డంజలిఁ
దెలిముత్తియముల్ ఘటించి ♦ తెరవతురమునన్
నిలువ నవి యు జీమూత ము
వలనన్ జలజలనఁ దొరఁగు ♦ నై పెంపెక్కెన్. 62

గీ. వనిత యవ్వు డంజ ♦ లిని కల్గు ముత్యముల్
వరుని శిరముమీఁద ♦ విరివిఁ జేయఁ
బరఁగ నిందుశిరము ♦ పై శచీదేవి క
ల్పకసుమంబు లుంచు ♦ పాటి దనరె. 63

వ. ఇత్తెఱంగున. 64

సీ. ముత్యాలబాసికం ♦ బులు ఫాలతలములఁ
బొలు పొందుకాంతులఁ ♦ బొదలుచుండ
సప్తర్షిదివ్యతే ♦ జస్ఫూర్తిగలవాఁడ
నని పలుకఁబడి ముందు ♦ నను వు దోఁప
సప్తపదంబుల ♦ సనకల్లునం జేర్చి
ప్రకృతిపురుషు లెడఁ ♦ బాయ రనెడు
నునువు దోపఁగ బొమ్మ ♦ ముడిని వెలుంగుచుఁ
జెంగట నుప్పొంగి ♦ తొంగలించు
వేడ్కఁ దగిన కులము ♦ వేల్పుల గురు వగు
తపసిరేఁడురాణి ♦ దర్శనంబుఁ
జేసి పెండ్లిజగిలి ♦ డాసి పీఠంబు పైఁ
బొలిచి రవ్వధూవ ♦ రులు గడంగి 65

సీ. నిజమైన పెనువీఁడు ♦ నెల వైన దేవర
మాటలోఁ దిరిగిన ♦ మధురవాణి
తేజరిల్లుచునుండు ♦ జేజేల రా రొదఁ
బాయక నిలచిన ♦ పంకజాక్షి
బత్తులఁ బ్రోవంగ ♦ సత్త్వంబుగలదొర
కరగా మెలంగిన ♦ పరమసాధ్వి

తరుదుగా సుఖియింపు • తెరగన్నులలరిన
పెనిమిటితోఁ గూడు • కనకగాత్రి
గావలయు నీవెలఁది యని • కాంచుజనము
పొగడుచుండంగ నారాచ • పువ్వుబోఁడి
మగనితోఁ గూడి దేదీప్య • మాన యగుచు
మూర్తివిస్ఫూర్తిఁ జూపట్టె • మోద మలర. 66
గీ. సరసవృత్తుల నవ్వధూ • వరులు వేద
ఫణితిమార్గస్థితుల నేరు • పరచి తెలుప
నిత్యకర్తవ్యసంగతుల్ • నెరపి రపుడు
బ్రాహ్మణాశీర్వచనములు • బలసి యుండ. 67
చ. మునుకొని నేలవేలుపుల • మూకలు వీఁకను దాన మాడి భో
జనమున కిచ్చగించఁ గర • సాతలనాథుఁ డభీప్సితంబు గా
ననువుపడంగ షడ్రసన • మంచిత మైన పదార్థ మెల్ల మున్
బనివడ వడ్డనల్ సలిపి • బంతులవెంబడి సంచరింపు చున్. 68
సీ. అన్న ముష్ణం న స • మంచితం శాకపా
కత్వం న భవతీ హ • ఘనశలాటు
సంఘటితోపదం • శవిశేషబహుళతా
నాస్తి రసాఢ్యప్ర • శస్తపక్వ
ఫలసౌష్ఠవం నాస్తి • బహుఘృతభక్ష్యాది
కం సమీక్ష్య సితాంత • కరుణయా ప్ర
కటశీతలోదక • పేటుతాం న పరమాన్న
మస్తి వా సన్నవ • న్యస్త వస్తు
సంచయో నాస్తి లవణచిం • చాఫలగస
కలిత మోదన మేవ భో • క్తవ్య మత్ర
మదపరాధం విచార్య క్ష • మధ్వ మనుచు
విభుఁడు భోక్తల నందఱి • నభినుతించె. 69
వ. క్రమ్మర నమ్మహీమండలాఖండలుం డదభ్రశుభ్రసితాభ్రప్రశస్తకస్తూరికాకుంకు

ఘు సంకుమద మృగమద హిమాంబుపరిమళపరిమిళితసుగంధబంధుర. చర్చలవలనను బహువిధవాసనావాసప్రోల్లసత్ఫుల్లహల్లకమల్లికాదికుసుమవిసరంబులవలనను గంబూరంబు బేడబంబు గల తాంబూలంబులవలనను సౌరవార నారీవిహారవారసార సాక్షీకృతతౌర్యత్రికచమత్క్రియలవలన విభావానుభావాద్యుల్లసద్రసవిశేషశ్లేషాభిముఖ సుఖముఖోచ్చారణోల్లాసకర పరిహాససల్లాపప్రసంగంబులవలనను నిది మొదలగు దైనందినబహుమానకార్యంబులవలన నంత కంతకు సంతోషంబుల నందంద యఖండితానందంబు నొందించి సొంపుఁ బుట్టింపుచు నిలింపపతి వైభవంబున నాహూతోత్సవప్రభూతభూతలాధీశజాతంబులకు జాతరూపస్వరూపచేలజాలంబులొసంగి ధరామరవరుల కపరిమితరత్నసువర్ణదుర్వర్ణపరిపూర్ణదముద్రిక లొసంగి సుజననేత యగు జామాతకుఁ బదివేలమొదవులకదుపుల నంత కిమ్మడి తురంగంబుల నంతకు జమిలిబలుగొమ్ముల మెకమ్ముల నంతకు రెట్టి రథంబుల నంతకినుమడి యాడిగపుచేడియల నంతకెక్కువ విడిముడి నంతకన్న మిగుల రతనంబుల నివి మొదలగు హరణంబుల నాగమోక్తప్రకారంబుల నవినయంబుగా నిచ్చి మణిపుత్త్రి యనందగు తన పుత్త్రిం జూచి. 70

సీ. అత్తమామల యాన ♦ నోఁ గాదనక వారి
మనసు రా మెలఁగుమీ ♦ మంజువాణి
పతిమాట జవదాట ♦ కతని కింపగు వేళ
నెదు రాడఁ బోకుమీ ♦ యిందువదన
తోడికోడండ్రతోఁ ♦ గూడి వారల కెల్ల
హిత మాచరించుమీ ♦ యిగురుబోఁడి
చుట్టాలయెడఁ జాలఁ ♦ గొట్టమిట్టాడక
కరుణ రా నడుపుమీ ♦ కంబుకంఠి
సేవ లొనరించు దాసదా ♦ సీజనముల
దయఁ దలంపుచుఁ బ్రోవుమీ ♦ తరళనయన
యెన్ని కత్తింటికిని బుట్టి ♦ నింటి కెపుడు
వాసి తాఁ గఁ జరించుమీ ♦ భాసురాంగి. 71

గీ. ఎల్ల జనుల రౌఁడలఁ • దల్లి తల్లియనంగ
మెలఁగ వలయు బుధులు • మేలనంగ
బావమరుదులందు • నావంత రైనను
గడుసుతనము వలదు • కమలనయన. 72

క. మును దాదులు ప్రమదాదులు
నినదాదులు నెరపఁ బుట్టి • నెనరు ట్లిపడన్
ఘనజాలకవినుతాలక
చనఁ జాలక యున్నఁ గన్న • జనకుం డంతన్. 73

చ. కరములు చాచి యొత్తుకొని • కౌఁగిఁట నొవ్వఁగ నప్పళించుచున్
శిరము పయిం గనుంగవను • జెందిన యశ్రువు లుంచె నెట్లనన్
సిరి జనియించువేళ నల • క్షీరసరిత్పతి తచ్ఛిరంబునం
దరఁగలు చాచి శీకరక • దంబములం దగఁ జల్లె నో యనన్. 74

వ, ఇవ్విధంబున గారవించి. 75

క. అమ్మా యత్తింటికిఁ బో
వమ్మా తడ వేల చేసె • దమ్మా నీతో
డమ్మా యింతట వచ్చెద
మమ్మా యీజాలి మాన • వమ్మా కొమ్మా. 76

గీ అనుచు జాలి మాన్చి • యంపక మొనరింప
మగుడి మగుడి చూచెఁ • జిగురుబోఁడి
చెలఁగి పెనిమి టెంత • సిరిగలవాఁ డైన
నతివ పుట్టినింటి • కాస పడును. 77

క. అంతట నవోఢతో సా
మంతహితపురోహితాను • మతితత్పగశు
ద్ధాంతప్రవేశము ధరా
కాంతుం డొనరించె జనము • కౌతుక మందన్. 78

వ. అంత శుద్ధాంతప్రవేశానంతరంబునఁ శౌకట మగు నాకట సమయంబున.

ఉ. చంపకగంధి యొక్తె రభ • సంబున రాజకుమారుఁ జేరి సా
రెంపువసిండిగిండియను • నిండిన సంపఁగినూనెఁ బూసె ని
ద్దంపుకురుల్ నటింపఁగను • దమ్ముగ్గలు పెంపెసలారఁ జన్గవల్
సొంపులు జూపఁగంకణరు • చుల్ గనుపట్ట వలగ్న మూఁగఁగన్. 80

క. శిర సంటె వదనకమలము
చిరుచెమ్మట గ్రమ్మరింప • శీతోదకసం
భరిత మగు నటక నిడి చె
చ్చెర మజ్జనశాలకడకుఁ • జేర్చి ప్రియమునన్. 81

సీ. మంజువాణి యొకర్తు • మజ్జనం బొనరింప
శ్వేతవస్త్రము లొకర్తె • చెలియ గట్టె
మదవతి యొకర్తె • మణిభూషల నొసంగె
శిరమున నొకతేమ • విరులు దురిమె
కంజాక్షి యొకర్తె • కనకపీఠముఁ బెట్టెఁ
గలికి యొకర్తె మేన • గంధ మలఁదె
నగరుధూపము నొకర్తె • యతివ సమర్పించె
లలన యొకర్తె పాదు • కల నమర్చె
నాతి యొకర్తె నీరాజ • నంబుఁ జూపెఁ
బడఁతి యొకర్తె సురటిచేఁ • బట్టి విసరె
బాల యొకర్తె రత్నద • ర్పణముఁ జూపె
రామ యొకర్తె ఘనచామ • రంబుఁ బూనె. 82

క. వనజాస్య యొకతె ప్రేమాలం
గనకపు పళ్యరము వెట్టెఁ • గలికి యొకతె వా
సన దొలుకు జలము లలరిన
కనకాలుక నొంచె వేడు • కల్ జనియింపన్. 83

మ. సమరస్యం బయి కించిదుష్ణ మగు నా • శాల్యన్నముల్ దుగ్ధ మా
జ్యము పచ్చళ్ళు నపూపముల్ వడియముల్ • శాకంబులున్ సూపము

త్రమ లేహ్యంబు రసాయనంబులు వఱిమో • దం బొప్ప వడ్డించి రా
రమణుల్ కంకణకింకిణీకటకజా • రావంబు తోరంబు గాన్. 84

గీ. ఇటుల వడ్డింప నవిరొల్ల • నింపు లేక
పెరుగు పరమాన్నములరుచు • లెఱుఁగ లేక
కూరగాయలు చవి యని • కోర రాక
వలసి వల్లమి సాపాటు • సలిపె నపుడు. 85

క. అంగన యొకర్తె ముంగల
బంగరు పావలు లగించఁ • బదముల దోడి యా
భృంగారుజలము చేను
ప్పొంగుచుఁ జే వార్చి రాజ • పుంగవుఁ డంతన్. 86

క. జాంబూనదవిదితము లొ
గంబూరపు బాగములను • గైరావళులన్
బింబోష్ఠి యొకతె యందీఁ
దాంబూలము వేసికొని య • థావిధి దోవన్. 87

సీ. పంజరసింజాన • బహుకీరశారికా
ఫణితమన్మథతంత్ర • బంధురంబు
జాలాగతారవ • స్పర్శవీణారవా
కర్ణనోత్సుకపటు • కలరవంబు
సుఖకృద్రతిరహస్య • లిఖితబంధవిశేష
సంయుతయవనికా • సంచయంబు
నవరత్నకీలిత • నవ్యోపచారస
జీవపాంచాలికా • సేవ్యతలము
సారఘనసారవరగంధ • సారచారు
ఘసృణఘుసృణవితతసంకు • మదమృగమద
ముఖరతిసుఖకరద్రవ్య • ముఖ్య మగుచు
నలరు చుండిన కేళికా • నిలయమునను. 88

చ. అరు దొనరించు కుందనపు ♦ టందలముల్ దగుతూఁగు టుయ్యెలల్
విరివరిచప్పరంబులు ను ♦ విం తగు కాంతుల♦ జెందు చందువల్
వరలెడు దర్పణస్ఫుటక ♦ వాటములు న్మృగరాల దేహళుల్
తరళగవాక్షరత్నములు ♦ తద్గృహదీపము లైకనంబడన్. 89

క. మగరాల కురుచలు ను నిగ
నిగ మను మరకతపు మణుల ♦ నిడువులు కోడుల్
ధగధగను పద్మరాగము
లు గ నొనరిన శయన మున్న ♦ లోపలిదెసకున్. 90

ఉ. మూలల నీలముల్ తుదల ♦ ముత్తెపు గుత్తులు సందు సందులం
జా లగు పచ్చలు న్నడుమ ♦ చక్కనిఁ గెంపులజొంప మద్దులన్
మే లగు స్ఫాటికాంకములు ♦ మించుల సంచుల మించు పట్టెయున్
సేలు గఁ గల్గి వెల్గుటకుఁ ♦ జిత్తము రంజిలి సమ్మదంబునన్. 91

క. ఆరీతి మదినిఁ బొదలుచు
నా రాజసుతుఁడు పరిష్క్రి ♦ యాంచితలీలా
గారాంతరశయ్యపయిన్
గూరిమితో నధివసించి ♦ కోరిక దీరన్. 92

ఉ. ఎప్పుడు వచ్చునో చెలియ ♦ యెప్పుడు ప్రేమను గారవించునో
యెప్పుడు కౌఁగిలించుకొను ♦ నెప్పుడు వాతెరఁ గ్రోల నిచ్చునో
యెప్పుడు కేళి సల్పు నాకొ ♦ యెప్పుడు నే నల మారు గెల్తునో
యెప్పటి కెప్పు డంచు హృద ♦ యేశ్వరి రాక మదిం దలంపుచున్. 93

గీ. చంచలాక్షులాల ♦ సించఁ గారణ మేమొ
కాసుధాంశు నెండ ♦ కాకలకును
మరుని ధాకలకును ♦ మడఁతి రాకలకు నేఁ
దాళ లే నటంచుఁ ♦ దలఁ కితలఁకి. 94

వ. ఇవ్విధంబున నెదురు చూచుచున్నంత. 95

సీ. నెరులు చక్కఁగ దువ్వి ♦ విరుల చేరులు జున్వి
నిరివిగా మురిపెంపు ♦ తురు మొనర్చి

సిరు లీను వజ్రంపు • చేర్చుక్కి సవరించి
కస్తూరికాచిత్ర • కంబు నిల్పి
వీనుల మణిగణా • న్వితకుండలము లుంచి
యరుత ముత్తెపుపట్ట • నిరవుకొల్పి
నిబ్బరం బొనరించు • గబ్బిగుబ్బలమీఁద
గంబురా గల సిరి • గంద మలఁది
కరములను గంకణంబులు • మెరయ నుంచి
జిలుగుతళుకుల పొంబట్టు • చీరఁ గట్టి
యడుగులను విడువక మ్రోయు • నందియలు ను
నగ లలవరచి ముగుదకుఁ • జిగురుబోండ్లు. 96

వ. మఱి యుఁ గర్పూరాభంబు లైన కుంభికుంభసంభవంబులు రక్తసితవర్ణంబు లైన వంశజంబులు జ్యోతిఃప్రభంబులగు జలదజననంబులు హరిద్రాభంబు లైన యిక్షుసంభూతంబులు నీలకాంతి గల ఫణిఫణోద్భవంబులు శుద్ధస్ఫటికసంకాశంబు లగు శంఖజాతంబులు కృష్ణలోహితచ్ఛవి గల వరాహదంష్ట్రోదితంబులు పాటలప్రకాశంబు లగు శుక్తిజన్మంబులు గల హారంబులు ముక్తావళులు దేవచ్ఛందంబులు గుత్సంబులు గుత్సార్ధంబులు గోస్తనంబులు మాణవకంబులు నేకావళులు నక్షత్రమాలికలు నను హారవిశేషంబులు సవరించి రత్నమయంబు లగు భూషణంబులు శ్రీగంధాదిపరిమళలేపంబులు నానావిధకుసుమమాల్యంబులు మొద లగు చతుర్విధశృంగారంబుల నలంకరించి యిందుబోఁడులొకఁ బ్రోడ యగు నొక్కర్తె చేడియ యాపూబోఁడి కిట్లనియె. 97

శా. ఓనారీమణి చెల్వునిం గదిసి నీ • యుల్లాసముల్ జూపినీ
వానిం గా నొనరింపు మించుక వినే • వా కౌఁగిటం జేర్చుచుం
సూనాస్త్రం గలిపించి నేరుపులచే • సొక్కించి సోలించితే
నీనా నేస్త మెఱుంగ వచ్చు నిపు డో • నీరేజపత్రేక్షణా. 98

గీ. అడుగు లొత్తి పండు • టాకుల సొగ సైన
మడుపు లొసఁగి రతుల • జడుపు లేక

సరసరతుల విభునిఁ • గరఁగించితేని యు
నేఁడు దెలియు నీదు • నిపుణత యును. 99

క. విను ముద్దుగులుకు పలుకుల
వినఁ దలఁచి విభుండు గోరి • వేఁడి పలుకరిం
చిన సిగ్గుఁ బడుచు లోభం
బొనరఁ గ వినివిననివగిది • నుండెదు సుమ్మీ. 100

చ. అని చతురోక్తి సూక్తులఁ గ • య్యాళితనంబునఁ బల్కు నాసఖు
ల్లను విడనాడి యెక్కుడఁ దో • లంగుదు రో యని వారిపయ్యెదల్
వెనఁగొని వెన్క ముందఱుఁ • బెట్టుచు నందెలు ఘల్లు ఘల్లనన్
గినుకఁ దొలంగు చూపుల స • ఖీతతి దూఱుచు వచ్చె నయ్యెడన్. 101

వ. ఇట్లు చనుదెంచి. 102

గీ. అతివ మణిమయకేళిగృ • హాంతరాళ
రామశయనంబు వసియించు • రమణు నెదుట
నిలచి భయకంపవిస్మయో • త్కలికపులక
ముఖ్యసాత్త్వికదశలచేఁ • బొలిచి యపుడు. 103

గీ. చెలియ తద్గేహదేహళీ • సీమఁ జెంది 104
వెనుక ముందైన యడుగుల • దనరె లజ్జ
యనుడు చెలివెన్క కొదిగించ • నలరుప్రేమ
యనుడు చెలి ముందరికిఁ ద్రోచు • ననువు దోఁప. 105

వ. ఇవ్విధంబున విభుని మ్రోల నిల్చిన తత్సఖు లమ్మనోహరాంగునిం జూచి
యి ట్లనిరి. 106

గీ. నేరుపరి కాఁడ వన్నింట • నృపతనూజ
బాలఁ జూచినఁ గడుముద్ద • రాలు గాని 107
ప్రౌఢతన మే మెఱుంగదు • బుజ్జగించి
తిరుగడ గాఁగ మెల్లన • దిద్దుకొమ్ము 108

చ. నెలఁత సలజ్జ యై పెనఁగ • నేరదు మారుని కేళిలోపలం
బలుగతుల న్మెలంగఁ జొరఁ • బారదు కొంగిఁటి కానఁ జేసినం

జెలిమిఁ దలంచి ముంగలికిఁ • జేరదు భూధరణీశపుత్త్రి యా
వలఁ గలచేత లీ వెఱుఁగ • నావివరింపఁ బనేమి మాకిఁకన్. 109

గీ. అనుచుఁ బల్కిన నగుదు భ • ద్రాయు వపుడు
ముందు ఘనసారసహితతాం • బూలములను
లలితమణిభూషణాంబరా • దుల నొసంగి
యనిపె నచ్చేడియల నేరు • పలరు చుండ. 110

వ. అటులఁ బనిపిన. 111

సీ. శ్రీగంధ మేఁ దెత్తు • శ్రీగంధగజయాన
చంద్రంబు నేఁ దెత్తుఁ • జంద్రవదన
సుమజాల మేఁ దెత్తు • సుమనోరథావాప్తి
ఫలము లేఁ దెత్తు జం • ఫలదురోజ
సారసం బేఁ దెత్తు • సారసాంచితపాణి
పాటలం బేఁ దెత్తుఁ • బాటలోష్ఠి
పరిమళం బేఁ దెత్తుఁ • బరిమళోత్సవవాంఛ
సరి నేనె తెత్తుఁ గే • సరినుమధ్య
యనుచు నాకొక్క రయ్యింతి • యనుఁగుఁజెలులు
కార్యమిషమునఁ గేళికా • గార మెడలి
చిఱునగవు నెమ్మనంబులఁ • జెంగలింప
వచ్చి రయ్యెడ సిగ్గును • వనిత దక్క. 112

వ. అయ్యెడ. 113

క. పతి యపుడు స్థాయిభావము
లతిరయమునఁ దోఁచ భావ • హావాదికము
మితి లేక మెలఁగఁ బ్రేమన్
సతి మోమున దృష్టి నిలపి • సరభసవృత్తిన్. 114

చ. చరణతలంబు లెంచి కర • సారసముల్ బరికించి పెందొడల్
మురియుచుఁ గాంచి చిన్నినడు • మున్ వివరించి చెలంగుచున్న మో

మరని వచించి పేరురము • నందుఁ బ్రియాంబున మించి యున్న భూ
వరు నయనాంతముల్ మగుడ • వాఱెను లాక్షణికత్వ మొప్పఁగన్. 115

సీ. సమ్మోదమున నల • సంబు లై యంతలోఁ
గ్రమ్మర వళితప్ర • కార మొంది
ప్రేమచే నార్ద్రంబు • లై మాటిమాటికి
ముకుళీకృతంబు లై • మోహమునను
క్షణమాత్ర మాభిము • ఖ్యస్ఫీతి విలసిల్లి
లజ్జాప్తిచేఁ జంచ • లంబు లగుచుఁ
గడునిమేషపరాఙ్ము • ఖంబు లై హృదయభా
వాకూతములను బ • యల్పడంగఁ
జేయు చూపులచేఁ బ్రియు • చెంతఁ జేరి
యిందిరాసుతు పట్టంపు • టేనుఁగ నఁగ
నలరువిల్తుని నవమోహ • నాస్త్ర మనఁగ
నిలచు నవ్వేళఁ గనుఁగొని • నృపవరుండు. 116

సీ. ముందుగా నేన రాయె • మందలించినఁ బల్క
నలుగునో కలుగునో • తెలియ రాదు
సూచితప్రేమచేఁ • జూచితి నా కన్క
కేగునో లోఁగునో • యెఱుఁగ రాదు
వీడెమి మ్మని చేరఁ • బిలచిన పింత గాఁ
జేరునో మీఱునో • చెప్ప రాదు
పైతాపటంబు చే • పట్టెద నంటి నా
యొరచునో పరచునో • వెరవు గాదు
ఏమి సేయుదు నే మందు • నేయుపాయ
మేగతిని యీవిరాళికి • నెటుల నోర్తు
ననుచు శిర మూదుఁ జేఁ ఝాచు • నెనయ జూచు
నేరు పేర్పడ కప్పు డా • నృపవరుండు. 117

ఉ. ఏగతి మందలింతు నిపు • డిందుముఖీదృఢమానసంబు నే
లాగు గరంతు లజ్జితవి • లాసకళాకుశలాత్మ నిప్పుడే
బాగుగఁ గూడువాఁడ సుమ • బాణశరంబులఁ జిక్కి సొక్కి నే
వేగఁగ లే నటం చుమది • విశ్వవిభుండు దలంకి చింతిలెన్. 118

వ. ఇట్లు చింతిలి. 119

గీ. నేరుపునఁ గాని కరఁగ దీ • నెలఁత మనసు
ప్రోడతన మేరుపరచంగఁ • బొసఁగ దనుచుఁ
జాటుకారప్రకారవా • చావిచార
మమర ధరణీధవుం డిట్టు • లనియె నపుడు. 120

క. ఓరాజీవేక్షణ మరు
బారిం బడి యున్న ననుఁ గృ • పారసధారా
వారిం దేలించుట కై
రారా దా యిందు ముందు • రాకేందుముఖీ. 121

గీ. కొమ్మ యీమడుపులను జే • కొమ్మనీదు
మధుసమధురాత్యధరసుధా • మధురభాష
ణమ్ము లలరంగ మణిభూష • ణమ్ము లిపుడు
గని కరమ్మునఁ గైకొమ్ము • కని కరమున. 122

సీ. పలుకవే తేనియల్ • జిలుకంగ ముంగల
నుబ్బుసిబ్బెపుగబ్బి • గుబ్బలాడి
చూడవే వేడుకల్ • తోడ నే కూడంగఁ
జిన్నారినెమ్మోము • చిన్నెలాడి
కులుకవే పాయంబు • గులుకులు తళుకొత్త
మేలైనపువ్వుల • మేనులాడి
చెలఁగవే యొయ్యార • మొలుక సమ్మదమున
మించు సంచుల మించు • మెరుఁగులాడి
యోలమున మేల మేటికి • నాలుగంటి
యెదుటి కేతెంచ వేటి కే • యిందువదన

జాలిఁ దేలించ నేటికే • సారసాక్షి
కేళి నేలంగ రాదె యో • కీరవాణి. 123

సీ. ఏకాంతమున నను న • న్నెపుడు వీక్షింతు నో
యనితల్చుకొనఁ గొన్ని • దినము లరిగె
సరస రాత్రిందివ • జాగ్రదవస్థచేఁ
జరియించఁ గొన్నివా • సరము లరిగె
మదనవేదనదూయ • మానమానసత నా
రంభించఁ గొన్ని వా • రంబు లేగెఁ
గుశలవాంఛితభవ • ద్గురుజనాప్తి కై
వసియించఁ గొన్నిది • వసము లయ్యె
నిమిస మొకపూట పూటొక్క • నెలయు నెలయు
హాయనము హాయనము గల్ప • మగుచు నుండఁ
గరుణఁ జేయుట యెప్పుడో • గారవించు
టెప్పుడో కాని తెలియదే • యిందువదన. 124

సీ. ఇంపు గా నగుమొగం • బెత్తి కన్గొన కున్నఁ
దొంగలరాయని నెట్లు • దెగడువాఁడఁ
దేనిజాల్గగ్గలు వా • తెరఁ గ్రోలనీకున్న
మధువిజృంభణ మెట్లు • మరచువాఁడఁ
గలితామృతము లొలుకఁ • బలుకుఁ బలుకక యున్నఁ
గీరాధికము నెట్లు • గెలుచువాఁడ
సురతసౌఖ్యంబునఁ • జొక్కించకున్నను
దర్పకు నే నెట్లు • దరుమువాఁడ
గబ్బిచనుగుబ్బ లొరయంగఁ • గౌఁగిలింపఁ
జేయకున్నను బైవచ్చు • శీతలాని
లుని హసించంగ నేనెట్లు • పెనఁగువాఁడ
వింత సేయంగ నేటికే • విద్రుమోష్ఠి. 125

సీ. అతివరో మన్మథుం • డను మూర్తధారుండు
తద్దేహలావణ్య • ధన్యకళలఁ

శాత్రముల్ జేసి నే • పథ్యాఖ్యయవనికాం
తరములోపల స్థాపి • తము గఁ జేయ
నవి యు బాహ్యాభ్యంత • రావాప్తిఁ జెన్నొందఁ
గనుఁగొంటిఁ గాని మి • క్కుటము గాఁగ
దొరయు లజ్జాతిర • స్కరిణిలోపల నుండి
విలసిల్లు నీమనో • వృత్తినటిని
వెడలనీ వయ్యె నీకృపా • న్వితదృష్టి
ననుఁ గనుంగొంటి వేనిఁ ద • న్నాట్యవిధముఁ
జూచి సమ్మోద మందు దో • సుందరాంగి
మనవిఁ గైకొను మిఁక నైనఁ • జనువు మీర. 126

వ. అని యభిలాషవిప్రలంభశృంగారంబునొక్కింత సరసవచనరచనల నెరపి సంభోగశృంగారంబున కోహటించి. 127

చ. నడుమసియాడఁ గంకణని • నాదము లుప్పతిలం బదాబ్జముల్
తడఁబడ ఘల్లు ఘల్లని ము • దంబున నందెలు మ్రోయుచుండ సొం
పడరెడు మారుకేతన ప • టాంచల మై తగి పైట జార న
వ్వడఁతి కరాంబుజం బొడసి • పట్టె నృపాలవతంసుఁ డయ్యెడన్. 128

వ. ఇవ్విధంబునఁ బట్టినఁ గిలికించితభావంబున సంచలించు చంచలాక్షిని హంసతూలికాతల్పంబునం జేర్చి. 129

సీ. తరళాన్వితంబు లై • విరళపత్రావళహ
స్తాంచితంబులు కంచు • కాంతరంబు
లగు బాల చన్గొండ • లవనీశ నీకర
గ్రహణయోగ్యంబులు • గాఁ దలంపు
మని యాంతరంగికుం • డగు శంబరారి త
త్కంపితోత్పతదంశు • కంబుచేత
సంజ్ఞఁ జేయంగ న • జ్జనపతి గదియఁ ద
త్కటకస్థఘంటికల్ • కవు లటంచుఁ

దెలుపుగతి మోవియఁ దత్క్రియా • కలితుఁ డగుచుఁ
గడక నిజశాననము లుంచు • గతినిఁ జంద్ర
రేఖ లొనరించఁ దలఁచిన • రేచి సాత్వి
కాదులఁ జెలంగె నవ్వ డ • య్యాదిమమున. 130

సీ. సరసలాక్షారాగ • భరము న్న దనుచును
దంట గా మోవి ప • ల్లంటిఁ జేసి
మకరీకలాపముల్ • సుకరంబు లని మెచ్చి
ననుపుచెక్కులు చుంబ • నం బొనర్చి
కంచుకం బొరపు గాఁ • గన్పట్టె నని కుల్కు
గుబ్బలు కొనగోళ్ళ • గ్రుచ్చి చూచి
మృగమదసౌరభ • మేదురం బని మేను
మునుకొని పరిరంభ • మొనరఁ జేసి
పడఁతి కపురంపుబాగాలు • మడపు లివిగొ
కొ మ్మనుచుఁ గంఠసీమను • గోరు లూని
యివి యు మోద లగు క్రియలచే • నెలమి చెలియ
నతులితస్ఫూర్తిచే బాహ్య • రతులఁ గలఁచి. 131

సీ. కోరి వాతెర తేనెఁ • గ్రోలంగ గమకించఁ
బెదవుల నందంద • పెనఁగి పెనఁగి
ముకురంబు లనిపూని • ముద్దిడ రాఁ జూచి
చెక్కు లంసంబుల • నొక్కి పట్టి
యురముపైఁ గరయుగ్మ • మొనరించఁ గన్గొని
బిగిచనుల్ గరముల • బిగియఁ బట్టి
మరుకేళిఁ దేలించు • నరుపు నిరీక్షించి
పెందొడ లందంద • పెనఁగఁ జేసి
వరఁగు కటిసీమ సుత్పల • పత్త్రములను
నఖరవైఖరు లుంచు న • న్నాహ మెఱిఁగి

సీత్కృతం బొనరించుచు ♦ సిగ్గు నొంది
విముఖత వహించు చెలిఁ గూడె ♦ విభుఁడు మొదల. 132

వ. మఱియు సామోక్తులఁ బ్రార్థనావిశేషంబుల రతిప్రేమఁ బుట్టించి డెందం
బుఁ గందనీయక కందర్ప కేళి నొందించి. 133

సీ. తురుమున విరివి గాఁ ♦ దురిమిన పూసరుల్
చెదరి వన్నెలు దక్కి ♦ చిక్కుపడఁగ
నురముపై నిరవొంది ♦ సిరుల కింపైన ము
క్తాహారములు జారి ♦ కన్పడంగ
లీలాకపోలపా ♦ లిక నన్మకరీక
లావముల్ శ్వేదాంబు ♦ లను గరంగ
మేన నిండ నలందు ♦ మిసిమి శ్రీగంధాది
పరిమళంబులు పలు ♦ పల్చ గాఁగఁ
గమ్మతెమ్మెరలకు సరి ♦ గాఁ జరించు
నూర్పుగమి దోఁచఁ బెనుమోహ ♦ మొప్పు చుండఁ
జిరుతముత్తియములరీతిఁ ♦ జెమటచినుకు
లళికమునఁ దోఁచఁ దతూకట ♦ మమరె నపుడు. 134

వ. మఱియును. 135

సీ. ముప్పిరి గాఁ బెన్గ ♦ మోవిమోవిఁ గదించి
చాలువారెడుతేనెఁ ♦ గ్రోలి క్రోలి
కళ లొక్కచక్కి గాఁ ♦ గరఁగం గ నంగంబు
నేకీకృతములు గా ♦ నెనపి యెనపి
నమ్యక్త్రికపత్రదే ♦ శముల నన్యోన్యహ
స్తాబ్జంబు లొనరం గ ♦ నదిమి యదిమి
యరయ నాకీర్ణశ్ర ♦ మాంబుపూరం బార
నతిగాఢరతిరయం ♦ బాచి యాచి
సొలపు గిలిగింత సొక్కులఁ ♦ గలరవణము
లంటి మేనుల నొక్కుల ♦ నదరు ముద్దు

గులుకు వాక్కులఁ బలుగంట్ల • నులికిపాటు
భామలనిక్కుల దగు కేళిఁ • బొలిచి రపుడు. 136

వ. తదనంతరంబ. 137

చ. వలపుల తావి మోవిపయిఁ • బల్మొన లందముఁ జెంద మిన్నచ
న్నులు నెలవన్నెలం దగి వి • నోదము మీరఁ గచంబు జార మే
న్వెల వెలఁబారఁ బోక ముడి • వీడఁ గఁ గొ నసియాడ నొక్కచే
నలరులశయ్య నూది చెలి • యల్లన లేచె విభుండు జూడఁ గన్. 138

గీ. నెరుక లొకకేల సవరించి • నీవివలన
విడిన వసనంబు సవరించి • యడరు చున్న
సిగ్గుతో భయసంభ్రమ • స్థితినిఁ బ్రియుని
వెనుకఁ జేసి తొలంగె న • వ్విద్రుమోష్ఠి. 139

వ. ఇట్లుతొలంగి తత్సమయోచితకృత్యంబులు నిర్వర్తించి నిద్రాకాంక్షం జె
న్నొంది. 140

సీ. నునుగప్పుకొప్పు ము • న్మాపునఁ గదియంగఁ
జన్గొండ లురవున • సంఘటిల్లఁ
జక్కనై మెఱుఁ గెక్కు • చెక్కుచెక్కిట నుండఁ
దావిచేఁ దగు మోవి • మోవిఁ బెనఁగ
సరసకటీతటిఁ • జరణాబ్జము జెలంగఁ
బొలు పొందు కరము వీఁ • పునఁ బొసంగ
నలయక తనరు మే • నుల నొక్కటి గఁ జేసి
రతిపారవశ్యసం • రంభ మొంది
సుందరీమణిఁ గూడి యా • సూనబాణుఁ
డనఁ గఁ దగినట్టి భద్రాయు • వతివినోద
సమ్యగమృతాంబునిధియందు • శయితుఁ డైన
నీరజాక్షుఁ డనఁ గ సుఖ • నిద్రఁ జెందె. 141

వ. అట్టియెడ. 142

గీ. అంతకన్న మున్నె • యన్నీరజాతాక్షి
లేచి కేళిలక్ష • ణోచితముల

మరుఁగుపడవిలాస ♦ మందిఱంబెడఁబాసి
వచ్చిసిగ్గుపడిన ♦ వనితలవుడు 143

సీ. సరసపుంస్కోకిలా ♦ స్వాదితంబైయుపు
డరుణపల్లవముసొం ♦ పలగుచుండె
రాజహంసనఖాభి ♦ రామంబులై మించి
యబ్జకోశంబులో ♦ య్యారమొసఁగెఁ
బున్నాగసంపర్క ♦ మునమాధవీలత
యనియాడఁదొడఁగెపో ♦ యల్ జెలంగ
హితమహీనవిలాస ♦ మీక్షిం పదముల
ననురాగమువహించి ♦ హర్షమెసఁగె
ననుచుఁ దత్సఖులుసలజ్జ ♦ యైనచెలినిఁ
గనుచుసాధ్యవసానల ♦ క్షణఁదలంచి
పలుకనించుకస్మితము చే ♦ నలుకదోలుక
నులుకుచుండంగనప్పడ ♦ బ్బాలఁతులెనసి. 144

గీ. చెలియయీరేయివిభుఁడేమి ♦ జేసెనతని
కిష్టవర్తనమేరీతి ♦ నీవుసలిపి
తింతయువచింపుమిపుడునీ ♦ చెంతఁదిరుగు
వారలముగానిసఖులాతి ♦ వారమటవే. 145

క. అనవినివిననట్టులనా
ననతామరసంబువంచు ♦ ననబోడినిచ
య్యనఁ గదిసిపరిరంభం
బునఁ జేర్చిప్రియోక్తులొప్పఁ ♦ బొదలించితగన్. 146

గీ. మానినీమణినీవునీ ♦ మగఁడుసూన
శరునికేళులనొక్కటై ♦ సరసమార్గ
మునఁ జరించినమావంటి ♦ జనులకెల్ల
సమ్మదంబగుచుండునా ♦ సంతతంబు. 147

వ. ఇవ్విధంబున నర్మనర్మోక్తినర్మగర్భనర్మహాసంబు నర్మస్ఫోటంబు లగు భావంబుల స్మితంబు ను హసితంబు ను విహసితంబు ను పహసితంబు న పహసితంబు నతిహసితంబుల స్మితహసితంబులు త్తమస్థానంబుల విహసితోపహసితంబులు మధ్యములయెడ నపహసితాతిహసితంబులధమపక్షంబులు నివి మొదలగు చాతుర్యంబులు గరపి రసాభిజ్ఞానయోగ్యం బగు భావం బీషద్వ్యక్తవికారభావం బగు హావంబు సువ్యక్తవిక్రియాభావంబు గల హేల యు భూషణాభావం బై మనోహరం బై తోచు మాధుర్యంబు శీలాద్యలంఘనం బై కనుపట్టు ధైర్యంబు ను ప్రియానుకరణసరసవాక్యగత్యాదిచేష్టితంబు గల లీల యు మనోరమహితేక్షణంబు లగు విలాసంబులు స్వల్పభూషణాతిరమ్యం బై తగు విచ్ఛిత్తి యు భూషణస్థానవిపర్యయంబున నగు విభ్రమంబు ను రోషాశ్రుహర్షభీత్యాది సాంకర్యంబున నొప్పు కిలికించితంబు నిష్టకథాదిసంభవభావసూచనంబు గల మోట్టాయితంబు ను రతిసంమర్దసుఖాధిక్యం బగు కుట్టమితంబు ను విలాసజనితం బైన బిబ్బోకంబు ను నిరంతరసౌందర్యంబునం దగు లలితంబు ను మనోజ్ఞదృష్టిచపలత్వంబు గల కుతూహలంబు ను భయసంభ్రమంబులం దగు చకితంబు ను వాక్యావివరణంబు గల విహృతంబు ను వికృతివస్తుసంజాతం బై తోచు హాసంబు ను నివి మొద లగు నష్టాదశశృంగారచేష్ట లెఱుంగం జేసి స్థాయీభావంబులఁ బరస్పరావలోకనసంభాషణాలింగనచుంబనాద్యనేకవిధవ్యాపారంబులు గల శృంగారరసంబునకు త్సాహంబుఁ బుట్టించి నగుచుఁ బ్రియునివలనఁ బ్రతిదినాభ్యస్తరతిగతు లెఱింగి యకాంతారత్నంబు. 148

సీ. పర్వేందుఖండప్ర • భా ఫాలతలమున
నానుకుంతలములు న • ర్తనము సలుప
సురుచిర భాస్వన్మ • కురకపోలస్థల
ముల మణితాటంక • ములు నటింప
విలసితశ్రమజలం • బులచే తనించుక
దొలఁగిన మౌక్తిక • తిలక మలరఁ
గుచకుంభములమీఁదఁ • బ్రచురంబు లగు తార
హారముల్ డోలావి • హార మొంద

జఘనఘనమేఖలారావ • చరణనూపు
రస్వరంబులు గళరవ • సుస్వరములు
కంకణనినాదములు నొక్క • గతిఁ జెలంగఁ
బడతి వీరాయితమున న • వ్వలి గలంచె. 149

వ. ఇవ్విధంబునఁ గరంచిన బ్రహ్మానందంబు నొంది. 150

సీ. మౌక్తికంబులఁ జంద్ర • మండలంబు జెలంగ
విరళతారల వ్యోమ • వీధి దనరెఁ
జంచలత్వము మాని • స్మరచాపము దోఁచెఁ
గలరవంబులు మానెఁ • గలరవములు
నించుక ముకుళించె • నిందీవరంబులు
కమ్మతెమ్మెరలు ని • లుకడలఁ జెందె
నచలితస్తబకలై • యలరెఁ జంపకవల్లి
చిరుతవెన్నెల గల్గి • చిగురు నిగిడె
మెఱుపు లొందిన మేఘంబు • విరివి దోఁచె
నేమి చిత్రంబొ కానిరో • భామ యనుచు
సరసవచనరచనలన • త్తరుణి గరఁగఁ
జేసి సంతోషవారిధిఁ • జెందె నృపుఁడు. 151

వ. ఇవ్విధంబునఁ జాటూక్తిమధురిమధురీణంబు లగు వచనంబులఁ బ్రతిదినంబు సమస్తబంధవిశేషసురతంబు ప్రౌఢనాయికగా నొనరించ నమ్మానవతి స్వాధీనపతికాలక్షణలక్షిత యై సరససల్లాపహావభావవిలాసవిభ్రమాదులఁ గొన్నివాసరంబులకు నకీర్తిమాలిని ప్రౌఢిమఁ జెంది ప్రియునిమనంబుఁ గరఁగించి యుండునంతఁ జంద్రాంగదుం డంతరంగంబున. 152

గీ. అరయ నితఁడు దశార్ణదే • శాధిరాజ్య
పూజ్యుఁ డగు వజ్రబాహుని • పుత్త్రుఁ డగుటఁ
దద్విషయమున కాధిప • త్యము వహింపఁ
జేయవలె నని సంతోష • చిత్తుఁ డగుచు. 153

క. ధీరుఁ డగు మంత్రి నొకరునిఁ
జేరి తదధ్యక్షుఁ డటకుఁ • జేరు నుపాయ
ప్రారంభం బొనరింపు మ
హారయమున నేగి యనిన • నతఁ డట్ల నుమన్. 154

సీ. దాశార్ణదేశప్ర • ధానపూరధివాస
వాసవోల్లాసి యా • వజ్రబాహు
కాత్మగతంబు చం • ద్రాంగదప్రేషిత
త్వం బని ముందుగాఁ • దగ వచించి
మీరు విచ్చేయుట • మేలు సిద్ధించు నీ
యెడలను సమ్మోద • మలరుచుండ
హస్త్యశ్వరథపదా • త్యాప్తభృత్యామాత్య
హితపురోహితసమ • న్వితుఁ డవగుచుఁ
దొలుత గిరిసరిదుపవన • ములను దుర్గ
దుర్గమస్థానముల నెల్ల • నిర్గమించి
ధన్యచంద్రాంగదప్రసి • ద్ధప్రధాన
నగరిఁ జూడంగఁ జనిన న • జ్జగతివిభుఁడు. 155

క. చతురంగబలము గొలువఁ గ
నతిరయమున నెదురుకొనుచు • నన్యోన్యసమ
ర్పితనమనాలింగనములఁ
జతురవచనరచన లెనయ • నల్పుచుఁ బ్రేమన్. 156

క. నవరత్నమయశుభోద్బా
హువిధసవిధవివిధమణిస • మన్వితము సభా
భవనమున కలరుచు దశా
ర్ణవిభుం దోతెంచి మణిక • నకపీఠమునన్. 157

క. వినయమునఁ జేర్చి సింహా
సనమున నూతనలతాంత • శరుఁ డనఁ దగురా

ట్తనయునిఁ గనుఁగొని నిజజీ
వనదునిఁ గాఁ దలఁచ నతఁడ • వారణ భక్తిన్. 156

సీ. పాదమూలములపైఁ • బ్రణమిల్లి కరిన వే
గంబు గాఢాలింగ • నం బొనర్చి
యితఁడు మత్ప్రాణదుం • డితఁడు మద్బాంధవుం
డితఁడు మచ్ఛుసం • హితహరుండు
ఈతని యన్వయం • బీతని సౌందర్య
మీతనివిక్రమం • బెల్ల నాకు
సరసోక్తిఁ దెల్పునై • షధమహారాజేంద్ర
యన నుపాంశుస్థితి • నతనిఁ గూర్చి

యమ్మహాత్మునిజననాదు • లేర్పడంగఁ
దెలియ వచియింతు నిప్పుడు • ధీరహృదయ
సావధానమనంబుతో • నలరి విను మ
టంచుఁ జంద్రాంగదుం డిట్టు • లనియె నగుచు. 157

మ. అవనీనాథ యితండు నీసుతుఁడు రో • గార్తుండు నై యుండ నీ
వవినీతాత్మత మాతృయుక్తునిఁ గ బ్ర • హ్మారణ్యమార్గంబునం
దవులం జేయఁ బరిభ్రమత్క్రిమసమి • ద్ధవ్యాధిచే నాధిచే
వివిధాపద్దశచేఁ గృశింపుచు సమా • విర్భూతభీతస్థితిన్. 158

మ. బహుధాధావదనేకభీకరమృగా • బ్రహ్మణ్య మర్దింపుచున్
గహనప్రస్ఫుటకంటకావృతలతా • క్రాంతాలకాంతాళి రై
యహరీశోగ్రసమగ్రఘృష్టిపరిత • ప్తాంగంబునన్ బ్రుంగ దు
ర్దహనజ్వాలవిశాల మైన పదముం • దాపంబు నొందింపఁ గన్. 159

గీ. పుణ్యుఁ డైనట్టి యొకవైశ్య • పుంగవుండు
సార్థవజ్జనపదమునం • దధివసింప
వనట నొందుచుఁ దత్స్థాన • మునకుఁ బోవ
నతఁడు గన్గొని ప్రేమద • యార్ద్రమతిని. 160

క. అగదంకారుల బహువిధు
లగువారలఁ బిల్వఁ బంపి • యజ్జననీపు
త్త్రగదవినివారణంబుగ
జగతిఁ గలుగు నౌషధముల • సవరణ లొనఁగన్. 161

సీ. పొనఁగంగ నానఁగఁ ద • త్పుత్త్రుండు మృతుఁడైన
దీనాత్మ యగుచు న • ద్దేవి దలఁక
ఋషభాఖ్యశివయోగి • యేతెంచి ప్రీతిచే
సంజీవితునిఁ జేసి • సదయుఁ డగుచు
వాని దివ్యాకార • వంతునిఁ గాఁ జేసి
యారాజపుత్త్రుని • కతిముదమున
శత్రువధంబులో • శంఖఖడ్గము లిచ్చి
యొనసి ద్వాదశసహ • స్రేభబలము
నొసఁగి సకలార్థశాస్త్రసం • యుక్తుఁ జేసెఁ
గాన నితఁడు సమర్థుండు • ఘనవిచార
రాజవదనుని బుత్త్రుని • రాజధాని
కిపుడు దోడ్కొని పొమ్ము మ • హీశతిలక. 162

క. అని సర్వంబు వచించిన
విని విస్మయ మంది కుంది • వెనుకను దాఁ జే
సిన దుర్న్యయమును దెగడుచు
జననాథుఁడు సమ్మదమున • సత్వరుఁ డగుచున్. 163

క. ఆయుగ్రభార్యతనయునిఁ
బాయని మోహంబుతోడఁ • బరిరంభములన్
డాయం జేయుచు సమ్మో
దాయత్తమనంబు దోప • నధిపతి యచటన్. 164

వ. కొన్నిదినంబు లధివసించి తదిష్టగోష్ఠితో నుండు నెడ. 165

క. ఆనైషధుండు బహుబహు
మానం బొనరించి నగ్ర • మహిషిని సుతునిన్

నానావిధమణినికర
స్త్యానరథంబులను నిడుక • చయ్యన వచ్చెన్. 166
క. వచ్చి నిజరాజధానికి
విచ్చవిడి వియచ్చరాళి • వెరఁ గందఁ గ నా
సచ్చరితుఁ డైన పుత్త్రునిఁ
జెచ్చెర సింహాసనస్థుఁ • జేసె ముదమునన్. 167
వ. ఇట్లు చేసిన. 189
గీ సకలజనుల సదానంద • సరణిఁ దేల్చి
దేవగురువిప్రపూజాది • ధేయవృత్తిఁ
బ్రాజ్యతరపూజ్యసామ్రాజ్య • భార మూని
పరిబలె భద్రాయుఁ డింద్రవై • భవము దోప. 169
గీ. మగధదేశాధినాథు హే • మరథు ముందుఁ
బుత్త్రిమిత్త్రకళత్త్రప • భూతభూతి
నొందఁ జేయుచు విడచి యా • నందమహిమ
సకలపృథ్వీభరంబున • సంభ్రమించె. 170
చ. శివకవచప్రభావము ప్ర • సిద్ధతరర్షభయోగిదత్తఖ
డ్గవరదరపరితాపమున • ఖండపరాక్రమవిక్రమంబు పా
భవముఁ జెలంగు చుండఁ బరి • పంథివిదారణ మౌట చిత్ర మా
యవిరళదానధర్మపరుఁ • డౌటకుఁ జోద్య మె యెన్ని భంగులన్. 171
వ. అనియివ్విధంబున సకలవర్ణంబులవారు వినుతింప సామ్రాజ్యధురంధరుం డై యుండె నని సూతుండు శౌనకాదిమునీంద్రులకు నీపుణ్యకథాశ్రవణంబునఁ జతుర్విధపురుషార్థంబులు సిద్ధించు నని మఱియు వివరించి రైతిహ్య పురాణంబుల వినోదంబు సలుపు చుండె. 172
శా. అంతేజధ్వజకాండ కాండకకటా • హప్రాంచదుద్యద్యశ
స్తండప్రక్రమదక్ష దక్షసవన • ధ్వంసక్రియాహంక్రియా
ఖండప్రాభవచిత్త చిత్తజమహా • గర్వాభ్రభంజయానిలో
ద్దండధైర్యవిహార హారశరదు • ద్యద్వారిభృద్విగ్రహా. 173

క. సురథరణీధరశాసన
 శరసారధి తోదనల్పి • ణవ జవకృద్దా
 శరధిహితకరణాధీరత
 శరధీకృతశరధిశైల • శయ భూమిరధీ. 174

పృథ్వీవృత్తము.

నియుద్ధసమరోద్యమ • న్విజభుజాగ్రశాస్త్రత్రుట
ద్వియత్పృథువదాపత • ద్విమతతుండదండోత్తమా
భయభ్రమదహాసర్రా • భయకరవ్రచక్రభవ
త్స్వరోదయశరాసనా • తతసమాజికైకోత్సవా. 175

మ. ఇదిశ్రీవేములవాడపట్టణనివా • సేశానసంప్రాప్తశ
శ్వదయప్రాభవకామినేనికులరా • జారెడ్డిదేశాయిస
మ్మదలక్ష్మీపతిపండితోదితసుధీ • మందారభద్రాయుర
భ్యుదయాఖ్యాన్వితసత్ప్రబంధము రుచిం • పుం బంచమోల్లాసమై. 176

—*గద్య.*—

ఇది శ్రీమద్రామారెడ్డిపేట రాజరాజేశ్వర కరుణా కటాక్షేక్షణ
ప్రసాదప్రాప్తాశేషభాషావిశేష సామ్రాజ్యపూజ్య రాచుర్యగోత్ర
పాత్ర కామినేనివంశపయఃపారావారరాకాసుధాకర రా
జన్న దేశాయి సార్వభౌమా జ్ఞాపి తాంధ్ర గీర్వా
ణకవిత్వ చాతుర్య ధుర్య వరాశరగోత్ర
రాపాకలింగనార్యపుత్త్ర లక్ష్మీపతిప్రణీ
తం బైన భద్రాయురభ్యుదయం
బనందు సర్వంబును
బంచమోల్లాసము.

సంపూర్ణము.



